


మండు వేసవిలో
మలయ మారుతం!
మహిళల సౌందర్యానికి
మనోహర రూపం!
'గాంధి టెక్స్' చీరెల వైభవం




మీరు కొనే ప్రతి చీరెపై
ఈ లేబుల్‌ను
గమనించి కొనండి!

అన్ని ముఖ్యమైన షాపులలోనూ
లభించును

©
గాంధిటెక్స్
కాటన్ శారీస్

గాంధిటెక్స్ చీరెలో అందాల తార విజయశాంతి

H K INTERNATIONAL

# అంతా నిజాయితీ కలవారే!

స్వీడన్ మాజీ ప్రధాని ఒలోఫ్ పాల్మేను నెహ్రూ కుటుంబానికి స్నేహితుడుగా అభివర్ణించి ఉండనట్టయితే బోఫోర్స్ కుంభకోణం గురించి నేను పునరాలోచన చేసి ఉండేవాణ్ణి కాను కాని ఆ కుటుంబానికి స్నేహితులయినటువంటి వాళ్ళలో చాలా మంది ఆకర్షణీయమైన స్వార్థ ప్రయోజనాలలో మునిగిన అవాంఛనీయ వ్యక్తులుగానే తేలిపోయారు పాల్మే రాజీవ్ గాంధీలు ఆయుధాల వ్యవహారాన్ని స్వయంగా వారిద్దరే చర్చించుకున్నారని చదివినప్పుడు ఈ మొత్తం వ్యవహారంలో లోపాయకారీగా ఏదో ఉందని నాకు తెలిసి పోయింది ఇటువంటి విషయాలలో అతీంద్రియ శక్తులున్న నా మిత్రులెందరికో కూడా ఈ విషయం తెలిసిపోయింది ఈ వ్యవహారం గురించి ఆ ఇద్దరు ప్రధానులు తాము నాయకత్వం వహిస్తున్న రెండు ప్రభుత్వాల మధ్య కాకుండా ఇద్దరు వ్యక్తుల మధ్య చర్చగా జరిపారు

నివేదికల ప్రకారం పదిహేను వందల కోట్ల రూపాయలకు మించినదని తెలుస్తున్నటు వంటి వ్యవహారం గురించి మరెవరూ పక్కన లేకుండా ఇద్దరు ప్రభుత్వాధి నేతలు మాత్రమే ఎందుకు చర్చ జరిపారు? ఇతర ప్రభుత్వాధి నేతలందరి లాగానే పాల్మే కూడ ఈ వ్యవహారాన్ని ముందుకు తోసేందుకు గాను ఒక మంచి మాట మాట్లాడడాన్ని నేను అర్థం చేసుకోగలను కాని ఒక వ్యవహారాన్ని అందులోనూ రక్షణ ఆయుధాల వ్యవహారాన్ని చర్చించడం పూర్తిగా వేరే విషయం స్వదేశంలో హత్య చేయబడడానికి ఓ నెల ముందు 1986 జనవరిలో పాల్మే ఇక్కడికొచ్చినప్పుడు శాంతి ఉద్యమ నాయకుడుగా వచ్చారు దాని అర్థం ఏమన్నా అనుకోండి శాంతి ఉద్యమానికి నాయకుడిగా తనను తాను అభివర్ణించుకునే వ్యక్తి పగలంతా శాంతి గురించి ఉపన్యాసాలిస్తూ సాయంత్రాలు విదేశీ ప్రభుత్వాధి నేతలతో ఆయుధ వ్యవహారాలు చర్చిస్తూ రోజులు గడపడం చాలా ఆశ్చర్య కరమైన విషయం ముఖ్యంగా ఆయన స్వంత ప్రభుత్వం మూడవ ప్రపంచ దేశాలకు ఆయుధాలు అమ్మడాన్ని నిషేధించి ఉన్నప్పుడు స్వీడిష్ పత్రికలలో వస్తున్న వార్తలను బట్టి ఏమనిపిస్తున్నదంటే మూడవ ప్రపంచ దేశాలకు స్వీడిష్ ఆయుధాల అమ్మకం గురించి పాల్మే ప్రభుత్వానికి తెలుసు బహుశా అది ప్రోత్సహిస్తూ ఉండి ఉండవచ్చు కూడా శాంతి దూత అయిన పాల్మే కూడ ఇతర ప్రభుత్వాలతో శక్తులతో రక్షణ కంట్రాక్టులు చర్చించడం లో బాగస్వామిగా ఉండేవారా? చాలా సంవత్సరాల క్రితం లండన్‌లో ఒక అంతర్జాతీయ సోషలిస్టు సమావేశంలో యదాలాపంగా తప్ప పాల్మేను నేనెప్పుడూ కలుసుకోలేదు కాని ఒక సోషలిస్టు ప్రభుత్వాధి నేత తన స్వదేశీ చట్టాలకు వ్యతిరేక మయినటువంటి పనులు చేయడం నాకు విచిత్రంగా కనబడుతున్నది అందువల్లనే ఆయనను తోసి వేశారా? నాకు తెలియదు

స్టాక్‌హోమ్‌లో జరిగిన పాల్మే అంత్య క్రియలను మన దూరదర్శన్‌లో చూపించారు కొన్ని నిమిషాల పాటో కొన్ని గంటల పాటో కాదు పూర్తిగా ఒకరోజంతా చూపించారు ప్రపంచంలో ఇంకే టి వి కేంద్రం అలా చేయలేదు ఇది కేవలం పాల్మే నెహ్రూ కుటుంబానికి మిత్రుడైనందు వల్లనేనా లేక కంటికి కనిపించని విషయాలేమన్నా ఉన్నాయా? ఈ దేశం ప్రధాన మంత్రితో లాభసాటి అయినటువంటి వ్యవహారాన్ని చర్చించి పాల్మే స్టాక్‌హోమ్‌కు తిరిగి వచ్చారని గుర్తుంచుకోండి ఆ వ్యవహారం ఆయన దేశానికీ ఇక్కడ ఉన్నటు వంటి ఆయన

## న్యూఢిల్లీ లేఖ



డా. జయదుబాషి

స్నేహితులకూ లాబసాటి అయినదే ఈ అన్ని విషయాలనూ స్వీడిష్ ప్రభుత్వం పరిశీలిస్తుందని నేను ఆశిస్తున్నాను బోఫోర్స్‌కు ఇక్కడ విదేశాలలోను ఉన్నటువంటి బోఫోర్స్ ఏజెంట్లకు మధ్య ఉన్న సంబంధాన్ని మాత్రమే గాక రెండు దేశాల రాజకీయ నాయకుల మధ్య ఉన్న సంబంధాన్ని కూడా పరిశీలిస్తారని నేను ఆశిస్తున్నాను

ఇప్పుడు మనం నెహ్రూ కుటుంబానికి ఉన్నటువంటి ఇతర స్నేహితుల సంగతి కూడా చూద్దాం మొట్ట మొదట కృష్ణమీనన్ ఉన్నారు ఆయన గురించి ఎంత తక్కువ చెపితే అంత మంచిది ఆయన కూడా అనుమానాస్పదమైన రక్షణ లావాదేవీలలో చిక్కుకున్నారు అయితే అప్పుడు జలాంతర్గాములు హా విట్జర్‌లు లేవు ఆ వ్యవహారాలలో ఆయన ఆయన సహచరులు ఎంత సొమ్ము చేసుకున్నారు? ఏమో మనకు తెలియదు కాని తెలిసిందేమిటంటే చైనా సరిహద్దుపై మనం దెబ్బతినడానికి బాధ్యులైన వారిలో నెహ్రూతో పాటు మీనన్ కూడా ఉన్నారు మన స్వాతంత్ర్యానంతర చరిత్రలో అది ఒక తలవంపులు తెచ్చిన ఘట్టం మీనన్‌కు కూడా పెద్ద సోషలిస్టుగా కనబడాలనే అలవాటుండేది ఐతే బ్రిటన్‌లోని సోషలిస్టు పార్టీ ఆయనను మునివేళ్ళతో తాకడానికి కూడ ఇష్టపడేది కాదు

తర్వాత మన పాత మిత్రుడు ధర్మతేజ ఉన్నారు ఇప్పుడు లేరనుకోండి తేజ కూడా మీనన్ నమూనా లోనే తయారయ్యారు ఆయన కూడా సోషలిస్టుననే చెప్పుకునేవారు ఆయన తన మిత్రులు నెహ్రూ కుటుంబం ఇచ్చిన డబ్బుతో ఈ దేశాన్ని తమ ఇష్టా రాజ్యంగ బావించారు నెహ్రూ ముని మనవల్ని విదేశాలలో చదివించడానికి అవసరమైనటువంటి డబ్బు పెట్టిన వారు ధర్మతేజే వాళ్ళు ఎక్కువగా చదువు కున్నట్టు లేరనుకోండి చివరిలో ఆయన జైలుకు వెళ్ళారు ఆయన మరీ పేదవాడిగా ఏమీ చనిపోలేదు పాల్మే కూడా పేదవాడిగా చనిపోలేదు ఆయన మొత్తం విదేశీ మారక ద్రవ్యంలో

ఇందిరాగాంధీ పేర 10 లక్షల రూపాయల పెద్ద బహుమతిని అందుకున్నారు స్టాక్‌హోమ్ వీధుల్లో కాల్చి చంపబడటానికి ఓ నెల ముందు ఆయనకు ఈ బహుమతి లబించింది ఏదో ఒక కారణం మీద నెహ్రూ కుటుంబ స్నేహితులందరూ దారుణమైన అంతాన్నే పొందారు వాళ్ళు ప్రధాన మంత్రులయినప్పటికీ సాదా విశ్వాస పాత్రులయిన యుక్తి పరులయినప్పటికీ

మన మూడో మిత్రుడు స్వరాజ్‌పాల్ మన దయవల్ల ఆయన లండన్‌లో బాగానే ఉన్నారు ఆయనకు కూడా గతంలో ఒక చక్కెర వ్యవహారంలో సంబంధం ఉన్నదనే ప్రస్తావన వచ్చింది నమ్మినా నమ్మక పోయినా ఈ వ్యవహారానికి మదుపు స్విస్ బ్యాంకుల నుంచి వచ్చింది లేదా అలా ప్రచారం జరిగింది శ్రీపాల్ స్విస్ బ్యాంకుల నుంచి తీసుకున్న డబ్బుతో ఒకటి రెండు కంపెనీలు కొనాలని ప్రయత్నించారు ఆ కంపెనీలు గొడవ చేశాయి అది తమ స్వంత డబ్బేనని స్వరాజ్ పాల్ అంటారు బోఫోర్స్ వ్యవహారంలో మధ్యవర్తులు లేరని రాజీవ్‌గాంధీ అన్నప్పుడు నేను ఆయనను ఎంత నమ్ముతానో స్వరాజ్ పాల్‌నూ అంతే నమ్ముతాను కాని అందుకు వ్యతిరేకంగా నమ్మేవాళ్ళు ఇక్కడ చాలామంది ఉన్నారు వాళ్ళు ఆ డబ్బు శ్రీమతి ఇందిరాగాంధీదని అంటారు కాని కొందరు విషయాన్ని ఆసక్తికరం సంచలనాత్మకం చేసి తమ పత్రికలు అమ్ముకునేందుకు గాను ఏమైనా అంటారు ఏది ఏమైనా శ్రీమతి ఇందిరాగాంధీ చనిపోయారు స్వరాజ్ పాల్ స్నేహితులు రంగం నుంచి తప్పుకున్నారు మొత్తం వ్యవహారం బెడిసి కొట్టింది చాలా కష్టం మీద స్వరాజ్ పాల్ తన డబ్బు వెనక్కి తీసుకున్నారు కాని ఇప్పుడు ఆ డబ్బు ఒక నెంబరు ద్వారా మాత్రమే తెలిసే రహస్య స్విస్ ఖాతాలో సురక్షితంగా ఉన్నదని తగిన సమయంలో మళ్ళీ బైట పడుతుందని ఎవరైనా ఊహించవచ్చును

ఈ ఉదంతా లన్నిటిలో ఉన్నటు వంటి పోలికను మీరు గమనించారా? అన్నిటిలోనూ ఉమ్మడి అంశం స్విస్ బ్యాంకు ఎందుకంటే మీరు ఎక్కడ ఎటు వంటి పద్ధతిలో డబ్బు సంపాదించినా అది చివరికి సహజంగా దాని స్వస్థలమైన జూరిచ్‌కో జెనీవాకో అటువంటి ఖాతాలు ఉండే మరో చోటికో చేరుతుంది పాల్మె డబ్బు తేజ డబ్బు పాల్ డబ్బు జెనీవాకే చేరుకున్నాయి మీకు గుర్తు వుంది ఉంటే కృష్ణమీనన్ తమ జీవితంలో ఎక్కువ కాలం అక్కడే గడిపారు

నేను విషయాలను ఊహిస్తున్నానని మీరనుకోవచ్చు నెహ్రూ కుటుంబానికి (భారత ప్రభుత్వం అనికూడా అంటున్నారు) విదేశీ డబ్బుకు సంబంధం లేదని ఒలోఫ్‌పాల్మె ధర్మతేజ స్వరాజ్ పాల్‌లు కూడా జవహర్లాల్ నెహ్రూ ఇందిరా గాంధీల లాగే నిజాయితీ పరులయిన మనుషులుగా ఉండే వారని ఉన్నారని మీరు అనుకోవచ్చు ఔను వాళ్ళు నిజాయితీ పరులుగానే ఉండేవాళ్ళు ఔను వాళ్ళు నిజాయితీ పరులుగానే ఉన్నారు తథాస్తు! □

# గుడ్డు ధరకి కోడి కొనగలమా?



సాటిలేని మేటి ఆల్విన్

మీకు అవసరమయింది పనితనం, సామర్థ్యం, నమ్మిక, నాణ్యత అయితే, మీకు కావలసింది ఆల్విన్ రిఫ్రిజిరేటర్ మాత్రమే. వాడుకలో ప్రతి ఆల్విన్ రిఫ్రిజిరేటర్ ఒక మణిపూస.

ప్రత్యేక లక్షణములు:-

- హిటాచీ కంపెనీ వారిచే నిర్మించబడిన కంప్రెసర్.
- త్వరితగతిని చల్లబరిచే సమర్థనీయమైన "రోల్ బాండ్‌ఫ్రీజర్
- స్టెబిలైజర్ అవసరము లేకుండా 170 నుండి 250 వోల్టుల వరకు పని చేయు శక్తిగలది.
- కేవలము మీట నొక్కితే చాలు. దానంతటదే మంచు కరిగిపోవును.
- వీటన్నిటితో బాటు ఏడు సంవత్సరముల గ్యారంటీ.
- ఇంకా దేశవ్యాప్తంగా సాంకేతిక సర్వీసు సౌకర్యం.

మీకు పసందైన రంగులలో 165 మరియు 300 లీటర్లలో సింగిల్‌డోర్ డబుల్ డోర్‌లలో లభ్యమవుతుంది ఆల్విన్ రిఫ్రిజిరేటర్



7 సంవత్సరాలు గ్యారంటీ




ఆల్విన్




అన్ని వేళలందు ఆల్విన్

MAA(S) AWN 2A TEL 86

# ప్రముఖుల సందేశాలు

"వేయిపడగలు వారపత్రికలో ముద్రిస్తున్నందులకు చాల సంతోష పడుతున్నాను ఆ రచన వకనాటి మన జీవితానికి అద్దం పడుతూంది మన సమాజం ఏ స్థాయి నుండి ఎక్కడికి దిగజారి పోయిందో వేయిపడగలు చదివితే చక్కగా అర్థమవుతుంది ఈ నాడు చాల మంది అర్థరహితంగా బ్రతుకుతున్నారు. వేయిపడగలు చదివినపుడు మరలా మన పాత జీవితాన్ని వక్క సారి నెమరు వేసుకొనే



దానికి అవకాశం వున్నది. మీ ప్రయత్నాన్ని మనః పూర్వకంగా హర్షిస్తున్నాను.

పుట్టపర్తి నారాయణాచార్యులు, కడప

★ ★ ★

'వేయి పడగలు నవలని మళ్ళీ సీరియల్‌గా వెయ్యదలచి నందుకు అభినందనలు కొత్తతరం పాఠకులకు ఆ నవలని యిలా అందుబాటులోకి తేవాలన్న మీ నిర్ణయం చాల సముచితంగా వుంది నేడు ప్రవర్తిల్లు తున్న అభిరుచుల దృష్ట్యా-

వేయి పడగలు ప్రధానంగా సాంస్కృతిక నవల పాశ్చాత్య నాగరకతా ప్రభావం వల్ల తెలుగుదేశంలో అదృశ్యమైన పూర్వ నాగరకత చివరి మెరుగుల్ని హృదయంగమంగా, చిరస్మరణీయంగా చిత్రించిన బృహత్కావ్యం. వెయ్యి పుటల కావ్యంగా విస్తృతమైన, బహుముఖీనమైన వస్తువునకు ఒక నిర్దిష్టమైన ఆకృతి తీర్చిదిద్దారు విశ్వనాథ. రెండు సార్లు వచ్చిన గుండేరు వరద విభజన రేఖలుగా యితివృత్తాన్నీ, కథా గమనాన్నీ అర్థవంతంగా రూపొందించారు. ప్రతీకల్ని పాత్రలుగా రూపొందించ డంలో (పసిరిక, గణాచారి), పాత్రలని ప్రతీకలుగా భాసింప జెయ్యడంలో (ధర్మారావు, గిరిక, హరప్ప) విశ్వనాథ సాధించిన విజయం తెలుగు నవలా శిల్పం చేసిన శిఖరారోహణ.

'వేయి పడగలు' నవల ఈనాటి సామాజిక సమస్యలకు పరిష్కారం సూచించే రచనకాదు దాన్ని సమాజ భవిష్యత్తుకు మార్గదర్శిగా ఉపలక్షిం చడం సరియైన దృష్టి కాదు వీరేశ లింగం గారు నవలకు సంఘ సంస్కరణోద్దేశం కట్టబెట్టారనీ రాజకీయ వాదులు సాహిత్యం విప్లవ నిర్దేశకం కావాలంటున్నారనీ, ఆ దృష్టితో వేయి పడగలు' నవలది వెనుక చూపని విమర్శించడం సహృదయత కాదు కేవలం అప్రస్తుత ప్రసంగం మారిన ఒక నాగరకత వైలక్షణ్యాన్ని కళాత్మకంగా నవలలో చిత్రించి నవలను కావ్యం చేసిన విశ్వనాథ ప్రతిభను ఈతరం తెలుగువారు సహృదయతతో గుర్తిస్తారని ఆశిస్తున్నాను.

—ఆర్. ఎస్. సుదర్శనం,

రాజమండ్రి

★ ★ ★

సామాజిక జీవితంలోని పలురంగుల సమన్వయ చిత్రపటం 'వేయి పడగలు' నవల. వివిధ మనస్తత్వాలకు చక్కని భాష్యం అని 'సారస్వతోపాసకులు ఏనాడో దానికి సార్థకమైన పేరు పెట్టారు. సంప్రదాయాన్ని మన్నించే వారికి అది సింహాసనం. సారస్వత ప్రక్రియల నన్నింటినీ నిర్విరామ దీక్షతో అక్షర రూపాన ప్రకటించిన సర్వతో ముఖ ప్రతిభాశాలి కనుక అలాటి నవల సృష్టించి వేయి పడగల శేముషుగా విశ్వనీరాజనం అందుకున్న చరితార్థుడు మా అన్న శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

ఆనవలను ఆంధ్ర సచిత్ర వార పత్రికలో ధారా వాహినిగా ప్రకటించ సంకల్పించడం సంప్రదాయజ్ఞులైన మీకు సముచిత కార్యం అది నిర్విఘ్నంగా సాగాలనీ, ఆధునిక పాఠకలోకం అభినందనాలు మీరు అందుకుంటూ ఉండాలనీ నా శుభాకాంక్ష-

-యామిజాల పద్మనాభస్వామి,

త్యాగరాయనగర్, మద్రాసు

★ ★ ★

కవి సమ్రాట్టు విశ్వనాథ సత్యనారాయణ గారి వేయి పడగలు ధారా వాహికంగా ఆంధ్ర సచిత్ర వారపత్రికలో మళ్ళీ వెయ్యబోతున్నందుకు ఎంతో సంతోషిస్తున్నాను.

"వేయి పడగలు" ఐదు దశాబ్దాల



క్రిందట వెలువడిన 'నవల' ఐనప్పటికి దాని విలువ తగ్గలేదు. ప్రపంచంలోని ప్రతి సాహిత్యంలోనూ 'నావెల్' అనగానే ఇలా చూచి అలా పారవేయవలసిందే, అని ప్రతీతి కాని పురాణేతి హాసాల స్థాయికి ఎదిగి శశ్వత్ కీర్తి గణించు కున్న ఏకైక నవల వేయి పడగలు ఇది తెలుగులో ఉండటం ఆంధ్రులకి గర్వకారణం. మీ సంకల్పం ప్రశంస నీయం

వజ్ఝల కాళిదాసు,

జెమ్‌షెడ్ పూర్

---

రైతులందరు ఉద్యోగస్తులతో పాటు పోయి కుర్చీల నాక్రమించిరి తక్కిన జనులు గ్యాలరీ నలంకరించిరి పరిచారకులును మిగతావారును నేల పై కూర్చుండిరి ప్రదర్శన మారంభించిరి విద్యార్థులందరు ప్రదర్శకుల కరతాళ ధ్వనులచే గౌరవించిరి

రాత్రి పన్నెండు గంటలకు ప్రదర్శనమైపోయెను కుటుంబరాయడు గారికీ ప్రదర్శన నచ్చలేదు పులుల నాడించినవాడన్నచో మఱియు కోపము వచ్చెను వాడేమి హరప్పనాయడా కృష్ణప్ప నాయడా? వెనుక తుపాకితో నొక మనిషి నిలుచుండగా తిండిలేక మలమల మాడుచున్నవి - అరణ్య సంచారమే ఎఱుగనివి, మనుష్యులను చూచుట కలవాటుపడినవి - యీ మృగముల నాడించుటలో అతనికేమియు గొప్పదనముగాని మెచ్చదగినది గాని ఏమియు కనపడలేదు తక్కిన పనులసలు నచ్చలేదు దొమ్మరివాండ్రింతకన్న బాగుగా చేయుదురని ఆయన ఊహ రాను పోను ఖర్చులిచ్చి వేయి రూపాయలు వీరి మొగమున పోయుటకన్న నిందులో సగమిచ్చినచో దొమ్మరి వాండ్రు వచ్చి యింతకన్న బాగుగా నాడుదురో వారికిచ్చిన డబ్బు పేదవారైన అనుభవించి నట్లగును వీరందఱు పటాటోప మెక్కువ చేసి దన మాకర్షించుట తప్ప మఱేమియు లే దని కుటుంబ రాయడుగారనిరి

ప్రదర్శనమైపోవు వఱకును దెబ్బలు తిని కూడ జనము డేరా బయటనే నిలిచి ఉండిరి పల్లెటూరి జనులు ప్రదర్శనము తెల్లవారులుండుననుకొనిరి రాత్రి రెండు జాములకే అయిపోయినదని తెలియగానే ఇష్ ఇంతేనా! అనిరి అప్పుడు జనము తమ పల్లెలకు పోవబయలుదేఱిరి సుబ్బన్నపేట ఊరు వెలుపలికి బోవు వఱకు దీపాల వెలుతు రంతరించెను ఆనాడు శుక్లషష్ఠి అపుడే చంద్రాస్తమయ మయ్యెను డేరాలోనికి ప్రదర్శనము చూచుటకు అతనిని కూడ రానీయ లేదు కాబోలు! అస్తమించుచున్న ఆ చంద్రుని మొగము గూడ కంది ఎఱ్ఱనై కందగడ్డవలెనయ్యెను ఎట్లయినను రాజు కదా! తిరస్కారము సహించలేడు సామాన్య జనుల కేమున్నది? వారు నవ్వుచు త్రుళ్ళుచు స్వగ్రామముల దారి పట్టిరి

వెనువెంటనే చీకట్లు తరుముకొని వచ్చెను ఆకాశము నల్లని మహాసముద్రము తరంగములు తరంగములుగా లేచి భూమి యను తీరమునకు కొట్టుకొనినట్లు రాత్రించరులయిన భూత ప్రేతాది నానా పిశాచ వికట భ్రూ పరివర్తనచ్ఛటా సంతానము దిశలావరించినట్లు తిరోహిత సూర్య తేజస్కమై కాలము సహజాకృతి పొందినట్లు దిక్కులను ఎలుగుబంట్లు స్వశరీర లంబమాన బహు దీర్ఘ కేశములతో సంచరించుచున్నట్లు, అజ్ఞానము వీలుచిక్కి జ్ఞానమునెద త్రోసి మనస్సులో తులకెల్ల ప్రాకినట్లు కాల సర్పము లొకదాని నొకటి యొఱసికొనుచు లెక్క లేనన్ని సంచరించి నట్లు చీకటులు విజృంభించెను

మరునాడు భోగము మేళములనే ఆడించిరి రామేశ్వరముగారు వీనికి పెద్ద డబ్బిచ్చి పిలిపించిన వారందరి నట్టేపెట్టి రత్నగిరి మేళమునే ఆడించ నారంబించెను రత్నగిరికి నలుబది ఆరేండ్లు వార్ధకము నెమ్మదిగా నామె శరీరముపైకి ప్రాకెను దేహము స్థూలమై పూర్వము వలె అబినయాదులు చేయలేకుండెను రామేశ్వరముగారామెనే గజ్జె కట్టుమనిరి గజ్జెకట్టి యిరువది యేండ్లయినను రత్నగిరి ప్రభువులున్నారు తన విద్య మెత్తురని అంగీకరించెను పైని తానే అనాహూతగ మేళమునకు వచ్చెనాయెను వేయక తప్పినది కాదు

ప్రార్ధనాదికములయిన తరువాత ఆమె అద్యాత్మము పాడ నారంబించెను అవి కాదు జావళీలు పాడు మనిరి ఆమె క్షేత్రయ పదము నొకటందుకొని అబినయము ప్రారంబించెను ఆమె మొగమున నంతలో కందరము లన్నియు విచిత్రముగా కదలాడి ఒక క్రొత్తదనము వచ్చెను

అదరెనే మోవి తనకు దానె వదలెనే నీవి - పల్లవి
మదిలోన వాడేమొ మంత్రించె గాబోలు!

సుదతి మువ్వగోపాలు చూచినది మొదలు - అదరెనే

పల్లవి అందుకొనునప్పటికి ఏబది ఏండ్ల రత్నగిరి పదునాఱేండ్ల కన్యవలె లఘు శరీరయై నూతన యౌవనావిర్భావవేళ నాయకుని ప్రథమ సందర్శనము పొందిన నాయికవలె ముగ్ధ ముఖ రేఖాంచలయై మారిపోయెను అదరెనే మోవి అని




## వేయిపడగలు

అదరినటులు గదలించెను ఆ కదలిక హఠాత్తుగా తామర రేకు మీద గాని గులాబి పూవు మీదగాని మంచుబిందువు పడినచో అవి ఎట్లు కదలునో అట్లు కదలెను ముఖమంతయు నిశ్చలమైఉండగా అదరమునది యెట్లు ఆ రీతి కదల్చెనో బ్రహ్మదేవుని కైనను ఆ అదర మట్లు కదల్ప గలుగుట కెంత పరిశ్రమ చేసెనో?

సుందరాతి సుందరముగ ఎడమ చేతతో నీవి బాగమును పూని నృత్తము చేయుచు మఖల పల్లవి అందుకొనుచు రత్నగిరి బొంగరమువలె కదలి పోయెను

"మదిలోన వాడేమొ మంత్రించె గాబోలు అని శృంగార రసము యొక్క స్థాయి బావ మయిన రతియొక్క దశావస్థలలో ప్రథమావస్థయైన దర్శనము విస్తరింపబడిన నేత్రములతో లజ్జానురాగములు మిళితములైన ముఖ బావములతో కించిదం కురిత పులకములైన కపోలములతో ముగ్ధ నాయికా లక్షణములు ముమ్మూర్తుల తనకు సరిపోగా ఆమె ఉన్నప్పుడు రస ప్రపంచములు పులకరించెను అనుపల్లవి అని మఖల పల్లవి అన్నపుడామె ప్రకటించిన లయ జ్ఞానమునకు నాదమయ ప్రపంచములు చందో గమనము పొందెను

ఒకసారి మువ్వగోపాలు దని ఒకసారి వేణుగోపాలు దని రత్నగిరి ఆ పాదమును రండుసార్లు చెప్పెను మువ్వగోపాలుని పదములు సుబ్బన్నపేట వారాంగన లందరు అట్లే అందుర. జమీందారుల యిలవేలుపైన వేణుగోపాలుని నామమే వారా పదముల తుదనుంతురు కాని అసలు మువ్వగోపాలుని పేరు గూడ ఒకసారి అందురు

వేణుగోపాలుని చూచినది మొదలు అని బగవంతుని వేణుగాన వైఖరు లనేకవిదముల వ్యత్యస్తపాదారవిందముగ ముఖసన్ని



# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు
**దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు**

స్థాపితం 1908

**శివలెంక శంభుప్రసాద్**
సంపాదకుడు (1938-1972)

22-29 మే, '87

శ్రీ ప్రభవ నామ సం వైశాఖ బ దశమి

**సంపుటము 79 : సంచిక 38**

ముఖ్య సంపాదకుడు
**శివలెంక రాధాకృష్ణ**

కార్యవాహక (యాక్టింగ్) సంపాదకుడు
**మతుకుమల్లి మాధవరావు**

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు 2 75 |
| పోస్టులో 6నెలల చందా | రు 80 60 |
| పోస్టులో 12నెలల చందా | రు 161 20 |

**ఆంధ్రపత్రిక కార్యాలయము,**
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

ముఖచిత్రం
నటి మాధవి
(ఫొటో కె ఆర్ వి భక్త)

### కథలు :



### సీరియల్ నవలలు:



### వ్యాసాలు, శీర్షికలు :






## ముఖచిత్రం

24–30 ఏప్రియల్ 87 ఆంధ్రసచిత్ర వారపత్రిక బానుప్రియ ముఖచిత్రం అత్యంత ఆకర్షణీయంగా ఉంది
ఎస్ కుమార్ ఇచ్చాపురం

## వేయిపడగలు

రామాయణ
కల్ప వృక్షచ్ఛాయ కంటి
వేయి పడగల నీడ కోసమే
పరుగు
శేష తల్పం శయ్య
కల్ప వృక్షం కొయ్య గదా!

**ఆర్ నరసింహారావు, నూజివీడు**

★ ★ ★

బానుప్రియ ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్రసచిత్ర వారపత్రిక అత్యంత ఆకర్షణీయంగా వుంది కవి సామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ కలం నుండి వెలువడిన వేయి పడగలు సీరియల్‌గ ప్రచురిస్తున్నందుకు నా కృతజ్ఞతలు

కొత్తపల్లి విజయకుమార్, కదిరి

★ ★ ★

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారి వేయి పడగలు' సీరియల్ నవలకై వారం వారం వేయి కళ్లతో ఎదురు చూస్తున్నాము ఇంత మంచి నవల మా పత్రికలో చదవటం మాకు గర్వంగా ఉంది

బందిగి బాలరాజు, వనిత నారాయణపేట

★ ★ ★

సాహితీ విశ్వనాథుడు స్వర్గీయ విశ్వనాథ సత్యనారాయణ గారి నవలా తిలకము వేయి పడగలు సీరియలుగా మీ వారపత్రికలో ప్రచురించ పూనుకోవడం ఎంతైనా ప్రశంసనీయం

మా చిన్న తనంలో ఈ నవలను ఆసాంతమూ చదివి ముగ్ధులైన వారెందరో! మళ్లీ ఇన్ని సం ల తర్వాత ఈ నవలను చదువుతూ వుంటే, మనస్సు ఉర్రూత లూగి అనిర్వచనీయ మైన మధురానుభూతి కలిగింది

తెలుగు పాఠక లోకానికి ప్రభవ సంవత్సరపు నూతన కానుక ఈ ప్రచురణ

–బాగవతుల నారాయణమూర్తి, బొంబాయి

★ ★ ★

ఆంధ్ర సాహితీ మాత కీర్తి కిరీటాన్ని అలంకరించిన ఆణిముత్యం – కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారి వేయి పడగలు బారతీయ సాహితీ గగనాన ప్రతిష్ఠా పతాకాన్ని సగర్వంగా నెగురవేసి ఏబది ఏండ్లానంతరం పునః ప్రచురణ కావటం సంతోషకరం! ఆనాటి ఆంధ్రసాహితీ విలువకు నీరాజనాలర్పించే నిత్యనూతన నవరస నవలారాజం నుండి ఆధునిక పఠితలు దారా వాహకంగా ఉత్తమ సాహితీ మకరందాన్ని ఆస్వాదించ గలరనుట అతిశయోక్తి గాదు!

–యల్ శ్రీనివాస్ భువనేశ్వర్

## సీరియల్స్

ప్రతిస్పందన, ప్రత్యూష పవనాలు సీరియల్స్ ప్రారంబములోనే మధురముగా ఉన్నవి ఇంత మంచి సీరియల్స్ అందిస్తున్నందుకు మా కృతజ్ఞతలు ఎం శివనాగవర్ధని కూచిపూడి(తెనాలి)

★ ★ ★

శ్రీమతి జి బవానీ కృష్ణమూర్తి రచన ప్రత్యూష పవనాలు సీరియల్ కుటుంబ కథ చాలా సహజంగానున్నది

–డి వందన డి వీణ రాయగడ

## కథలు

నటి బానుప్రియ ముఖచిత్రంతో వెలువడిన పత్రికలో శ్రీమతి సౌమ్య' కథ బాగుంది

పి వి సతీష్‌కుమార్, హనుమాన్ జంక్షన్

★ ★ ★

నటి బానుప్రియ ముఖచిత్రంతో వెలువడిన సంచిక రమణీయంగా వుంది పద్మమన్నాటి కుటుంబరావు గారి మృగం కథ సందేశాత్మకంగా వుంది తమకున్న అందం, డబ్బు, పేరు ప్రఖ్యాతుల ముందు అందరూ కూడా తక్కువే అనే బావన కలిగిన నందనరావు లాంటి అవివేకులు సమాజంలో కోకొల్లలు

మోదేకుర్తి సత్యనారాయణ, అన్నవరం

## పొరపాటు

నా నవల రాగలత లో కళావంతుల గురించి సంబాషణల్లో వ్రాయడం జరిగింది పశ్చిమ గోదావరి కళావంతుల సంఘం– పెనుగొండవారు ఈ పదాల వాడుకలో తమకుగల అభ్యంతరం తెలియ జేశారు కళావంతుల గురించి వివరంగా నాకు తెలియ జేశారు ఇప్పటికి కూడా వారి మీద నాకు గౌరవం అయిన బావమే ఉంది కాని రచనలో నా పొరపాటు స్పష్టమవు తున్నది నేను ఆ సంఘం వారికి పత్రికా ముఖంగా నా క్షమాపణలు తెలియ జేస్తున్నాను నవల పుస్తక రూపంలో వచ్చినప్పుడు తప్పులు తొలగిస్తానని హామీ యిస్తున్నాను

**ఘండికోట బ్రహ్మాజీరావు,**
**రచయిత, విశాఖపట్నం**

## మనవి

ఆంధ్ర సచిత్ర వారపత్రిక 20-26 మార్చి 1987 సంచికలోని శ్రీ ఘండికోట బ్రహ్మాజీరావుగారి రాగలత సీరియల్ (11వ పేజి)లో నాగభూషణం నాగరత్నం పాత్రలమధ్య జరిగిన సంబాషణ కళావంతులని కించపరిచేలా ఉన్నదని పశ్చిమ గోదావరిజిల్లా కళావంతుల సంఘం (పెనుగొండ) వారు ఆక్షేపణని తెలియచేసారు అవి ఉద్దేశ్యపూర్వకంగా కానీ ఎవరినీ కించపరచాలనికానీ ప్రచురించలేదని మనవి చేస్తున్నాము దానివల్ల కొందరికి బాధ కలిగినందుకు చింతిస్తున్నాము

–సంపాదకుడు □

## నిత్య నూతన సీరియల్

# కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ



# వేయిపడగలు

(గతసంచిక తరువాయి)

నాలుగవనాడు రంగారావుగారికి పట్టాభిషేకము జరిగెను ముహూర్త ముదయమున రాజా-రాధాకృష్ణయ్యగారును సర్వారాయుడు గారును కూర్చుండు మనిన కూర్చుండును లెమ్మనిన లేచును అంతయు వారి మీదుగా జరిగి పోయెను పట్టాబిషేక వేళ కవులు పద్యములు చదివిరి కొందఱికి చదువుటకు -వీలులేక పోయెను హడావిడిలో బత్రాజుల కైవారములు వినిపించనే లేదు పెద్ద పెద్ద ఉద్యోగులు వచ్చు చుందిరి వారికి స్వాగత మిచ్చుటకై పెద్ద లందఱు నియోజితులైరి

రంగారావుగారు బంగారపు పని చేసి౦ దంతపుగద్దె మీద ఆసీను లయిరి శిరస్సుమీ ర నాగన్న నాయడుగారు చేయించిన కిరీటము౦ దరించిరి ఆ కిరీటము వజ్ర వైడూర్య గోమేదిక పుష్యరాగ మరకత మాణిక్యములు మూడు వరుసలుగా పొదుగబడి యుండెను రాజా మధ్యాహ్న మార్తాండునివలె తేజోదుర్నిరీక్ష్యుడయ్యెను సబలో అందఱును కలరు, దర్మారావు మాత్రము లేదు అతనిని పిలిచిన వారు లేరు అతడు వచ్చినద లేదు సుబ్బన్నపెట జమీందారులలో ఎవ్వరికిని దర్మారావు వంశీకులు లేకుండ పట్టాబిషేకము జరుగలేదు

సరిగా రాజా శిరస్సున అబిషేకోదకములు పురోహితుడు చల్లుచుండెను సబలో ఎవరో పాము పాము అని గగ్గోలుపడి లేచిరి సబయంతయు కల్లోలమై పోయెను పాము కోసము వెదకిరి ఎచ్చటను కన్పించలేదు రాజాగారి సింహాసనము వద్ద నుండి బయలుదేరినదని కొందరును బయటికి వెళ్ళిపోయినదని కొందరు అనిరి చెదరిపోయిన జనులను కూర్చుండబెట్టుట దుర్ఘటమై పోయెను అభిషేకమై పోయిన తరువాత బ్రాహ్మణులాశీర్వాదపు పనసలు చదివిరి అప్పటికే రెండు జాములైనది కొందరు పెద్ద కవులకును పెత్తనదారు లెఱిగిన కవులకును సన్మానములు జరిగెను సబ ఆ పూటకు చాలించిరి బోజనమైన తరువాత రంగారావుగారు దంతపు గద్దెమీదనే మేడపై చావడిలో కూర్చుండిరి చుట్టును దివానుగారును రాధాకృష్ణయ్య రామేశ్వరము సర్వారాయడు గార్లు కూర్చుండిరి రంగారావుగారు

మద్య నెవరది పాము పామని అల్లరి చేసినది! అనెను రామేశ్వరముగారు చాల సమయస్ఫూర్తి కలవాడు ధర్మారావు ఎట్టాబిషేకమునకు వచ్చెనా? అని అడిగెను అతడే ఈ అల్లరి చేసి ఉండు నని దివానుగారనిరి ఓవానుగారింత వరకు ధర్మారావు నెరుగడు రంగ రావు గారికి రామేశ్వరము గారి మాటలయందు విశ్వాసము లేదు ధర్మారావును జమీందా రెరుగును అతడుగాని పిలువకుండ రాడు సర్వారాయడు గారు అతడసలు రానేలే దనెను

రంగా అవునులే! అతడెందుకు వచ్చును! మా సొమ్ము చేదైనది అబ్బో! అంత గర్విష్ఠి అతడేల వచ్చును!

రాధా అయన కాహ్వానము వెళ్ళినదా?

రామే అహ్వాన మెందుకండీ? ఆశ్రయించుకుని బ్రతికెడి వారి కాహ్వానములు కావలయును కాబోలు!



జమిందారు గారికి మాటలు చక్కగా నచ్చెను. ఇదివరకే ధర్మారావు మీద ఆయనకు కావలసినంత వైమనస్యము కలదు. ఈ మాటలు బాగుగా పురి ఎక్కించెను. అంతలో సర్వారాయుడు గారేదో చెప్ప వచ్చి మాని వేసెను. జమిందారుగా "రేమిటి చెప్ప వచ్చితి"రని బలవంత పెట్టెను. సర్వారాయుడు "గణాచారి యీ మధ్యనొక పాట పాడుచు ఊరి వెంట తిరిగెను. వేయి తలల పాము కలలోన రాజును కఱచిన దనుచు పాడెను. నేడు మఱల "పాము పామన్నారు. ఈ రెంటికి నేమి సంబంధము?" అనెను. రంగారావు "ఆ!" అని ఆశ్చర్యపోయెను. నలుగురు ఆదేమని ప్రశ్న వేసిరి. జమిందారిట్లు చెప్పెను. "అవును నాకు సరిగా కల అట్లే వచ్చెను. సుమారు రెండు నెలలైనది. ఆ దినముననే ప్రాత దివానుగారిని తొలగించి నాగేశ్వరరావున కొర్డరు వ్రాసి టపాలో పంపించితిని. ఆ రాత్రి నిద్రయే పట్టలేదు. నిదుర పట్టువరకు తెల్లవారు కడ రెండు గంటలయ్యెను. ఆ నిద్రలో కల వచ్చెను. వేయి తలల పాము వచ్చి నా మంచము వద్ద తోక మీద నిలుచుండెను. నేను దాని వంక చూచుచు ఊరకుంటిని. మా నాయనగారికి, మా పూర్వీకులకు కలలో పాము వచ్చుట దూరమున నుండి చూచుట ఉన్నదని మా వాండ్రు చెప్పెడి వారు. కాని నేనది నమ్మలేదు. నాకు అట్లే జరిగెను. ఆ పామట్లే నిలుచుండి నా వంక చూచుచుండెను. దాని కన్నుల నుండి చాచిన నాలుకల నుండి విషములు క్రక్కుచుండెను. నాకెందు చేతనో ఆ సర్పమును చూడగా నవ్వు వచ్చినది. నేను పరిహసించుచుంటినని కోపము వచ్చి, నన్నది వేయి తలలతో వేయి చోట్ల కాటు వేసెను. అబ్బా! నా శరీరమున దాని కాటు తగులని తావే లేదు. నాకు భయమయ్యెను. భయమగుటయు, మెలకువ వచ్చుటయు ఒక్కసారియే అయినది. కన్ను విప్పునరికి తెల్లవారుచుండెను. మఱల నిద్రపట్టినది కాదు. తరువాత నింతవరకు మఱల అట్టి కలగాని, ఏమిగాని రాలేదు.

సర్వా : ఇది చిత్రముగానే ఉన్నది. ఆ కల మాట గణాచారికెట్లు తెలిసినది? మీ రెవరితోను చెప్పలేదు కదా!

రంగా : ఎవరితోనను చెప్పలేదు. చెప్పుటకందు నేమున్నది?

సర్వా : ఏమో ఉన్నట్లే ఉన్నది. అసలు మీ ఊరే పాముల ఊరు. మీరందరు పాములవాండ్రు.

జమిందారు మేనత్త కొడుకు వరుసలాడినట్లను కొనెను. దివానుగారు "పిచ్చినమ్మకములు!" అని నవ్వెను.

రంగారావు తలయెత్తెను. జరీ మెలిపెట్టి తోరణములుగా వ్రేలాడగట్టబడి ఉండెను. ప్రతి తోరణము చివర తెల్లని పట్టు, మల్లె పూచెండులవలె కట్టి ఆ మల్లె చెండుల చివర ఎఱ్ఱని దారపు పేనులతో గులాబి పూవులవలె అతుకబడి ఉండెను. మేడ పై భాగమంతయు అట్టి తోరణాలే వ్రేలాడుచుండెను. తోరణములన్నియు పాములై చెండులన్నియు పడగలై దాగు

రేకులన్నియు నెత్తురుమయముచున్న తలలై మఱల తన కల సాక్షాత్కరించినట్లు రంగారావుగారు దిగ్భ్రాంతి పొందెను కాని ఆ ప్రసంగ మేమియు చేయలేదు

ఆ సాయంతనమున పాటకచేరీ జరిగెను పాటకుడు నాగేశ్వరయ్యారు మృదంగము భుజంగము కంజిరా సుబ్రహ్మణ్యపిళ్ళె ఎడేలు శేషు అయ్యారు జమీందారుగారు సభలోనికి వచ్చి కూర్చుండి కార్యక్రమము వంక చూచెను అంతయు ఏదో సర్పమయముగా ఉన్నది రంగారావు గారు పాట వినుచుండెను నాగేశ్వరయ్యారు రాగాలాపన చేయుచుండెను జమీందారు రాగము పేరడిగెను అయ్యారు శంకరాభరణ మని చెప్పెను జమీందారుగారు దివానును చూచి ఏమయ్యా! శంకరాభరణమనగా పాము కదా! అనెను దివాను ఔను కాబోలు అనెను జమీందారు నేడు సభ చేయు వారందఱి పేర్లు చదువుము ప్రతి వారి పేరు పామన్న అర్థమే యిచ్చుచున్నది అనెను దివాను మఱి నా పేరో? అనెను జమీందారు పకాలున నవ్వెను ఆ నవ్వులో తేజస్సేమియు లేదు కాగితపు పూలవలె వాసనలేని నవ్వు సభ జరుగుచుండగనే జమీందారుగారు లేచి వెళ్ళిరి పాటకుడుత్సవము చూడవచ్చిన వారికి తన పాట రకరకాలుగా పాడి వినిపించెను తెలిసినవారు సమానముగా తలలాడించిరి ద్రావిడులు చాల సంతోషించిరి నాగేశ్వరయ్యారు పాడినంతసేపు చేతులు దొన్నెల వలె పెట్టి పాము పడగలవలె త్రిప్పుచు వచ్చెను రంగారావుగారి కది మఱియు నసహ్యము వేసెను

రాత్రి నాటకమాడిరి జమీందారుగారుగాని పెత్తనదారులుగాని నాటకమునకు పోలేదు నటకులలో పెద్దలు వచ్చి రాజుగారిని రమ్మని చాలసార్లు కోరిరి రాజు గారికి శిరోబారముగా నున్నది శ్రమపడిరి కదా పగలెల్ల! వచ్చినను కూర్చుండలే రని సమాదానము చెప్పి దివానుగారు వారిని పంపించిరి దివాను గారినైనను రమ్మని వారు ప్రాదేయపడిరి దివానుగారు కూడ తనకు మనస్వాస్థ్యము లేదనియు తెల్లవాఱిన తనకు లక్ష పనులనియు చెప్పి పంపించెను చూడవచ్చిన వారందఱకు వారు నాటకమాడిరి ఆ నాటకములోనికి పాములేమియు రాలేదు వెనుక కూర్చున్న వారికి నేల తేమగా నుండుటచే కప్పలు వచ్చెను నాటక ముత్సాహముగా లేదు

ఇద్దరు పేరుమోసిన కవీశ్వరులు పైన సేలువలు కప్పుకొని కాగితముల కట్టలు పుచ్చుకొని

# వేయిపడగలు

మఱునాడుదయమే రాజ దర్శనార్థము పోయిరి రంగారావుగారపుడే లేచి ముఖమార్జనము చేసి కాఫీ త్రాగుచుండిరి కృష్ణమనాయడున్నంత వఱకు కోటలో కాఫీ ప్రసక్తే లేదు పూర్వపు జమీందారులు ప్రొద్దుననే లేచుటయు కాలకృత్యములు తీర్చి తిరుమణి తిరుచూర్ణములు ధరించి పనియేదైన చూచుకొనుటయే బాగుగా ప్రొద్దెక్కినంత వఱకు ఏమియు తినరు అప్పుడు మాత్రము బోజనము చేయుదురు బోజనాత్పూర్వ మేమియు తినరు అది ఆరోగ్య శాస్త్రమునకు విరుద్ధము రంగారావుగారు చదివెడి రోజులలో అతనికి కాఫీ అలవాటైనది తండ్రి బ్రతికి ఉండగా కోటలో దానికి తగిన వీలు లేకుండెను పొరుగూరు వెళ్ళినప్పుడెల్ల కాఫీ త్రాగుచునే ఉండెను చెన్నపురిలో నున్న రెండు నెలలు కాఫీమీదనే బ్రతికినది కవులు వచ్చి రాజుగారి మీద పద్యములు చదివిరి వారిదివఱకు జమీందారు మీద చెప్పిన పద్యములను కూడ చదివి వినిపించిరి వారు కీర్తిమంతులు పండితులు వాగ్మిలు ఇద్దఱికి చెఱి మూడు వందలు ఇచ్చి రాజు వారిని సాగనంపవలసి వచ్చెను

తరువాత వారాంగనా నృత్యము వచ్చిన పది మేళములు గాక రత్నగిరి కూడ తన మేళముతో తయారయ్యెను ఎవరిని పిలిచినది ఎవరిని పిలువనిది రంగారావు గారికి తెలియదు తక్కిన ముగ్గురికి తెలియును రత్నగిరిని దివానుగారు తక్క తక్కిన ముగ్గురు ఎఱుగుదురు రాదాకృష్ణయ్యగారు రత్నగిరినేల వచ్చితివి? ఎవ్వెవ్వరు పిలువలేదే? అనెను రత్నగిరి ప్రభువులు ఈ సంస్థానము నాది నేను రాకుండ నింకొకరికి వచ్చుట కధికారమే లేదు నన్ను పిలిచినను పిలువకున్నను నేను రావలసినదే అనెను రామేశ్వరము నెమ్మదిగా ఈమాత్రము జ్ఞానము నీ కొడుకునకు కూడ ఉండిన బాగుండును అనెను తక్కినవారు నవ్విరి రత్నగిరి కామాట వినిపించలేదు ప్రభువులేమో అనుచున్నారు అని ఆమె విన నడిగెను రామేశ్వర మేమియు లే దని చెప్పెను ఆ పూటకు వారాంగనా నృత్యములు జరుపబడెను సాయంకాలము మ్యాజిక్కు చేయబడును రాత్రికి సర్కసు

ఈ ప్రదర్శనలకు వేరే పందిరి వేయించిరి చుట్టు గుడ్డ కట్టిరి లోపల కుర్చీలు బెంచీలు తెప్పించి వేసిరి చూడవచ్చిన ఉద్యోగులు రాజబంధువులు వాని నలంకరింతురు వెనుకనున్న సామాన్య ప్రజకేమియు కనపడదు పందిరి ద్వారము వద్ద రక్షకభటులును పెత్తనదార్లును నిలుచుండి గౌరవనీయులని వారనుకొన్న వారినే లోపలకు పోనిత్తురు పట్టాభిషేకమునకు పరగణాలో నున్న పెద్ద రైతులు కొందఱు వచ్చిరి వారు నీరుకావి దోవతులు బొందు చొక్కాలు కోర తలపాగాలు పట్టి వర్ధనాలతో జగన్మోహన మూర్తులుగా వచ్చిరి వచ్చిన నాగరికులకు వారి వేషములు పల్లెటూరివిగా కనిపించెను వారును అగ్రస్థానములే అలంకరించిరి మ్యాజిక్కు జరిగెను మధ్య మధ్య ప్రతివారును కరతాళ ధ్వనులు చేసిరి ప్రొఫెసరుగారిని స్తుతించిరి పెద్ద రైతులలో వొకాయన పేరు కుటుంబరాయడు ఆయన ప్రదర్శన అంతయు చూచి "అదేమిటయ్యా నేనేమో అనుకొన్నాను ఈయన కోటు సూటు తీసివేసినచో మన ఆస్థానమునకు వచ్చు గారడీవాండ్రకన్న ఏమి గొప్ప? అసలు వాండ్రు చేసినట్లు ఈయన చేయనేలేదు" అనెను మరొకాయన అట్లుకాదు ఇదే బాగున్నది ఏమియు లేకపోయినచో అంతంత పెద్దలాయన నెందుకు మెచ్చుకొందురు? అనెను

సర్కసువారు ప్రత్యేకంగా వేఱే డేరా వేసికొనిరి పట్టాభిషేక దినములలో అల్లరులు జరగకుండ కాపాడుటకు రక్షకభటులు వచ్చిరి వారు వచ్చుటే దేవిడీలోని పరిచారకుల కందఱకు కష్టముగా నుండెను ఉత్సవ సమయములందు జనమును సర్ది కూర్చుండబెట్టుట వారి పని అది వారికి గౌరవము ఇప్పుడీ యెఱ్ఱ టోపీలవారు వచ్చి తమ కోటలో తమ మీదనే అధికారము చేయుట కాసావారికి తదితర పరిచారకులకు రుచించలేదు కాని ఏమి చేయుదురు? వారికి తమ గౌరవముకన్న ఆ వంశపు జమీందారుల మీదనే ఎక్కువ అభిమానము బాబయ్యగారు తమకేమి చేసినను బాబయ్యగారిని వారేమియు అనరు బాబయ్య గారిమీద మాటపడనీయరు

రాత్రికి సర్కసాట మొదలుపెట్టిరి బ్యాండు మేళము మ్రోయజొచ్చెను అదివరకు సుబ్బన్న పేటలో సన్నాయి ఎఱుగుదురు కాని మేళము ఎఱుగరు ఐదుగురు వరుసగా కుర్చీల మీద కూర్చుండి ఒకడు దీపము వెలుగున ఒక కాగితము మీద ఏదో వ్రాయబడిన దానిని చూచుచు కఱ్ఱతో గాలిలో విసరుట తక్కినవారు పాడుట సామాన్య ప్రజలకు చాల చిత్రముగా ఉండెను జనము వారి చుట్టును మూగి చూచుచుండిరి

డేరా ద్వారము వద్ద రక్షకభటులు కాపుండిరి అందరిని లోనికి పోనీయలేదు చుట్టు పక్కల ఊళ్ళలో నుండి జనము వేలకువేలు వచ్చిరి వారందఱు బయటనే ఉండి బ్యాండు చూచుటతోడనే మాత్రము తృప్తి చెందవలసి వచ్చెను జనమొత్తుకొని వచ్చినప్పుడు రక్షకభటులు లాఠీలతో మోదుట మొదలుపెట్టిరి ఈ క్రొత్త అనుభవముచే జనులు చెల్లాచెదురైరి పెద్ద

**జరిగిన కథ –6** సుబ్బన్న పేట ఎంతో అభివృద్ధి చెందుతుంది ఐదవతరం గణాచారి వేయి పడగల పాము విప్పారుకొని వచ్చి కాటందు కొన్నది కలలోన రాజును అంటూ పాడుతుంది వీధుల్లో ఆమెను చాలా మంది చాదస్తురాలిగా చూస్తారు ఇప్పటి తరం జమీందారు కృష్ణమనాయుడు బ్రాహ్మణుడు రామేశ్వర శాస్త్రి రామేశ్వర శాస్త్రి దాన దర్మాలతో ఆస్తి అంతా హరించుకు పోయి దరిద్రంతో బాదపడుతూ ఓనాటి రాత్రి దేవాలయంలో ప్రాణాలు విడుస్తాడు రామేశ్వర శాస్త్రి కొడుకు ధర్మారావు కృష్ణమనాయని కొడుకు రంగారావు ధర్మారావు చదువు కృష్ణమనాయని మరణంతో ఆగిపోతుంది రంగారావుగారి పట్టాబిషేకానికి పెద్ద ఎత్తున ఏర్పాట్లు చేస్తారు కృష్ణమనాయని పట్టపు టేనుగు మరణిస్తుంది

# ప్రముఖుల సందేశాలు

"వేయిపడగలు" వారపత్రికలో ముద్రిస్తున్నందులకు చాల సంతోష పడుతున్నాను. ఆ రచన వకనాటి మన జీవితానికి అద్దం పడుతూంది. మన సమాజం ఏ స్థాయి నుండి ఎక్కడికి దిగజారి పోయిందో వేయిపడగలు చదివితే చక్కగా అర్థమవుతుంది. ఈ నాడు చాల మంది అర్థరహితంగా బ్రతుకుతున్నారు. వేయిపడగలు చదివినపుడు మరలా మన పాత జీవితాన్ని వక్కసారి నెమరు వేసుకొనే



దానికి అవకాశం వున్నది. మీ ప్రయత్నాన్ని మనః పూర్వకంగా హర్షిస్తున్నాను

పుట్టపర్తి నారాయణాచార్యులు, కడప

★ ★ ★

'వేయి పడగలు నవలని మళ్లీ సీరియల్‌గా వెయ్యదలచి నందుకు అబినందనలు కొత్తతరం పాఠకులకు ఆ నవలని యిలా అందుబాటులోకి తేవాలన్న మి నిర్ణయం చాల సముచితంగా వుంది, నేడు ప్రవర్తిల్లుతున్న అభిరుచుల దృష్ట్యా-

'వేయి పడగలు' ప్రధానంగా సాంస్కృతిక నవల. పాశ్చాత్య నాగరకతా ప్రభావం వల్ల తెలుగుదేశంలో అదృశ్యమైన పూర్వ నాగరకత చివరి మెరుగుల్ని హృదయంగమంగా, చిరస్మరణీయంగా చిత్రించిన బృహత్కావ్యం. వెయ్యి పుటల కావ్యంగా విస్తృతమైన, బహుముఖీనమైన వస్తువునకు ఒక నిర్దిష్టమైన ఆకృతి తీర్చిదిద్దారు విశ్వనాథ. రెండు సార్లు వచ్చిన గుండేరు వరద విభజన రేఖలుగా యితివృత్తాన్నీ, కథా గమనాన్నీ అర్థవంతంగా రూపొందించారు. ప్రతీకల్ని పాత్రలుగా రూపొందించడంలో (పసిరిక, గణాచారి), పాత్రలని ప్రతీకలుగా భాసింప జెయ్యడంలో (ధర్మారావు, గిరిక, హరప్ప) విశ్వనాథ సాధించిన విజయం తెలుగు నవలా శిల్పం చేసిన శిఖరారోహణ.

వేయి పడగలు' నవల ఈనాటి సామాజిక సమస్యలకు పరిష్కారం సూచించే రచనకాదు దాన్ని సమాజ బవిష్యత్తుకు మార్గదర్శిగా ఉపలక్షించడం సరియైన దృష్టి కాదు వీరేశ లింగం గారు నవలకు సంఘ సంస్కరణోద్దేశం కట్టబెట్టారనీ రాజకీయ వాదులు సాహిత్యం విప్లవ నిర్దేశకం కావాలంటున్నారనీ, ఆ దృష్టితో వేయి పడగలు' నవలది వెనుక చూపవి విమర్శించడం సహృదయత కాదు. కేవలం అప్రస్తుత ప్రసంగం. మారిన ఒక నాగరకత వైలక్షణ్యాన్ని కళాత్మకంగా నవలలో చిత్రించి, నవలను కావ్యం చేసిన విశ్వనాథ ప్రతిభను ఈతరం తెలుగువారు సహృదయతతో గుర్తిస్తారని ఆశిస్తున్నాను.

—ఆర్. ఎస్. సుదర్శనం,
రాజమండ్రి

★ ★ ★

సామాజిక జీవితంలోని పలురంగుల సమన్వయ చిత్రపటం 'వేయి పడగలు' నవల. వివిధ మనస్తత్వాలకు చక్కని భాష్యం అని సారస్వతోపాసకులు ఏనాడో దానికి సార్థకమైన పేరు పెట్టారు. సంప్రదాయాన్ని మన్నించే వారికి అది సింహాసనం. సారస్వత ప్రక్రియల నన్నింటినీ నిర్విరామ దీక్షతో అక్షర రూపాన ప్రకటించిన సర్వతోముఖ ప్రతిబాశాలి కనుక అలాటి నవల సృష్టించి వేయి పడగల శేముడుగా విశ్వనీరాజనం అందుకున్న చరితార్థుడు మా అన్న శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

ఆనవలను ఆంధ్ర సచిత్ర వార పత్రికలో ధారా వాహినిగా ప్రకటించ సంకల్పించడం సంప్రదాయజ్ఞులైన మీకు సముచిత కార్యం అది నిర్విఘ్నంగా సాగాలనీ, ఆదునిక పాఠకలోకం అబినందనాలు మీరు అందుకుంటూ ఉండాలనీ నా శుభాకాంక్ష-

—యామిజాల పద్మనాభస్వామి,
త్యాగరాయనగర్, మద్రాసు

★ ★ ★

కవి సమ్రాట్టు విశ్వనాథ సత్యనారాయణ గారి "వేయి పడగలు", ధారా వాహికంగా ఆంధ్ర సచిత్ర వారపత్రికలో మళ్లీ వెయ్యబోతున్నందుకు ఎంతో సంతోషిస్తున్నాను.

"వేయి పడగలు" ఐదు దశాబ్దాల



క్రిందట వెలువడిన 'నవల' ఐనప్పటికి దాని విలువ తగ్గలేదు ప్రపంచంలోని ప్రతి సాహిత్యంలోనూ నావెల్ అనగానే ఇలా చూచి అలా పారవేయవలసిందే అని ప్రతీతి కాని పురాణేతి హాసాల స్థాయికి ఎదిగి శశ్వత్ కీర్తి గణించుకున్న ఏకైక నవల వేయి పడగలు ఇది తెలుగులో ఉండటం ఆంధ్రులకి గర్వకారణం మీ సంకల్పం ప్రశంసనీయం

వజ్ఝల కాళిదాసు,
జెమ్‌షెడ్ పూర్

---

రైతులందరు ఉద్యోగస్తులతో పాటు పోయి కుర్చీల నాక్రమించిరి తక్కిన జనులు గ్యాలరీ నలంకరించిరి పరిచారకులును మిగతావారును నేల పై కూర్చుండిరి ప్రదర్శన మారంబించిరి విద్యార్థికులందరు ప్రదర్శకుల కరతాళ ధ్వనులచే గౌరవించిరి

రాత్రి పన్నెండు గంటలకు ప్రదర్శనమైపోయెను కుటుంబరాయడు గారికీ ప్రదర్శన నచ్చలేదు పులుల నాడించినవాడన్నచో మఱియు కోపము వచ్చెను వాడేమి హరప్పనాయడా కృష్ణప్ప నాయడా? వెనుక తుపాకితో నొక మనిషి నిలుచుండగా తిండిలేక మలమల మాడుచున్నవి - అరణ్య సంచారమే ఎఱుగనివి మనుష్యులను చూచుట కలవాటుపడినవి - యీ మృగముల నాడించుటలో అతనికేమియు గొప్పదనముగాని, మెచ్చుదగినది గాని ఏమియు కనపడలేదు తక్కిన పనులసలు నచ్చలేదు దొమ్మరివాండ్రింతకన్న బాగుగా చేయుదురని అయన ఊహ రాను పోను ఖర్చులిచ్చి వేయి రూపాయలు వీరి మొగమున పోయుటకన్న నిందులో సగమిచ్చినచో దొమ్మరి వాండ్రు వచ్చి యింతకన్న బాగుగా నాడుదురో వారికిచ్చిన డబ్బు పేదవారైన అనుబవించి నట్లగును వీరందఱు పటాటోప మెక్కువ చేసి దన మాకర్షించుట తప్ప మఱేమియు లే దని కుటుంబ రాయడుగారనిరి

ప్రదర్శనమైపోవు వఱకును దెబ్బలు తిని కూడ జనము డేరా బయటనే నిలిచి ఉండిరి పల్లెటూరి జనులు ప్రదర్శనము తెల్లవారులుండుననుకొనిరి రాత్రి రెండు జాములకే అయిపోయినదని తెలియగానే ఇష్ ఇంతేనా' అనిరి అప్పుడు జనము తమ పల్లెలకు పోవబయలుదేఱిరి సుబ్బన్నపేట ఊరు వెలుపలికి బోవు వఱకు దీపాల వెలుతు రంతరించెను ఆనాడు శుక్లషష్ఠి అపుడే చంద్రాస్తమయ మయ్యెను డేరాలోనికి ప్రదర్శనము చూచుటకు అతనిని కూడ రానీయ లేదు కాబోలు! అస్తమించుచున్న ఆ చంద్రుని మొగము గూడ కంది ఎఱ్ఱనై కందగడ్డవలెనయ్యెను ఎట్లయినను రాజు కదా' తిరస్కారము సహించలేడు సామాన్య జనుల కేమున్నది? వారు నవ్వుచు త్రుళ్ళుచు స్వగ్రామముల దారి పట్టిరి

వెనువెంటనే చీకట్లు తరుముకొని వచ్చెను ఆకాశము నల్లని మహాసముద్రము తరంగములు తరంగములుగా లేచి భూమి యను తీరమునకు కొట్టుకొనినట్లు, రాత్రించరులయిన భూత ప్రేతాది నానా పిశాచ వికట భ్రూ పరివర్తనచ్ఛటా సంతానము దిశలావరించినట్లు తిరోహిత సూర్య తేజస్కమై కాలము సహజాకృతి పొందినట్లు దిక్కులను ఎలుగుబంట్లు స్వశరీర లంబమాన బహు దీర్ఘ కేశములతో సంచరించుచున్నట్లు అజ్ఞానము పీలుచిక్కి జ్ఞానమునెడ ద్రోసి మనస్సులో తులకెల్ల ప్రాకినట్లు, కాల సర్పము లొకదానినొకటి యొఱసికొనుచు లెక్క లేనన్ని సంచరించినట్లు చీకటులు విజృంభించెను

మరునాడు బోగము మేళములనే ఆడించిరి రామేశ్వరముగారు వీనికి పెద్ద దబ్బిచ్చి పిలిపించిన వారందరి నట్టేపెట్టి రత్నగిరి మేళమునే ఆడించ నారంబించెను రత్నగిరికి నలుబది ఆరేండ్లు వార్ధకము నెమ్మదిగా నామె శరీరముపైకి ప్రాకెను దేహము స్థూలమై పూర్వము వలె అబినయాదులు చేయలేకుండెను రామేశ్వరముగారామెనే గజ్జె కట్టుమనిరి గజ్జెకట్టి యిరువది యేండ్లయినను రత్నగిరి ప్రభువులున్నారు, తన విద్య మెత్తురని అంగీకరించెను పైని తానే అనాహూతగ మేళమునకు వచ్చెనాయెను చేయక తప్పినది కాదు

ప్రార్థనాదికములయిన తరువాత ఆమె అద్యాత్మము పాడ నారంబించెను అవి కాదు జావళీలు పాడు మనిరి ఆమె క్షేత్రయ పదము నొకటందుకొని అబినయము ప్రారంబించెను ఆమె మొగమున నంతలో కండరము లన్నియు విచిత్రముగా కదలాడి ఒక క్రొత్తదనము వచ్చెను

అదరెనే మోవి - తనకు దానె వదలెనే నీవి - పల్లవి
మదిలోన వాడేమొ మంత్రించె గాబోలు!

సుదతి మువ్వగోపాలు చూచినది మొదలు - అదరెనే

పల్లవి అందుకొనునప్పటికి ఏబది ఏండ్ల రత్నగిరి పదునాలేండ్ల కన్యవలె లఘు శరీరయై నూతన యౌవనావిర్భావవేళ నాయకుని ప్రథమ సందర్శనము పొందిన నాయికవలె ముగ్ధ ముఖ రేఖాంచలయై మారిపోయెను అదరెనే మోవి అని




## వేయిపడగలు

అదరినటులు గదలించెను ఆ కదలిక హఠాత్తుగా తామర రేకు మీద గాని గులాబి పూవు మీదగాని మంచుబిందువు పడినచో అవి ఎట్లు కదలునో అట్లు కదలెను ముఖమంతయు నిశ్చలమైఉండగా అదరమునది యెట్లు ఆ రీతి కదల్చెనో బ్రహ్మదేవుని కెఱుక ఆ అదర మట్లు కదల్ప గలుగుట కెంత పరిశ్రమ చేసెనో?

సుందరాతి సుందరముగ ఎడమ చేతతో నీవి బాగమును పూని నృత్త ము వేయుచు మఱల పల్లవి అందుకొనుచు రత్నగిరి బొంగరమువలె కదలిపోయెను

"మదిలోన వాడేమొ మంత్రించె గాబోలు అని శృంగార రసము యొక్క స్థాయి బావ మయిన రతియొక్క దశావస్థలలో ప్రథమావస్థయైన దర్శనము విస్తరింపబడిన నేత్రములతో లజ్జానురాగములు మిళితములైన ముఖ బావములతో కించిదం కుర్రిత పులకములైన కపోలములతో ముగ్ధ నాయికా లక్షణములు ముమ్మూర్తుల తనకు సరిపోగా ఆమె ఉన్నప్పుడు రస ప్రపంచములు పులకరించెను అనుపల్లవి అని మఱల పల్లవి అన్నపుడామె ప్రకటించిన లయ జ్ఞానమునకు నాదమయ ప్రపంచములు చందో గమనము పొందెను

ఒకసారి మువ్వగోపాలు దని ఒకసారి వేణుగోపాలు దని రత్నగిరి ఆ పాదమును రెండుసార్లు చెప్పెను మువ్వగోపాలుని పదములు సుబ్బన్నపేట వారాంగన లందరు అట్లే అందురు. జమీందారుల యిలవేలుపైన వేణుగోపాలుని నామమే వారా పదముల తుదనుంతురు కాని అసలు మువ్వగోపాలుని పేరు గూడ ఒకసారి అందురు

వేణుగోపాలుని చూచినది మొదలు అని బగవంతుని వేణుగాన భైరవు లనేకవిదముల వ్యత్యస్తపాదారవిందముగ ముఖసన్ని



హితన్యసో_బయహసా_భిరామముగ దాపలి భుజమును చెక్కుగిలించి భ్రూవిక్షేప సహితముగ మృదువిచలితాంగుళీ ప్రసారముగ పర్యాయోన్మీలిత నిమీలిత పక్ష్మలాభిరామాపాంగ రేఖాసుందరముగ ప్రదర్శించెను బృందావనము గోపికలు గోవులు యమున – సర్వము నామె తనూ విన్యాసములందు రాగమునందు తాళమునందు ముఖాంచలములందు ప్రత్యక్షములయ్యెను రత్నగిరి ఒడలు తెలిసిన స్థితిలో లేదు సబలోని వారనేకులు వారి దారిని వారు మాటాడు కొనుచుండిరి కొందరు రత్నగిరి వంకనే చూచుట లేదు ఎక్కడో వారినేత్రముల కంధమైన చోట వారు చూచుచుండిరి అబినయించుచు నబినయించు చున్న రత్నగిరిని రామేశ్వరముగారు ఆగుము అని ఆదేశించిరి రత్నగిరి నపుడు బగవంతుడాపలేడు ఆమె పదము కొస దాకపాడెను, ఆమె ఆగిన తరువాత రామేశ్వరముగారు అవునుగాని నీకూతురు రాలేదేమి? అనెను రత్నగిరి అదిరాదు అనెను

రామే ఎందుకు రాదు? బోగముది కాదా?

రత్నగిరి నిరుత్తర అయ్యెను రామేశ్వరముగారు కాసావాని నొకని పిలిచి రత్నగిరి కూతును పిలుచుకు రమ్మని పంపెను అది రాదు పంపవల దని రత్నగిరి చెప్పుచున్నను రామేశ్వరము గారు వానిని పంపించెను వాడు తిరిగివచ్చి అది రానన్నది అని చెప్పెను ఎందుకు రాదోయి? బలవంతముగా లాగుకొనిరమ్ము అని ఆయన వాని మరల పంపించెను పసిపిల్ల అది యెందుకు? అని రత్నగిరి బతిమాలి నట్లు చెప్పెను రామేశ్వరముగారు వినిపించుకొనలేదు జమీందారుగారు గాని దివానుగారు గాని కలిపించు కొనలేదు కాసావాడు పోయి దేవదాసిని రమ్మనెను ఆమె రాననెను నిన్ను బలవంతముగా లాగుకొని రమ్మని చెప్పిరి అని వాడామె మీదికి పోయెను దేవదాసి బయపడి వాకిలి లోనికి పరుగెత్తుకొని పోయెను వాడు వెంటబడెను ఆమె పరువెత్తి దర్మారావు గారింటికి చేరెను వాడును ఇచ్చటికి వెంబడించెను గుండెలు పగుల పరువెత్తుకొని వచ్చిన దేవదాసిని చూచి దర్మారావు ఏమే గిరికా ఇట్లు వచ్చితివి అనెను అతడు దేవదాసిని గిరికా అని పిలుచును గిరిక దర్మారావు వెనుకకు పోయి నిలుచుండెను కాసావాడు దర్మారావుగారిని చూచి ఆగెను దర్మారావు అడుగగా వాడు జరిగిన కథ అంతయు చెప్పెను దర్మారావు వీలు లేదుపొమ్మని చెప్పెను వాడును చేయునది లేక వెళ్ళి సబలో నీ కథ అంతయు విన్నవించెను సబలో క్రొత్తవారనేకులు కలరు పట్టణముల నుండి వచ్చిన విద్యాదికులు ఉద్యోగస్తులును వారందరికి ఈ కథ యేమో ఉత్సాహము కలిగించెను ప్రతివారును దర్మారావుగా రెవరు? రాజాగారి అబిమతమునకు వ్యతిరేకముగా ఇట్లు చేయుటకు ఆయనకు గుండె యెట్లున్నది? అని తమలో తాము వితర్కించుకొన జొచ్చిరి (ఇంకా ఉంది)

# కబీరు భావాలు : ఆరుద్ర బట్వాడా





## నిత్య సత్యాలు

వేదశాస్త్ర పురాణ చయములు
వివిధ మతముల ఆగమమ్ములు
కళ్ళులేని కబోది కరముల
పనికి మాలిన దర్పణమ్ములు

గురువు చూడగ గ్రుడ్డియైతే
శిష్యుడేమిటి చేయగలుగును
గ్రుడ్డి గ్రుడ్డిని తోసుకెళితే
కూలబడుదురు బావి నిద్దరు

హృదయమందున అద్ద మున్నది
నదనమేదీ కనిపించదు
మదిని నిండిన ద్వైతబావము
ఎదిలితేనే పదన మగుపడు

ముందు నున్నవి యిరుకు మెట్లట
విరిగి పడినవి వెనుక మెట్లట
మేలి ముసుగున దాగు సుందరి
చాల దవ్వట! చలించ లేదట!

పొట్ల మందున అమృతమున్నది
ముడిచి మడచీ ముడిచి కట్టుము
నిన్ను పోలిన వారు కనబడు
నిలిప కొసా_దాహ మొసగుము

మూట లోపల అమృతమున్నది
ముందు కిందకి దింపినాడను
నేను ఒక్కటి అనుచు చెప్పగ
జనులు రెండూ నాలుగందురు

వైద్యుడా నీ వింటి కేగుము
వ్యాది నిన్నిటు పిలువ లేదుత
బరువు మోపిన వాడు ఎవడో
బాద సంగతి చూచుకొనడా?

గంగ గట్టున కూరుచున్నది
దొంగలా? సన్యాసులా మరి?
నోరు విప్పే దాక ఆగుము
తీరు తెలియును మాటలో నే

స్వల్పమైతే చాల దొడ్డది
దాని నుండే సర్వ లొత్తురు
విహాయసమ్మున తోచి తోచని
విదియచంద్రుని చూచి మ్రొక్కర?

అడవిలో గల ఆకులెన్నో
గంగలో గల జలములెన్నో
నెత్తి మొత్తుకొనేరు అయ్యలు
ఒక్కటనెను కబీరుదాసుడు

–ఆరుద్ర

# పెన్నేరు తీరాన రమణీయ దుర్గం గండికోట



పెమ్మసాని తిమ్మనాయుడు

**క**డప జిల్లాలోని చారిత్రాత్మకమైన కోటలలో గండికోట ప్రముఖమైనది గండికోట ఎన్నో రణ సంగ్రామాలు చవి చూసిన ప్రసిద్ధమైన చారిత్రాత్మక దుర్గం అలనాటి ప్రముఖమైన ఒక పాలనా కేంద్రం క్రీ శ 1122లో కాక రాజాచే నిర్మింపబడిందని గండికోట కైఫియతులు చాటి చెబుతున్నాయి ఈ కళానిధి హిందూ మహమ్మదీయులు అలనాడు మత సామరస్యంతో మెలిగారన్న వాస్తవాన్ని దర్పణం పడుతుంది అయితే కోట కట్టించెవరు? అన్న శాసనాలు మాత్రం ఎక్కడా ఈనాటికీ లభ్యం కాలేదు

గండికోట కడప జిల్లాలోని జమ్మల మడుగు పట్టణానికి పడమరగా పది కి మీ ల దూరాన పెన్నా నది ప్రకృతి సౌందర్య వడిలో నిలిచి వుంది పెన్న మరియు చిత్రావతి నదుల సంగమం అయిన ఈ ప్రాంతంలో నదులు, కొండలే ఇచ్చటి ప్రాచీన సన్నివేశాలకు ప్రతీకలు ఇక్కడి వాతావరణం ఎంతో ప్రశాంతంగా, ఆహ్లాదకరంగా ఉంటుంది

ఎందరో హస్త కళాకారుల శ్రమకు, నైపుణ్యతకు సాక్షిగా నిలిచిన సుందరమైన అతి ప్రాచీనమైన గండికోట పొడవు తూర్పు పడమరలుగా దాదాపు ఆరు ఫర్లాంగులు ఎత్తు నలభై అడుగులు కొన్ని వందల సంవత్సరాల క్రితం నిర్మించబడిన ఈ కోట వెనుక ఎంతో సుదీర్ఘ చరిత్ర వుంది గండికోట ప్రాముఖ్యత భారత దేశపు పెనిన్సులర్లో కూడ గుర్తించబడింది

అత్తిరాలలోని క్రీ శ 1287 నాటి ఒక శిలా శాసనం ద్వారా అంబదేవకి కడప జిల్లాతో సన్నిహిత సంబంధం వున్నట్లు తెలుస్తున్నది పొలిలోని మరో శిలా శాసనం ద్వారా కడప జిల్లాలోని వల్లూరు "వల్లూరి పట్నం' రాజధానిగా గండికోట ఉన్నట్లు తెలుస్తున్నది అలాగే కర్నూలు జిల్లా త్రిపురాంతకంలోని మరో శిలాశాసనం ద్వారా క్రీ శ 1290 నాడు అంబదేవ గండికోట ప్రభువుగా ఉన్నట్లు పేర్కొనబడింది

కర్నూలులోని 1308 నాటి శిలాశాసనం ద్వారా ప్రతాపరుద్రుని సబార్డినేట్ గండికోట నుండి పాలించేవాడని, అతను కోట విస్తీర్ణాన్ని తగ్గించాడని, గొంకవరెడ్డి అనే వ్యక్తిని గండికోట రక్షకుడిగా నియమించాడని తెలిసింది గండికోట క్రీ శ 1350 అనంతరం హరిహరరాయలు సోదరుడైన మొదటి బుక్కరాయ వశమైంది యల్లమరాజు పరిపాలించాడు విజయనగర రాజుల కాలంలో ఒక సీమకిది పాలనా కేంద్రం క్రీ శ 1542లో పెమ్మసాని కుటుంబానికి చెందిన తిమ్మనాయుడు గండికోట రక్షకులలో ప్రముఖుడని పేర్కొంటారు

క్రీ శ 1565 తళ్ళికోట యుద్ధం అనంతరం మహమ్మద్ ఖులికుతబ్‌షా అతని మంత్రయిన అమీర్ ముల్క్ ద్వారా జరిపిన దాడిలో గండికోట కుతుబ్‌షా వశమైంది శ్రీ రంగరాజుకు సంతానం లేని కారణంగా అతని తర్వాత ద్వితీయ వెంకట రాజయ్యాడు వెంకట గండికోటను తిరిగి స్వాధీనం చేసుకొన్నాడు

ద్వితీయ వెంకటకు సహితం సంతానం లేకపోయింది మేనల్లుడ్ని రాజుగా ప్రతిపాదించారు ఈ కారణంగా చెలరేగిన అంతః కలహాలలో వీరు సతమతమవుతున్న అదను చూచుకొని మొగలులు, బిజాపూరు, గోల్కొండ సుల్తానులు ఏకమై క్రీ శ 1650లో కమాండెంట్ మీర్‌జుమ్లా ద్వారా దండయాత్ర జరిపి గండికోటను తిరిగి వశపరుచుకున్నారు ఆ తరువాత మీర్‌జుమ్లా సిద్ధవటాన్ని కూడా వశపరుచుకున్నాడు గండికోటను ప్రభుత్వ పాలనా కేంద్రంగా కొనసాగించాడు మీర్‌జుమ్లా గండికోట పాలకుడయ్యాడు కూడా

గండికోట దుర్గం





కావలి మంటపం

ప్రఖ్యాత ఫ్రెంచి యాత్రికుడు తవర్నీర్ సెప్టెంబర్ 10, 1652లో గండికోటలో మకాం చేసినపుడు, మీర్‌జుమ్లా తనకు ఐదు చిరు సంచుల నిండా రత్నాలు చూపినట్లు తవర్నీర్ తన రచనల్లో పేర్కొన్నారు ఇది గండికోట విశిష్టతకు, అలనాటి రతనాలసీమ వైభవానికి నిదర్శనం

ఆ తరువాత బిజాపూరు సుల్తాను మరియు మీర్‌జుమ్లా మధ్య తలెత్తిన భేదాభిప్రాయాల కారణంగా గండికోట క్రీ శ 1687లో ఔరంగజేబు వశమైంది అనంతరం క్రీ శ 1710-35 వరకు మయాన పాలకుల వ్యవస్థాపకుడు అబ్దుల్ నబీఖాన్ వారి వశమైంది

గండికోట క్రీ శ 1800 లో బ్రిటీష్ వారి వశమైంది అప్పుడు చాల వరకు ధ్వంసమైంది

హిందూ మహమ్మదీయ రాజుల అలనా పాలనను, రాజ వైభోగాలను చవి చూచిన గండికోట, వారి చరిత్రను తనలో దాచుకుని అప్పటి వైభోగాలకి దర్పణం పడుతుంది -

వేర్వేరు మతాల రాజుల పాలనల్లో నిర్మించిన గండికోట కట్టడాలు ఈనాడు కూడా చూడ ముచ్చటగా వున్నాయి రాచ లోగిలి రెండు గోపురాలు, రెండు ప్రవేశ ద్వారాలు ఈనాటికిని చెక్కు చెదరక నిలిచి వున్నాయి అలాగే కోటలోని రెండు ప్రాచీనమైన మాధవ, రంగనాయక స్వాముల వారి ఆలయాలు, ఎర్ర కోనేరు ఎంతో అద్భుతంగా వున్నాయి అవి హైందవ శిల్ప కళను ప్రతిబింబిస్తున్నాయి ఆంజనేయస్వాముల వారి ఆలయాలు కోట లోను, కోట వెలుపలా ఉన్నాయి ఫిరంగులు, కారింజాలు వందడుగుల ధాన్యాగారం, ఆయుధగారం రాతి గుండ్లు, తాలింఖానాలు సుందరమైన రాజభవనం బావులు చెరువులు వున్నాయి

కోటలోని జామియా మసీదు విస్తీర్ణమును బట్టి చూస్తే అందులో దాదాపు నాలుగు వందల మంది నమాజు చెయ్యవచ్చు సున్నముతో అతి సుందరంగా నిర్మించిన ఈ మసీదు రాచరీవి వ్యాఖ్యాంతో కూడిన దాని కారింజాలు రక్షకభటులు కాపలా కాచే కావలి మంటపం చూడదగ్గవి

హిందూ మహమ్మదీయుల మత సామరస్యాన్ని పెంపొందించే గండికోట రెండు కొండల లోయల్లో పెన్నేరు తీరాన, అతి మనోహరంగా కన్నుల పండుగ కల్పించే విధంగా వుంది మన రాష్ట్ర ప్రభుత్వం నిర్మించిన గండికోట ప్రాజెక్టు కూడా ఇక్కడే వుంది

కడప జిల్లాలో మన ప్రాచీన సంస్కృతిని వైభవాన్ని, చరిత్రను చాటి చెప్పే శిల్ప సౌందర్యం ప్రాచీన కట్టడాలు కోకొల్లలు అయినా ఈనాటికిని కడప జిల్లాలో ఏ ఒక్క ప్రాంతం యాత్రా కేంద్రంగా రూపొందించబడకపోవడం అన్నది మన పాలకులకు కడప జిల్లా పట్ల ఉన్న శ్రద్ధాసక్తులకి దర్పణం పడుతుంది ఇది వాస్తవం ఇది నగ్న సత్యం

మన ప్రాచీన సంస్కృతిని, కళా వైభవాన్ని చరిత్రను చాటి చెప్పే గండికోట మరియు దాని పరిసర ప్రాంతాలు నేడు దయనీయ స్థితిలో నిలిచి వున్నాయి గండికోట నేడు కేంద్ర పురావస్తు శాఖ ఆధీనంలో వుంది రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు గండికోటను మరియు దాని పరిసరాలలో ఉన్న ఆలయాల జీర్ణోద్ధరణ కార్యక్రమాన్ని చేపట్టి,



కోటలోని ఒక ఆలయం

గండికోటను యాత్రాకేంద్రంగా తీర్చి దిద్దవలసిన అవసరం ఎంతయినా ఉంది

వ్యాసం, ఫొటోలు
-లాల్ మహమ్మద్ యాకూబ్

జామియా మసీదు



# సుందరి సుబ్బారావు

- దూరి వెంకటరావు




ఆ వీధిలో నాలుగో ఇల్లు అత్యంత ఆకర్షణీయంగా వుంది కాంపౌండులో గులాబీ మల్లె, జాజి మున్నగు పూలమొక్కలు తమ సౌరభాన్ని నలుదిశలా విరజిమ్ముతున్నాయి

గేటు తెరుచుకుని లోపలకెళ్ళి కాలింగ్ బెల్ నొక్కాడు సుబ్బారావు

మరుక్షణం అరవై ఏళ్ళ వృద్ధు డొకడు బయట కొచ్చి ఎవరు కావాలన్నట్లుగా చూసాడు కళ్ళద్దాల లోంచి

అద్దెకు గదులేవైనా నసిగాడు సుబ్బారావు

ఎవరికి? ఆవతల వ్యక్తి ప్రశ్న

నాకే

నీకు పెళ్ళైందా? '

ఆ ముసలాయన ప్రశ్నకు జవాబివ్వడానికోక్షణం తటపటాయించాడు సుబ్బారావు ఇంత వరకు తనకు పెళ్ళి కాలేదన్న డిస్ క్వాలిఫికేషన్ వల్లే ఎక్కడా రూము దొరకలేదు ఉద్యోగం దొరికిందన్న ఆనందంలో ఉరకలు వేసుకుంటూ వచ్చాడీవూరు అదేనా మామూలు ఉద్యోగమేమీకాదు బ్యాంకులో పని పదహారువందలు జీతం ఇహ చేతినిండా సొమ్మే సినిమా కెళతానని అమ్మని డబ్బులడగక్కర్లేదు నాన్న పండుగకు పాలిష్టరు షర్టు తీస్తాడో లేదో నని బెంగపడనవసరం లేదు ఫ్రెండ్సుతో పిక్నిక్‌లకు పార్టీలకు అడ్డువుండదు బావి జీవితమంతా వడ్డించిన విస్తరే ఇలా ఎన్నో కలలు గన్న సుబ్బారావుకి ఉండటానికి చిన్న గది కూడా దొరకక పోయేసరికి అతడి ఉత్సాహం నీళ్ళు కారిపోయింది తనకు పెళ్ళైతే గాని ఎవరూ ఇల్లు ఇచ్చేటట్లు లేదు ఇప్పటికిప్పుడు ఎవరిమెడలో తాళి కట్టడం? తన బాధ ఈ జనాల కెలా తెలుస్తుంది?

బేచులర్ కైతే గది అద్దెకివ్వరా? సూటిగా అడిగాడు ఉన్న ఆశ వదులుకుంటూ

ఎందుకివ్వం? ఊరికే మాట వరసకడిగాను అంటూ లోపలకు రమ్మనమని మేడ మీద వున్న గది చూపించాడు

రూము విశాలంగా ఎంతో బాగుంది

అద్దె ఏమాత్రం వుంటుంది? నమ్రతగా అడిగాడు సుబ్బారావు వచ్చిన అవకాశం ఎక్కడ చేజారి పోతుందో నన్న బెంగతో

మంచివాళ్ళ కెవరికైనా ఆ గదిస్తే మాకు కాస్త సహాయంగా వుంటారని తప్ప అద్దె కోసం కాదు నాయనా ఈ ఇంట్లో వుండేది నేనూ, మా ఆవిడే కొడుకు లిద్దరూ ఉద్యోగ నిమిత్తం సుదూరంగా వెళ్ళి పోయారు

ఆశ్చర్య పోయాడు సుబ్బారావు 'ఈ కాలంలో కూడా ఇంత అమాయకులున్నారా' అనిపించింది ఆ ముసలాయన మంచి తనానికి లోలోపలే జోహార్లర్పించాడు కాస్త ఆలశ్యంగా దొరికినా మంచిల్లే దొరికిందనుకున్నాడు

రెండు వందలిచ్చినా ఇలాంటి పట్నాల్లో ఇంత మంచి రూము దొరకదు అలాంటిది తనకు తోచినంత ఇమ్మని ఆ ఇంటి యజమాని అనడంతో ఉన్న పళంగా లాడ్జిలో వున్న తన పెట్టె, బెడ్డింగు తెచ్చుకుని దిగాడు సుబ్బారావు

ఉదయం లేస్తూనే నోట్లో బ్రష్ పెట్టుకుని భుజం మీద తువ్వాలేసుకుని లుంగీతో మేడ మెట్లు దిగుతున్న సుబ్బారావు వ కిట్లో పంపు దగ్గర అందమైన అమ్మాయిని చూచి ఆగిపోయాడు

ఆమెకు పద్దెనిమిదేండ్లు వుంటాయి గుండ్రటి ముఖం ఎర్రటి శరీర ఛాయ, ఇంతలేసి కళ్ళు పిరుదుల వరకు వ్రేలాడుతున్న నల్లని ఎత్తైన జడ తన వంటి చాయతో పోటీ పడుతున్న ఎర్రటి వాయిల్ చీర, పిడికిట్లో ఇమిడి పోయేటంతటి సన్నని నడుము ఎత్తైన వక్షస్థలం ఏ అవయవానికా అవయవం పొందికగా చిత్రకారుడు తీర్చి దిద్దిన చిత్రంలాగుంది

చీర చెంగు బొడ్లో దోపుకుని బిందె చంక నెత్తుకుని హంసగమనంతో ప్రక్కింట్లో కెళ్ళి పోయింది తను వుంటున్న ఇంటి దొడ్లోంచి వాళ్ళింటికి చిన్న గేటుంది రోజూ మంచినీళ్ళు పట్టుకోవడానికి వస్తుందికాబోలనుకున్నాడు

బ్రష్ చెయ్యడం పూర్తి చేసి స్నానాని కుపక్రమించాడు సుబ్బారావు ఇప్పుడతని మనస్సంతా గజిబిజిగా తయారైంది తనింత వరకు అటువంటి అందాన్ని ఎక్కడా చూడలేదు ఆ ముగ్ధమోహన సౌందర్యరాశి పొందుకోసం పరితపించ సాగిందతని మనసు

ఆ రాత్రి హోటల్లో భోంచేసి, రూము కొచ్చి పడుకున్నాడన్న మాటే గాని నిద్రమాత్రం రావడం లేదు అతడి ఆలోచనలు ఉదయం కుళాయి దగ్గర చూసిన అమ్మాయి చుట్టూ పరిభ్రమించ సాగాయి ఎలాగైనా సరే ఆమెను పరిచయం చేసుకోవాలి

# కోటయ్య అనుభవం - సూరయ్య నోటనే విందాం



కోటయ్యా సూరయ్యా ఇరుగు పొరుగు ఊళ్ళ రైతులు
ఎన్నాళ్ళనుంచో మిత్రులు ఒకసారి అనుకోకుండా కలిశారు...




























పూర్తి వివరాలకై మీకు దగ్గరలోని న్యూ ఇండియా కార్యాలయానికి విచ్చేయండి
లేదా ఏజెంటును కలవండి.




**న్యూ ఇండియా ఎష్యూరెన్స్**

(జనరల్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా అనుబంధ సంస్థ)

నష్టాలలో మీకు నమ్మకమైన ఆధారం — భీమా!

# సుందరి – సుబ్బారావు

క్రమేపీ పరిచయాన్ని ప్రణయంగా మార్చుకోవాలి పెళ్లి చేసుకుని కనరాని లోకాల్లో విహరించాలి ఇలా ఎన్నో పగటి కలలు కంటున్న సుబ్బారావుకి ఎప్పుడో మగతగా నిద్ర పట్టింది బళ్ళున తెల్లారే సరికి మెలకువ వచ్చింది

మేడమీంచి క్రిందకి చూసాడు కుళాయి దగ్గర అమిలేదు చివుక్కు మన్న దతడి హృదయం ఆమె రాక కోసం గుడ్లప్పగించి చూస్తూ నిలబడ్డాడు తలంటుకుని జడవదలుగా వేసుకుని ముచ్చటైన ముదురు ఎరుపు రంగు గులాబీ పువ్వును తలలో తురుముకుని వయ్యారంగా వస్తూ వుంటే ఆమె కట్టుకున్న నీలం రంగు కంచి పట్టు చీర కుచ్చిళ్ళు అటు ఇటు నృత్యం చేస్తున్నాయి

సుబ్బారావు ఎదలో కోటి దీపాలు వెలిగాయి. ఆమె అందాన్నంతా ఒకే సారి జుర్రుకోవాలన్నంత ఆశగా ఆతృతగా చూసాడు

ఆమె అతడిని గమనించినట్లు లేదు తన పనేమో తను చేసుకు పోతోంది చిన్న పొడి దగ్గు దగ్గి ఆమె దృష్టిని తన వైపు మళ్ళించు కుంటే బావుండునేమో నని పించింది అంతలోనే తన ఆలోచన తనకే ఎబ్బెట్టుగా తోచింది అలా చేస్తే తనను తక్కువగా అంచనా వేయవచ్చు తనపై హేయ భావం కలగవచ్చు అంతేకాదు కాలేజీ కుర్ర చేష్టలు ఇక్కడ చేస్తే తన వునికికే భంగం వాటిల్లే ప్రమాదముంది ఇలా పరిపరి విధాలు ఆలోచిస్తూ వుండగానే నిండిన బిందెను చంకనెత్తుకుని వెళ్ళి పోయిందామె శూన్యమై పోయిందతడి మనసు వెయ్యి వోల్టుల విద్యుత్ కాంతి నుండి సడన్‌గా గాఢాంధకారంలో కడుగు బెట్టినట్లైంది

మరో రోజు

ఆ అందాల అపరంజి నీళ్ళు పట్టుకుంటూ వుండగా దగ్గర కెళ్ళాడు సుబ్బారావు

అతడిని చూడడంతోనే బిందె తియ్యబోయిందామె

తొందర లేదు మీ బిందె నిండనివ్వండి తర్వాత నా బకెట్టు పట్టుకుంటాను అన్నాడెంతో బుద్ధిమంతుడిలా

చిరునవ్వు నవ్విందామె ఆ నవ్వులో ఎన్ని అందాలు చూసాడో తనకే తెలీదు

నాపేరు సుబ్బారావు ఆపైన కనిపించే గదిలో వుంటున్నాను ఈ వూళ్ళో నాకుద్యోగ మైంది ఆమె అడక్కుండానే చెప్పుకు పోతున్నాడు సుబ్బారావు

అతడి మాటలకు మళ్ళీ చిరునవ్వే సమాధాన మైంది

మరి మీ గురించి ఏమీ చెప్పారు కాదు అన్నాడు సుబ్బారావు కాస్త నిష్ఠూరంగా

నాపేరు సుందరి ఈ ప్రక్కింట్లో వుంటున్నాం మాకు కుళాయి లేదు రోజూ మంచి నీళ్ళు పట్టుకోడానికిక్కడ కొస్తూ వుంటాను అన్నదామె ఎంతో ఫ్రీగా

ఆమె స్వరం వీణ మీటినట్లుగా వుంది మాటలను బట్టి ఆమె అంతో ఇంతో చదువు కున్నట్లుగా కనిపిస్తోంది

చదువు చక్కదనం సభ్యత సంస్కారంతో మూర్తీభవించిన ఆ పుత్తడి బొమ్మ తన కర్ధాంగైతే అంతకన్నా అదృష్టం మరొకటుంటుందా? నిలబడే కలలు గంటున్నాడు సుబ్బారావు

నిండిన బిందెను చంకనెత్తుకుని వస్తానండి అన్నదామె

ఆమె మాటలకు హఠాత్తుగా ఆలోచనల నుండి తేరుకుని మంచిది అన్నాడు ఆమె వెళ్ళినవైపే కన్నార్పకుండా చూస్తూ

మరునటి రోజు ఉదయం లేస్తూనే ఆమెకోసం ఎదురు చూసాడు కాని సుందరి ఆ రోజు ఎందుచేతో రాలేదు ఆ రోజేకాదు వరుసగా నాలుగు రోజులు ఆమె నీళ్ళు పట్టుకునేందుకు రాక పోయే సరికి అతడి మనసంతా వికలమై పోయింది

బ్యాంకులో పని చేస్తున్నా మనసు మాత్రం స్వాధీనంలో లేదు అనుక్షణం సుందరి గురించే ఆలోచన సుందరి నాలుగు రోజులై నీళ్ళకెందుకు రావడం లేదు? ఆమె పట్ల తను తీసుకున్న చనువు ఆమెను బాధించిందా? తన ప్రేమ వన్‌వే ట్రాఫిక్కైతే ఏం ప్రయోజనం? ఇలా ఎన్నో రకాల ఆలోచనలు అతడి మెదడులో సుళ్ళు తిరుగుతున్నాయి పరధ్యానంగా వుండడం వలన ఆఫీసు పనిలో పొరపాట్లు దొర్లుతున్నాయి ఆవేళ మరి పని చేయలేక బ్రాంచి మేనేజర్ని కలిసి మధ్యాహ్నం శలవు పెట్టేసి రూముకెళ్ళి పడుకున్నాడు

సుబ్బారావుగారూ! తలుపు తట్టిన శబ్దం ఆ గొంతుక ఎక్కడో విన్నట్లని పించి గబీలుమని లేచి గడియ తీసాడు

ఎదురుగా అరమోడ్పు కన్నులతో సుందరి అమితాశ్చర్య పోయాడు సుబ్బారావు సుందరి తన కోసం గదికి ఇది కలా? నిజమా? ఒకమారు తన శరీరాన్ని గిల్లుకుని పరీక్షించు కున్నాడు స్వప్నం కాదు వాస్తవమే నని నిర్ధారణ చేసుకుని లోపల కాహ్వానించాడు

మీరీ సమయంలో వుంటారో వుండరో నని సందేహిస్తూ వచ్చాను అందామె సుందరి మాటల్లో అస్పష్టమైన ఆవేదన వుంది

ఈ రోజు కాస్త తలనొప్పిగా వుంటే అఫ్ దే లీవ్ పెట్టి వచ్చేసాను అలా నిలుచుండి పోయారు కూర్చోండి మడత కుర్చీ వాల్చాడు

"ఫరవాలేదు గత నాలుగు రోజులుగా మా అమ్మగారికి అస్వస్థతగా వుంది జ్వరంతో ఇప్పుడామె ఏవేవో కలవరిస్తోంది నాకు బయం వేసి ఇలా వచ్చాను ప్లీజ్ డాక్టరు గారి నెవరినైనా "

మరి ఆమె నోటి నుండి మాటలు రావడం లేదు ఆమె నయనాలు శ్రావణ మేఘాలయ్యాయి

మీరేమీ కంగారు పడకండి ఇప్పుడే వెళ్ళి దగ్గరుండి డాక్టరు గారిని తీసుకొస్తాను అంటూ స్టాండుకు వ్రేలాడు తున్న ప్యాంటు నందుకున్నాడు

ఆమె ఇంకా అక్కడే నిలబడి వుండటంతో మీరు ఏదో అనబోయాడు సుబ్బారావు

అతడి అవస్థను అర్థం చేసుకుని థేంక్స్ చెప్పి వెళ్ళి పోయింది సుందరి

పది నిమిషాలలో ఆటోలో వెళ్ళి డాక్టర్ని తీసుకొచ్చాడు

రోగిని పరీక్షించి ప్రిస్క్రిప్షన్ రాసి చ్చాడు డాక్టరు సుందరి అతడికి ఫీజివ్వ బోతే వద్దని తనే చెల్లించాడు కృతజ్ఞతగా అతడి కళ్ళల్లోకి చూసింది సుందరి

డాక్టరు వెళ్ళి పోయాక మరో పది నిమిషాలుండి పేషంటును జాగ్రత్తగా చూసుకోమని చెప్పి రూము కొచ్చాడు సుబ్బారావు

ఆ రోజు లగాయితూ ఇంచు మించు ప్రతిదినం సుందరి ఇంటికి వెళ్ళడం ఆమె తల్లిగారి యోగక్షేమాలు కనుక్కోవడం సుందరికి ధైర్యం చెప్పడం తన దినచర్యల్లో ఒక భాగమై పోయింది

కొద్ది రోజులకు సుందరి తల్లి శాంతమ్మకు జ్వరం తగ్గుముఖం పట్టింది

సుబ్బారావు కలుపుగోరు తనానికి మంచి తనానికి ముగ్ధురాలైంది శాంతమ్మ

సమయం చూసి సుందరిని తను పెళ్ళి చేసుకుంటానని శాంతమ్మగారికి చెప్పాలనుకున్నాడు సుబ్బారావు కాని ఆవిడతో ప్రస్తావన ఎలా ప్రారంభించాలో తెలియక రూములో కూర్చుని రెండు మూడు సార్లు రిహార్సల్సు కూడా వేసుకున్నాడు

ఆ రోజు ఆదివారం ఇంటి దగ్గరే వున్నాడు సుబ్బారావు స్నానం చేసి నీటుగా డ్రెస్సయి మేడ మెట్లు దిగుతూ సుందరి ఇంటివైపు చూసాడు అప్పుడే తెల్లని అంబాసిడర్ కారొచ్చి వాళ్ళ గుమ్మం ముందాగింది కార్లోంచి పాతికేళ్ళ యువకు డొకడు దిగాడు అతనితో పాటు యాభై ఏళ్ళ స్త్రీ కూడా వుంది 'వాళ్ళెవరై వుంటారబ్బా క్షణం గట్టిగా ఆలోచించాడు సుబ్బారావు బహుశా సుందరికి పెళ్లి చూపులేమో ఆ ఆలోచనకు అదిరిపడ్డాడు తనీ విషయంలో ఇంకా జాప్యం చేస్తే ఆ అపరంజి బొమ్మను ఎవరో ఒకరు తన్నుకు పోతారు అనుకుని వడివడిగా అడుగులేస్తూ సుందరి ఇంటి కెళ్ళాడు సుబ్బారావు

వచ్చావా బాబూ నేనే కబురు పెడదామనుకుంటున్నాను సమయాని కొచ్చావు అన్నది శాంతమ్మ

ఆమె మాటలు అర్థంగాక వెర్రి చూపులు చూశాడు సుబ్బారావు

మా అల్లుడొచ్చాడు పెళ్ళవుతూనే విదేశం వెళ్ళి పోవడం వలన సుందరిని అత్తవారింటికి పంపలేదు వాళ్ళీ రోజు అమ్మాయిని తీసుకెళ్తామంటున్నారు నా ఆరోగ్యం గురించి నీకు తెలుసు కదా ఇప్పటికిప్పుడు ఏ ఏర్పాట్లు చేయగలను? కాస్త శ్రమ అనుకోకుండా బజారు కెళ్ళి రెండు కిలోలు స్వీటేదైనా పట్టుకురా బాబు అంటూ వందరూపాయల కాగిత మిచ్చింది శాంతమ్మ

ఆమె మాటలకు సుబ్బారావు ముఖంలో నెత్తురు చుక్కలేదు మాటలు రాని మూగవాడిలా వణుకుతున్న చేతులతో నోటందు కున్నాడు యాంత్రికంగా □

# ఎల్లప్పుడూ ఆంప్రోనే!

పిల్లలకు
ఆంప్రో అంటే ప్రాణం...
అందుకే ఎప్పుడూ
తయారుగా ఉంచుతాను!
అందులో ఎంతో రుచి,
బలమూకల బిస్కట్లు!

కాస్త ఆగండి...
ఒక్క బిస్కట్లును తినండి.




**ఆంప్రో గ్లూకోజ్ బిస్కట్లు**
**ఆంప్రో తో మీకు నాణ్యత ఖాయం.**

Sista's/AIL/232/85 Tel a

సీరియల్

# ప్రత్యూష పవనాలు

జి. భవానీ కృష్ణమూర్తి

(గత సంచిక తరువాయి)

పొద్దు గూకుతుండగా వత్సలతో పాటు ఇంటికి వచ్చిన చెల్లెల్ని చూసి ఏమిటే అలా ఉన్నావ్? అంటూ గాబరాపడింది ప్రత్యూష

బాగా ఏడ్చినట్లు కళ్ళు ఎర్రగా ఉన్నాయి ముఖం ఉబ్బింది జుట్టంతా చెదిరి, బట్టలు నలిగి పది లంఖణాలు చేసి నిద్ర మంచం మీద నుంచి లేచి వచ్చినదానిలా ఉంది ప్రఫుల్ల

మాలతీదేవి కూడా చాలా కంగారుపడింది ఆ వాలకం చూసి

'అత్తయ్యా' ఎంత అడిగినా ఏడవడం తప్ప మరో మాట చెప్పదు నా దగ్గరకు వచ్చినప్పటినుంచీ అలా ఏడుస్తూనే కూర్చుని ఉంది అంది వత్సల, సంజాయిషీ ఇస్తున్నట్లు

ఏమ్మా! ఈ అమ్మ చచ్చిపోయిందనుకుని అలా ఏడ్చావా?? గద్గద స్వరంతో అడిగింది మాలతీదేవి

అమ్మా! బావురుమంటూ మాలతీదేవిని చుట్టేసింది ప్రఫుల్ల

చిన్నీ! జరిగినవీ విన్నవీ పూర్తిగా మరచిపొమ్మని నీకు మధ్యాహ్నమే చెప్పాను నలుగురిలో ఉంటే అన్నీ మరిచిపోతావని నిన్ను వదిన దగ్గరకి పంపించాను గానీ అలా ఏడుస్తూ కూర్చుని ఉంటావనుకుంటే అసలు పంపేదాన్ని కాను ఇలా చూడు ప్రఫుల్ల ముఖాన్ని తనకి అభిముఖంగా తిప్పుకొని ఇదిగో! ఇంకోసారి ఆ విషయాలన్నీ జ్ఞాపకం తెచ్చుకుని కంట తడి పెట్టుకున్నావంటే నిజంగానే నేను చచ్చిపోయినంత ఒట్టు నీ దృష్టిలో నేను చచ్చిన దానితో సమానం అని నేను అనుకోవాల్సి వస్తుంది అంది సీరియస్‌గా

క్షమించమ్మా ఎందుకో నాకు తెలియకుండానే ఏడుపు వచ్చేస్తోంది గబగబా కళ్ళు తుడిచేసుకుంటూ బేలగా అంది

దగ్గరకు తీసుకుని నుదుటి మీద ముద్దు పెట్టుకుంటూ బంగారు తల్లీ! ఈ అమ్మ బ్రతికి ఉన్నంత కాలమే కాదు చచ్చిపోయిన తరువాత కూడా ఏడవకూడదు నువ్వు

నేను చచ్చిపోయానని తెలిసినప్పుడు మాత్రం రెండే రెండు కన్నీటి బొట్లు రాల్చు నా ఆత్మ శాంతిస్తుంది అంది

అలా మాట్లాడకమ్మా నాకు మళ్ళీ ఏడుపొస్తుంది అంది, దుఃఖాన్ని బలవంతంగా ఆపుకుంటూ

అసలు విషయం తెలియని ప్రత్యూష వత్సల అయోమయంగా ముఖాముఖాలు చూసుకున్నారు

రామకృష్ణ లేచి తడుముకుంటూ బయట వరండాలోకి వెళ్ళి కూర్చున్నాడు సోఫాలో కూర్చుని ఉన్న సావిత్రి ఇబ్బందిగా తలదించుకుంది

లేదులే వెళ్ళమ్మా శుభ్రంగా స్నానంచేసి నీట్‌గా తయారవ్వు నిన్నిలా చూస్తుంటే నాకు బాధేస్తోంది మున్నీ! చిన్నిని లోపలికి తీసికెళ్ళమ్మా ఇద్దరినీ లోపలికి పంపించింది

వత్సలా! బాలింతరాలివి అలా నిలబడ్డావెందుకమ్మా బాగా అలసటగా కనిపిస్తున్నావు వెళ్ళి విశ్రాంతి తీసుకోమ్మా ప్రేమగా కోడలి భుజం తట్టి లోపలికి పంపించింది

ఎవరి గదుల్లోకి వాళ్ళు వెళ్ళాక మాలతీదేవి మెల్లగా వెళ్ళి సావిత్రి పక్కన కూర్చుని ఏమిటి సావిత్రీ! కబుర్లు అంది నిట్టూర్పు విడుస్తూ

ఏమున్నాయి వదినా అన్నయ్య పోయినా ఆడదానివి నువ్వు ధైర్యంగా నిలబడి పిల్లల్ని వృద్ధిలోకి తీసుకొచ్చావు నువ్వు నమ్మినా నమ్మకపోయినా నాకు చాలా సంతోషంగా ఉంది మేము అహంకారంతో కన్నుమిన్ను కానక మిడిసిపడి ఇదిగో చివరికి ఈ స్థితికి వచ్చాము సుగుణ సుశీలల సంసారాలు కూడా అంతంత మాత్రంగానే ఉన్నాయి చీరకి తక్కువ ఓణీకి ఎక్కువ అన్నట్లు చాలీ చాలని బ్రతుకులు అంటూ మొదలుపెట్టి కష్టసుఖాలు ఏకరవు పెడుతూంటే వింటూ కూర్చుంది మాలతీదేవి

మొదటి నుంచీ ఈ సౌమ్యత ఉంటే మావయ్యగారు ఎంత సంతోషించేవారో! అనుకోకుండా ఉండలేకపోయింది

* * * * * * *

ప్రఫుల్ల స్నానానికి వెడుతుంటే ఆపి చిన్నీ! అసలేం జరిగిందే అడిగింది ప్రత్యూష

వద్దక్కా నన్నేమీ అడగొద్దు అవన్నీ జ్ఞాపకం తెచ్చుకుంటే నాకు ఏడుపొచ్చేస్తుంది ఏడవొద్దని అమ్మ ఒట్టు పెట్టుకుంది నువ్వే విన్నావుగా అంది ప్రఫుల్ల తొందర తొందరగా

ఏడవకుండా చెప్పలేవా?

ఊహు! ఏడవొద్దనుకున్నా ఏడుపు వచ్చేస్తుంది అంది బేలగా

సరే స్నానం చేసిరా నీరసంగా వెనుతిరిగింది ప్రత్యూష

స్నానం చేసి వచ్చేవరకూ ఏవేవో ఆలోచిస్తూ కూర్చుని ప్రఫుల్ల వచ్చాక జడ అల్లి ముస్తాబు అవడంలో సహాయంచేసింది

తయారయ్యాక పద హాల్లో కూర్చుందాము అనేసరికి వద్దు ఆ రాక్షసిని చూస్తేనే నాకు అసహ్యం నరికి పోగులుపొయ్యాలన్నంత కోపం వస్తుంది కావాలంటే నువ్వెళ్ళు అంటూండగానే ఆమె పిడికిళ్ళు బిగుసుకున్నాయి

మనింటికి వచ్చి పట్టుమని పది గంటలైనా అవలేదు మధ్యలో ఆవిడేంచేసిందే? తెల్లబోయింది ప్రత్యూష

జరిగిన కథ – 8 ప్రఫుల్ల అన్య మనస్కతకు కారణం ధీరజ్‌తో ప్రేమ వ్యవహారమేనని ప్రత్యూష కనిపెడుతుంది ప్రహ్లాద్ స్నేహితుడు మనోజ్ తన తల్లి దండ్రుల అకృత్యం గురించి విచారిస్తాడు ప్రహ్లాద్ భార్య వత్సల అడ కవల శిశువుల్ని కంటుంది ప్రేమ విషయం ఇంట్లో ధైర్యంగా చెప్పమని ధీరజ్‌కు మరో ఉద్యోగం వచ్చేదాకా దాచాలనుకోవడం సమంజసం కాదని ప్రత్యూష వివరిస్తుంది మనోజ్ ఆత్మహత్యా ప్రయత్నంలో ఉన్నాడని పెళ్ళి గురించి నచ్చచెప్పమని అడగడానికి సావిత్రి రామకృష్ణలు మాలతీదేవి దగ్గరికి వస్తారు

ఏం లేదులే సమయం వచ్చినప్పుడు చెప్తాను కావాలంటే నువ్వెళ్ళు, అంది ఆవేశాన్ని బలవంతంగా అణుచుకుంటూ

లేదులే పోనీ పైకెళ్ళి వదినదగ్గర కూర్చుందాము పద పాపాయి లిద్దరితో కాసేపు గడిపితే కాస్త రిలీఫ్‌గా ఉంటుంది

పదయితే

ఇద్దరూ ఒకరి వెనుక ఒకరుగా మేడమీదకి వెళ్ళారు

వత్సల పాపని ఒడిలో పడుకోబెట్టుకుని పాలు యిస్తోంది

రా చిన్నీ చెయ్యిపట్టుకుని పక్కన కూర్చోబెట్టుకుంది వత్సల

అదొక్కతే కాదు నేనూ వచ్చాను చిన్నాదపడుచు తప్ప నేను కనిపించడంలేదేమిటి నీ కంటికి? మనసులో అనుమానపు పురుగు తొలుస్తున్నా గంబీరతని సడలించడానికి నవ్వుతూ వత్సలని వెళాకోళం చేసింది ప్రత్యూష

అమ్మమ్మా! ఎంతమాట నా కింకా చత్వారం రాలేదులే అయినా కనిపించకపోవడానికి నువ్వేమైనా నల్లపూసవా? గుండుసూదివా? నవ్వుతూ,



# ప్రత్యూష పవనాలు

చిన్నిపాపాయి నా ఒడిలో ఉందికదాని చిన్నిని నా పక్కనకూర్చోబెట్టుకున్నాను నీ పాపాయి పాలు త్రాగడం అయిపోయి అప్పుడే నిద్రలోకి జారుకుంది అంచేత నీ చోటు అక్కడ అంది

అయింది పెళ్ళి! వెక్కిరించి అదిగో అక్కా! నువ్వు నా పాపాయి జోలికివస్తే చూడు ఏం చేస్తానో కళ్ళు పెద్దవిచేసి తర్జనితో బెదిరించింది ప్రఫుల్ల

నాకయిపోతే నువ్వు కూడా తొందరగా పెళ్ళిచేసేసుకోవచ్చునా? ఆశ-దోశ-నేను ఇంకా ఇప్పుడే చేసుకోనుగా!

మానేయ్! ఇప్పుడు నేను మాత్రం పెళ్ళికోసం ఎదురుచూస్తూ కూర్చున్నాననుకున్నావేమిటి? మనం పెళ్ళిచేసుకుని వెళ్ళిపోతే ఈ పాప లిద్దరూ మనకోసం బెంగపెట్టుకోరూ? నల్లగా నిగనిగలాడుతూ పట్టుకుచ్చులా ఉన్న పాపజుట్టు నిమిరింది ప్రఫుల్ల

పాలు తాగడం మానేసి తలతిప్పి ప్రఫుల్ల ముఖంలోకి చూసి కిలకిలా నవ్వింది పాప

పూర్తిగా పాలు తాగనివ్వవే ప్రత్యూష వారిస్తున్నా వినకుండా రారా బుజ్జీ! నీకోసమే ఎదురుచూస్తున్నాను అంటూ పాపని తన ఒడిలోకి తీసుకుంది పదిలంగా కాసేపటికే నిద్రలోకి జారుకుంది పాప మెల్లగా పక్కమీద పడుకోబెట్టి అక్కా! బాగా తల నొప్పిగా వుందే నేను వెళ్ళి పడుకుంటాను నువ్వు కూర్చుంటే కూర్చో లేచింది ప్రఫుల్ల

ఆ డబ్బాలో టాబ్లెట్ ఉంది, వేసుకుని నీళ్ళు తాగి అలా పాప పక్కన పడుకో చిన్నీ అంది వత్సల

వద్దులే నిద్రపట్టేస్తే నీకు ఇబ్బంది వెళ్ళి నా పక్కమీద పడుకుంటాను టాబ్లెట్ తీసి వేసుకుని కూజాలోని నీళ్ళు గ్లాసులోకి ఒంపుకుని తాగింది

కాస్త అమృతాంజనం రాయనేమిటే చిన్నీ?

వద్దులే అక్కా నిద్రపడితే అదే తగ్గిపోతుంది అంటూ వెళ్ళిపోయింది ప్రఫుల్ల

వదినా! చిన్ని ఎందుకలా ఏడ్చింది? అమ్మ అలా మాట్లాడిందేమిటి? చిన్ని నడిగితే అమ్మ ఒట్టుపెట్టుకుంది కదా! ఆ విషయాలన్నీ తలుచుకుంటే వద్దన్నా నాకు ఏడుపొస్తుంది అని తప్పించుకుంది

నాకూ అదే అనుమానంగావుంది మున్నీ అత్తయ్య యిందాకేగా ఒట్టుపెట్టుకున్నారు? మధ్యాహ్నం అంతా చిన్నిని బ్రతిమాలడంతోనే సరిపోయింది నాకు ఏడవడం తప్ప నోరు విప్పందే అప్పుడు నువ్వు అడిగివుంటే చెప్పేదేమో?

చ! అదేమిటి దినా అలా అంటావు? మన ముగ్గురిమధ్య తేడా లున్నాయా? బేదబావాలున్నాయా? నాదగ్గర ఎంత చనువుగా వుంటుందో నీ తోనూ అలాగే వుంటుంది ఒక్కొక్కసారి నేనైనా విసుక్కుంటానుగానీ నువ్వెప్పుడూ విసుక్కో వుకూడాను ఆ మనోజ్ తల్లి ఏదో అన్నట్టుంది చంపుతా నరుకుతా ఆ రాక్షసిని అంటూ ఆవిడమీద కారాలు మిరియాలు నూరుతోంది చిన్ని

ఆ విషయం మనతో చెప్పడానికేం? అదే నిజమైతే అత్తయ్య ఆవిడని ఒక్క క్షణంకూడా గుమ్మంలో నిలబడనివ్వరు అంది వత్సల వెంటనే

అది నిజమే అమ్మ హాయిగా ఆవిడపక్కన కూర్చుని కబుర్లు చెప్తోంది

ఇద్దరూ ఆ విషయం గురించి మాట్లాడుకుంటూ వుండగానే ప్రహ్లాద్ వచ్చాడు

అతను లోపల అడుగు పెట్టగానే ఆరాటం ఆపలేక అన్నయ్యా! మధ్యాహ్నం ఏమైనా గొడవ జరిగిందా? చిన్ని అలా ఏడ్చింది ఎందుకు? అడిగేసింది ప్రత్యూష

మీ కెందుకమ్మా అవన్నీ మనసు పాడవడంతప్ప దానివల్ల ప్రయోజనం ఏమీలేదు అన్నాడు

తెలియకపోవడంవల్ల అనేక విధాలుగా ఆలోచిస్తుంటే బుర్ర వేడెక్కిపోతోంది అంది వత్సల

చిన్ని ఏది?

తల నొప్పిగా వుందని నా గదిలో కెళ్ళి పడుకుంది చెప్పింది ప్రత్యూష

సరే అయితే ఆ బీరువా లాకర్‌లో కేసెట్ ఉంటుంది పెట్టుకుని వినండి అంతా మీకే తెలుస్తుంది ఇదిగో తాళంచెవి అంటూ జేబులోంచి తీసి యిచ్చి కిందికి వినిపించకుండా స్లోగా పెట్టుకోండి అని చెప్పేసి బయటికి వెళ్ళిపోయాడు ప్రహ్లాద్

గబగబా బీరువా తెరిచి లాకర్‌లో నుంచి కేసెట్ బయటికి తీసి టేప్‌రికార్డరు కోసం చూస్తే అది కనిపించలేదు

కింద గదిలో వున్నట్టుంది వదినా తెస్తానుండు పరుగెత్తుకుంటూ కిందికి వెళ్ళి టేప్‌రికార్డరు తీసుకుని ప్రఫుల్ల నిద్రపోయిందో లేదోనని ఒకసారి చూసి మరీపైకి వచ్చింది

కేసెట్ లోపలపెట్టి రీవైండ్‌చేసి ఇద్దరూ చెరోపక్క కూర్చుని ఊపిరిబిగబట్టి వినసాగారు ఇద్దరూ పరిసరాలు మరచి తమని తామే మరచిపోయి

* * * * * * * *

మారుతీరావుగారు గుంటూరులో ప్రముఖ బియ్యం వ్యాపారస్తులు ఒక కొడుకు, ముగ్గురు కూతుళ్ళు ఆయన సంతానం ఆయన భార్య దుర్గమ్మ నిజంగా కనకదుర్గే పరమగయ్యాళి డబ్బుకోసం గడ్డి తినేమనిషి

పిల్లలకి కూడా అవే తల్లిపోలికలు, అనుకున్న పని అయితీరాలి అందుకు ఎంత ఖర్చయినా వెనుతీయనిస్వబావం

మారుతీరావుగారు సాదుస్వబావి భార్య గయ్యాళితనానికి పెళ్ళయిన కొత్తలో మానసికంగా కుమిలిపోయినా, తరువాత బాధపడడం మానేసి నిమిత్తమాత్రంగా వుండడం నేర్చుకున్నారు

ఇంటి ఖర్చుల నిమిత్తం నెలకి సరిపడా డబ్బుయిస్తే ఆ డబ్బుని వారం రోజుల్లోనే ఖర్చుచేసేసి ఖాళీ చేతులతో భర్తముందు నిలబడేది దుర్గమ్మ కొన్నాళ్ళు చూశారు మారుతీరావుగారు

పిల్లలు పెద్దవాళ్ళవుతున్నారు విచ్చలవిడి ఖర్చు తగ్గించమని భార్యకి నయానభయాన చెప్పిచూశారు ఫలితం శూన్యం

తనే యింటికి కావలసిన సరుకులన్నీ నెలకోసారి తీసుకొచ్చి పడెయ్యడం మొదలుపెట్టి పై ఖర్చుల నిమిత్తం కొంత డబ్బు భార్యకి అందుబాటులో వుంచడం మొదలుపెట్టారు

తల్లి విచ్చలవిడితనానికి వారసులయ్యారు పిల్లలు నలుగురు

భార్య స్వబావంతో రాజీపడిపోయినా పిల్లలు కూడా ఆవిదంగా తయారుకావడంతో కృంగిపోయారాయన

వారిని దగ్గర కూర్చోబెట్టుకుని నయాన భయాన చెప్పిచూశారు కానీ ప్రయోజనం లేకపోయింది పైగా తమ అవసరాలకి సరిపడా డబ్బు యివ్వడంలేదని తండ్రిమీద కోపంతో మరింత రెచ్చిపోయేవారు ఏం చెయ్యాలో తోచలేదాయనకి

ఒకసారి ఏదో పనిమీద హైదరాబాద్ వెళ్ళిన మారుతీరావుగారికి అనుకోకుండా చిన్ననాటి మిత్రుడైన ప్రకాశరావుగారు కలిశారు

ఒరే ప్రకాశం! ఎన్నాళ్ళకి కలిశామురా అంటూ మిత్రుడ్ని ఆలింగనం చేసుకున్నారు మారుతీరావుగారు

నిజమేరా పద మా యింటికి వెడదాము ఎప్పుడొచ్చావు ఈవూరు? మహానంతోషంగావుంది ప్రకాశరావుగారికి

నిన్ననే వచ్చాన్రా నువ్వీ ఊళ్ళో ఉన్నట్లు నాకు తెలియనేతెలియదు ఈ వూళ్ళో నువ్వేంచేస్తున్నట్లు?

ఇంటికిపదరా తరువాత మాట్లాడుకుందాం అంటూ ఆటో పిలిచి ఎక్కికూర్చున్నారు

ఒక భవనం ముందు ఆగింది ఆటో

అబ్బో! వీడు మంచిస్థితిలోనే వున్నాడు అనుకున్నారు మారుతీరావుగారు ఆ భవనాన్ని ఎగాదిగాచూసి

రారా అంటూ గేట్లోనుంచి లోపలికి నడిచి ఆ కాంపౌండులో ఒకమూలగా వున్న అవుట్‌హౌస్ ముందుకి వెళ్ళి తలుపుతట్టారు

మరుక్షణంలోనే తలుపులు తెరుచుకున్నాయి

బంగారపుతీగలా పరువపు మొలకలా ఉన్న పదహారేళ్ళ అమ్మాయి వచ్చావా నాన్నా అంటూ తండ్రి దగ్గరకు రాబోయి వెనుకవున్న మారుతీరావుగార్ని చూసి వెనక్కిజరిగింది

రారా! కూర్చో మారుతీరావుగార్ని చెయ్యిపట్టుకుని తీసుకొచ్చి కుర్చీలో కూర్చోబెట్టారు ప్రకాశరావుగారు

నాన్న యింత చనువుగా మాట్లాడుతున్నాడు ఎవరబ్బా? మారుతీరావు గారి సూటుబూటు చూసి ఆశ్చర్యంలో మునిగిందా అమ్మాయి

అమ్మా! వీడు నా బాల్యస్నేహితుడు చాలా రోజులతరువాత ఇవాళ బజార్లో అనుకోకుండా కలిశాడు ఒరేయ్! మా అమ్మాయి మాలతి ఇంటర్ చదువుతోంది

నమస్కారమండీ చేతులు జోడించి వినయంగా నమస్కరించింది మాలతి

ఆమె అందానికి ముగ్ధులై తదేకంగా ఆమెనే చూస్తున్న మారుతీరావుగారు సన్నగా వీణమీటినట్లు వున్న ఆమె గొంతు విని మరింత ముగ్ధులయ్యారు

శీఘ్రమేవ కళ్యాణప్రాప్తిరస్తు! ఏం చదువుతున్నావమ్మా–ఓహో! మీనాన్న చెప్పేశాడుకదూ ఇంటర్ చదువుతున్నావని చాలా బాగుందమ్మా చాలా సంతోషం అన్నారు మనస్ఫూర్తిగా

పెదవులు విడీవిడనట్లు నవ్వి తలదించుకుంది మాలతి

అలా నవ్వుతున్నప్పు డామె ముఖం పున్నమి నాటి చంద్రబింబంలా కన్పించింది మారుతీరావుగార్కి

మీరిద్దరూ మాట్లాడుకుంటూండండి కాఫీ తీసుకొస్తాను అంటూ లోపలికెళ్ళబోతూంటే అమ్మా! కాఫీ తాగితే అన్నం సహించదు త్వరగా వంట ఏర్పాట్లు చూడమ్మా ఈ ఊళ్ళో వీడిపని అయ్యేవరకూ మనింట్లోనే వుంటాడు అన్నారు ప్రకాశరావుగారు

అలాగే నాన్నా అంటూ వెళ్ళిపోయింది లోపలి గదిలోకి

ఒరే మారుతీ! పుట్టిన వెంటనే తల్లిని కోల్పోయిన దురదృష్టవంతురాలు నా బిడ్డ దానిని గొప్పింటి కోడలుగా చేసి తండ్రిగా నా బాధ్యత తీర్చుకోవాలని ఎంతో తహతహలాడాను కాని బిజినెస్‌లో అనుకోకుండా నష్టం రావడంతో ఉన్న ఇల్లుకూడా అమ్ముకుని ఈ అద్దెకొంపలో ఉండాల్సివచ్చింది అటువంటి పరిస్థితుల్లో పిల్ల పెళ్ళి ఎలాచేస్తానో నాకే అర్థంకావడంలేదు తన పరిస్థితిని స్నేహితునిముందు వెళ్ళబోసుకున్నారు ప్రకాశరావుగారు

నాన్నా! వంటయింది వడ్డిస్తున్నాను రండి మావయ్యా! లేచి కాళ్ళు కడుక్కోండి పైటకి చేతులు తుడుచుకుంటూవచ్చింది మాలతి

మావయ్యా! అంటూ ఆత్మీయంగా పిలిచిన ఆమెపిలుపు మారుతీరావుగారి ఎదను వీణమీటినట్లు మీటింది

ఈ కూర ఇంకొంచెం కలుపుకోండి మామయ్యా ఈ పచ్చడి కాస్త రుచిచూడండి అంటూ మాలతి కొసరికొసరి వడ్డిస్తూంటే చాలారోజులతర్వాత మంచి భోజనం కడుపునిండా తిన్నారు మారుతీరావుగారు

దుర్గమ్మ ఇంట్లో వున్న సరుకులన్నీ ఒక్కసారే అయిపోయేలా తన కిష్టం

# ప్రత్యూష పవనాలు

అని ఓ కూర కొడుక్కి ఇష్టం అని ఒకటి కూతురికిష్టం అని ఒక ఎంది ఏంటా అలా యిష్టం వచ్చినట్టు వండివడేస్తు ందేతప్ప భర్త యిష్టాలు అవసరాలు పట్టించుకునే అలవాటు మొదట్నుంచీలేదు మిల్లు కట్టేస లెక్కలన్నీ చూసుకుని ఏ అర్ధరాత్రికో ఇల్లు చేరే మారుతీరావుగారికి చప్పగా చల్లారిపోయిన అడుగు బడుగు వంటకాలే మిగిలేవి అవికూడా దుర్గమ్మ నిద్ర కళ్ళతో -ఆవిలిస్తూ-సణుక్కుంటూ పెట్టడంతో ఏనాడూ ఆయనకి భోజనం చేస్తున్నట్లే అనిపించేదికాదు

మరునాడు లేచి పనిచూసుకోవాలంటే ఓపికకావాలి ఆ ఓపిక కావాలంటే ఏదో ఒకటి కడుపులో పడాలి కాబట్టి భోజనం చెయ్యడం అంటే అవసరంకొద్దీ చేసేపనే తప్ప ఇష్టంగా చేసేపనికాదు

ఇన్నాళ్ళకి మాలతి కొసరికొసరి వడ్డిస్తూంటే చేసిన భోజనం చిన్నతనంలో తల్లి గోరుముద్దలు తినిపిస్తూంటే కడుపునిండా తిన్నప్పటి భోజనంలా తృప్తిగా అనిపించింది

భుక్తాయాసంతో మంచాలమీద వాలి కబుర్లు చెప్పుకుంటూ అమ్మాయ్! లోపల ఒక్కదానివీ ఏం చేస్తున్నావమ్మా? నేనున్నానని సిగ్గుపడి లోపల దాక్కోనవసరంలేదు నేనేమీ పరాయివాడిని కాదు ఇలా వచ్చి కూర్చోమ్మా ఎలిచారు మారుతీరావుగారు

అబ్బే-అదేంలేదు మావయ్యా వంటగది సర్దుతున్నాను అంతేగానీ మీదగ్గర నాకు ఎగ్గేమిటీ? అంటూ పని ముగించుకునివచ్చి వారిదగ్గర కూర్చుని వారి చిన్ననాటి ముచ్చట్లు ఆసక్తితో వింటూ ఆశ్చర్యాన్ని ప్రదర్శిస్తూ చాలాసేపు కూర్చుండిపోయింది

★ ★ ★ ★ ★

మరునాడు ఉదయం మాలతి యిచ్చిన టిఫను తిని కాఫీలు త్రాగి మిత్రులిద్దరూ ఎవరిపనిమీద వారు బయటికి వెళ్ళిపోయారు

కాలేజీకెళ్ళే ప్రయత్నం విరమించుకుని వంటచేసేసి ఇల్లంతా నీట్‌గా సర్ది తను నీట్‌గా ముస్తాబై చదువుకుంటూ కూర్చుంది మాలతి

రెండు గంటలకి వచ్చారు మారుతీరావుగారు

భోజనం చేశాక విశ్రాంతి తీసుకుంటున్న సమయంలో మాలతిని ఎలిచి ఇలా కూర్చోమ్మా నీతో ఓ ముఖ్యవిషయం మాట్లాడాలి అంటూ పక్కన కూర్చోబెట్టుకున్నారు

నాతో మాట్లాడేంత ముఖ్యవిషయం ఏమిటి మావయ్యా? చిన్నగా నవ్వింది మాలతి

నేనీ ఊరు ఎందుకొచ్చానో తెలుసా?

ఏదో బిజినెస్ వ్యవహారాలమీద వచ్చారని నాన్న చెప్పారు

నిజమేనమ్మా ఒక మిత్రుడు నేను కలసి వాటాదార్లుగా వుండి ఒక ఆటో మొబైలు కంపెనీ పెట్టాలనుకున్నాము ఆ పనిమీదే ఈ వూరు వచ్చాను ఆ వ్యవహారం అంతా అనుకున్నట్లే సెటిలయిపోయింది కానీ ఇక్కడికొచ్చాక మిమ్మల్ని చూశాక నా నిర్ణయాల్లో కొద్దిగా మార్పులు చెయ్యడం జరిగింది అదేమిటో నువ్వడక్కముందే చెప్పేస్తాను

చిన్నప్పుడు చదువుకునే రోజుల్లో పుస్తకాలు కొనుక్కోడానికి ఫీజులు కట్టడానికి నా దగ్గర డబ్బులు లేకపోతే మీ నాన్న ఎంతో సహాయంచేసేవాడు నేను ఈనాడు ఇంత ఉన్నతస్థితిలో వున్నానంటే వాడు ఆనాడు చేసిన సహాయమేనని చెప్పుకోడానికి నేనేమీ సిగ్గుపడను అటువంటిది వాడు ఈనాడు పరిస్థితుల ప్రాబల్యంవల్ల- పరిస్థితులు తారుమారుకావడంవల్ల ఇబ్బందుల్లో వున్నాడని తెలిసి మిత్రునిగా నాకు తెలిసిన సహాయం చెయ్యకుండా వుండలేకపోతున్నాను అందుకని నేను ప్రారంభించబోయే ఆటో మొబైలు కంపెనీ నీపేరుమీద ప్రారంభించేందుకు ఏర్పాట్లు చేశాను దాని నిర్వహణ బాధ్యత మీ నాన్న చూసుకుంటాడు

మావయ్యా-మీరు-మీరు చాలా తొందరపడ్డారు కంగారుగా అంది మాలతి

నాకు తెలుసమ్మా మీనాన్న చాలా అభిమానస్తుడని మీకోసం నేనేదో త్యాగం చేసేస్తున్నానని నువ్వు అనుకుంటే పప్పులో కాలేశావన్నమాటే మీనాన్న నేనుకూడా పక్కా వ్యాపారస్తులం వ్యాపారస్తుల మధ్య యిచ్చిపుచ్చుకోవడం అనేది ముఖ్యమైన అంశం అమ్మా! నువ్విలా అనుకున్నాసరేగానీ కాస్త స్వార్థబుద్ధితోనే ఈ సహాయంచేస్తున్నాను అదేమిటంటావా? నిన్ను మా యింటి కోడలిగా చేసుకోవాలని నిర్ణయించుకోవడం

గుడ్లప్పగించిచూస్తూ ఆయన మాటలు వింటున్న మాలతి చివరివాక్యం వినగానే ఉలిక్కిపడింది

ఒక్కక్షణం గుండెకొట్టుకోవడంమానేసి తిరిగి రెట్టింపు వేగంతో కొట్టుకోవడం మొదలుపెట్టింది

అమ్మాయ్! నిన్నేదో మభ్యపెట్టి మాయచేసి ఆ పెళ్ళి చెయ్యడం నాకిష్టంలేదు ఈ మావయ్య తియ్యతియ్యగా మాట్లాడి తడిగుడ్డతో నా గొంతుకోశాడు అని నువ్వు నన్ను కసితీరా తిట్టుకునేపరిస్థితి రావడం నాకిష్టంలేధు కాబట్టి

అంటే పొడారిపోయినగొంతుని ఎలాగో పెగల్చుకొని సందేహంగా చూసింది

నా బార్య కాస్త నోటిదురుసుమనిషి ఖర్చు మనిషికూడా ఆ పోలికలే నా ఎల్లలు నలుగురికీ వచ్చాయి కాబట్టి నువ్వు వాళ్ళ మాటలు ఎంతమాత్రం సీరియస్‌గా తీసుకోకూడదు పెళ్ళి అయ్యాక నీతో పాటు మా అబ్బాయికూడా ఈ ఊరువచ్చేసే ఏర్పాటుచేస్తాను తల్లిని బెదిరించి డబ్బు కాజేస్తూ స్నేహితుల ప్రోద్బలంతో వాడు ఏవేవో ఎచ్చివేషాలు వేస్తున్నట్లు ఈమధ్యనే నేను

# కళాకారుల కర్తవ్యం




కళ కళకోసమే అని దానికి వృత్తి లక్ష్యం కాదనీ కొందరు చెప్తూ ఉంటారు కవి తన రచన చూచుకొని తృప్తి పడవచ్చును గాయకుడు పాడుకొని ఆనందించ వచ్చును నటుడు తన నాట్యానికి ముగ్ధుడు కావచ్చు శిల్పి తన శిల్పాన్ని చూచి ఆనందించవచ్చు అయినా వారు కోరక పోయినా వారి కళా నైపుణ్యాన్ని మెచ్చుకొని ఆ ప్రజలంతా ఎంతో ఆనందాన్ని పొందుతారు కళాకారులను మెచ్చుకుంటారు కోరక పోయినా సత్కరించి బహుమానాలను అందజేస్తారు ఈ విషయం అందరికీ తెలుసు

కళలను పోషించే ప్రభువులు శ్రీమంతులును కళా కారుల సుఖ జీవనానికి తగిన సౌకర్యాలు కలిగించే కాలం పోయింది కళాకారుల స్వశక్తి వల్లనే జీవించ వలసిన పరిస్థితి ఏర్పడింది అందువల్ల గిరాకీ లేని కళలు క్షీణదశను పొంది సామాన్య మానవులను ఆకర్షించే కళలకు ప్రాధాన్యం ఎక్కువయింది

వెనుకటి కాలంలో విద్యా సంస్థలకూ కళా క్షేత్రాలకు విద్యా పోషణ కళాపోషణ ధ్యేయంగా ఉండేది వ్యాపార దృష్టి ఉండేది కాదు అందువల్లనే అవి ఉత్తములైన విద్వాంసులనూ కళాకారులనూ తయారు చేయగలిగాయి ఇప్పుడు విద్యాలయాలు వ్యాపార సంస్థలుగా మారినట్లే కళారంగాలు కూడా దన సంపాదననే ముఖ్యంగా భావిస్తున్నవి శ్రీమంతులు కళాకారులకు అధికంగా దనం యిచ్చి వారు తాము చెప్పినట్లు నడుచుకొనేటట్లు చేస్తున్నారు కళాకారుల ఇష్టా యిష్టాలను బట్టి ప్రదర్శనలు ఉండడం చాలా అరుదు ప్రజా సమూహాన్ని ఆకర్షించే విదంగా ప్రదర్శనలిస్తూ దనం సంపాదించడమే పెట్టుబడి దారుల లక్ష్యం అగుట వల్ల కళకు ఉండవలసిన విలువ తగ్గిపోతున్నది సభ్యతా సభ్యతలతో వారికి నిమిత్తం లేదు

కళాకారులు దనం సంపాదించ వలసినదే! కాని తమ కళను పెంపొందించుకొని గౌరవాన్ని సంపాదించుటకు యత్నించ వలసినదే కాని వ్యాపారస్థుల చేతులలో కీలు బొమ్మలు కాకూడదు సభ్యతాసభ్యతలను గమనించాలి దనసంపాదనే ప్రదానంగా తలచ కూడదు అట్టి ఆలోచన ఉన్నపుడు కళ క్షీణ దశకు వచ్చి కొంత కాలానికి నామరూపాలు లేకుండా అంతరించ వచ్చును వెనుకటి రోజుల్లో ఎంతో ఖ్యాతి గడించిన నాటకకళ క్షీణించి పోవుటకు కారణం దనసంపాదన దృష్టితో కళాకారులారంగాన్ని విడిచి పెట్టి చలన చిత్ర రంగంలో ప్రవేశించడమే అని అందరూ గ్రహించ గలరు

కళాకారులు కళారాదనను ప్రదానంగా గ్రహించి నప్పుడే ఏ కళ అయినా పదికాలాల పాటు ఉంటుంది

-బులుసు వేంకటరమణయ్య

గ్రహించాను ఆ పరిసరాలకి దూరంగా వుంచితే వాడు మళ్ళీ మామూలుగా మంచిమనిషిగా మారుతాడనే నమ్మకం నాకుంది తండ్రిగా వాడిని మార్చాలని నేను చేసిన ప్రయత్నాలన్నీ విఫలమయ్యాయి తల్లి సపోర్టు వాడికి వుండడంవల్ల అందుకే మీరిద్దరూ ఇక్కడ విడిగా కాపురంపెట్టేందుకు ఏర్పాట్లు చేసానని నేనంటున్నాను అమ్మా మాలతీ! నువ్వు నీమంచితనంతో అనురాగంతో తెలివితేటలతో వాడిని మళ్ళీ మామూలు మనిషిని చెయ్యగలవనే నమ్మకం నాలో కొడిగట్టిన ఆశకి జీవంపోసింది

ఒక తండ్రిగా ఇది నా ఆరాటం ఆవేదనేతప్ప యిందుకోసమే నేను మీకు సహాయంచేస్తున్నానని అనుకోవద్దు మీనాన్న చాలా అభిమాని ఇన్నాళ్ళు స్వతంత్రంగా జీవించాడు ఇప్పుడు ఒకరి మోచేతినీళ్ళు తాగాలంటే వాడు మానసికంగా ఎంత చిత్రహింస అనుభవిస్తాడో నేను అర్థంచేసుకోగలను నువ్వు అంగీకరించకపోయినా నేను చెయ్యాలనుకున్న పని నేను చెయ్యకమానను

నన్ను కాస్త ఆలోచించుకోనివ్వండి మావయ్యా

అలాగే తప్పకుండా ఆలోచించుకొమ్మా నువ్వింకా చిన్నపిల్లవి బొత్తిగా జ్ఞానం తెలియనిదానివీకాదు పూర్వాపరాలు చర్చించుకుని బాగా ఆలోచించుకుంటావనే దాపరికంలేకుండా అన్ని విషయాలు వివరంగా చెప్పాను నువ్వు బాగా ఆలోచించుకుని ఏ విషయం నాకు చెప్తే మీ నాన్నతో నేనే మాట్లాడతాను నీకిష్టంలేదూ అంటే ఈ విషయం మన ఇద్దరిలోనే సమాధి అయిపోతుంది మీ నాన్నకి తెలియ ...పనిలేదు

థాంక్స్ మావయ్యా ... ఫలితం మీ ఆశల్ని భగ్నంచేసేదిగా ఉంటేమాత్రం నన్ను మన... క్షమించమని ముందే విన్నవించు కుంటున్నాను మావయ్యా

ఎచ్చిదానా! ఆ ... నా బిడ్డల్లో ఒక బిడ ...

(ఇంకావుంది)

## వ్యక్తిగతం



కర్నాటక ముఖ్య మంత్రి శ్రీ రామకృష్ణ హెగ్డే రాజకీయ రంగంలోనే గాక ఇతర రంగాలలో కూడా ప్రవీణుణ్నే నని రుజువు చేసుకుంటున్నారు. కర్నాటక శాసన సభ్యుల వినోత్సవంలో జరిగిన విచిత్ర వేషధారణ పోటీలో ప్రథమ బహుమతి గెలుచుకున్న షేక్ రషీద్ అహ్మద్ అల్ రియాజ్ ఆయనే! సర్పి నుంచి వచ్చిన షేక్‌గా ఆయన అరబ్ సాంప్రదాయక దుస్తుల్లో సరిగ్గా సరిపోయారు. అదే ఆయనకి మొదటి బహుమతి రావడానికి కారణం.... □



ప్రఖ్యాత కన్నడ కవి శ్రీ గోపాల కృష్ణ అడిగ విదేశీ కవిత్వ బహుమతులేవీ ఇంత వరకు వరించక పోయినా ఆయన నోబెల్ సాహిత్య బహుమతికి అర్హుడని చాలామంది ప్రముఖ కవులు భావిస్తారు. భారతీయ కవిత్వంలో చాలా అరుదుగా ఉండే శైలి, స్పష్టత ఆయన కవిత్వంలో ఉన్నాయని వారంటారు. ఈ విశ్లేషణకు తగినటుగానే దేశంలో కెల్లా ఉన్నతమైన బహుమతిని ఆయన గెలుచుకున్నారు. మధ్యప్రదేశ్ ప్రభుత్వం స్థాపించిన ప్రతిష్ఠాత్మకమైన కబీర్ సన్మాన్ బహుమతి ఈ సంవత్సరం ఆయనకు లభించింది. బహుమతిని అందుకోవడానికి ఆయన స్వయంగా హాజరు కాలేదు..... □



ప్రతి వాళ్ళూ అవిఘ్నమస్తు అని గణపతి పూజ చేసి పనులు మొదలు పెడితే కలకత్తా శిల్పి శ్రీ గొస్తా కుమార్ గణపతిని నిర్మించడం దగ్గరే ఆగిపోయారు. ఆయన గత పదిహేను సంవత్సరాలుగా గణపతి విగ్రహాలే నిర్మిస్తూ వస్తున్నారు. కంచు, పాలరాయి, ప్లాస్టర్ ఆఫ్ పారిస్, గాజు ఉపయోగించి నిర్మించిన ఈ విగ్రహాలలో గణపతి నాట్య భంగిమలో ధ్యానముద్రలో ఉన్నాడు. ఈ విగ్రహాలను నిర్మించడంలో వ్యక్తిగత ఆనందాన్ని అనుభవిస్తున్నానని చెప్పుకునే శ్రీ గొస్తా కుమార్ మిత్రుల బలవంతం మీద మొదటి సారిగా ఎనిమిది రోజుల పాటు తన శిల్పాలను కలకత్తాలో ప్రదర్శించారు. ఈ ప్రదర్శనకు విస్తృతమైన ఆదరణ లభించింది. ఒక చీరల దుకాణంలో బట్టల డిజైనర్‌గా ఉన్న శ్రీ గొస్తా కుమార్ ఈ ప్రదర్శనతో ప్రసిద్ధులయారు. □

# వారఫలం

### 22-5-1987 శుక్రవారం మొదలు 28-5-1987 గురువారం వరకు

★ **మేషం** వ్యాపారరీత్యా అనుకూలం బాగా వ్యాపారం చేయవచ్చు చిత్రరంగ వ్యాపారాన అంతరాయమున్నది రచయితలకు పత్రికా సంస్థలందు పని చేయువారికి గాయకులకు పుస్తక విక్రేతలకు అనుకూల వారం స్త్రీలకు ఉద్యోగమందు పెంపు విందు వినోదాలతో కాలక్షేపం శుభ వార్తా శ్రవణం

★ **వృషభం** గురు శని గ్రహాలు మిమ్మాశీర్వదిస్తారు పదిమందిలో మీరు ఒకరుగా గణనకెక్కుతారు ఇంటా బయటా పేరు తెచ్చుకొంటారు రాజకీయ నాయకుల సాంగత్యం ఏర్పడుతుంది విద్యా విషయంగా పెంపు చేకూరుతుంది స్త్రీలకు అన్ని విధాలా అనుకూలం అప్రయత్నంగా ధనాదాయం విద్యావేత్తల పరిచయం

★ **మిధునం** అనుకూల మిత్రులు చేరుతారు ఆదాయం వ్యాపారరీత్యా సంభవం నూతన వ్యాపారం చేయాలని భాగస్తులను చేర్చుకోవాలని ఎల్ను తీయాలని కొందరు ఉబలాటపడతారు ఇది సమయం గాదు గ్రహించాలి స్త్రీలకు కొందరి వివాహ యత్నాలు ఫలిస్తాయి

★ **కర్కాటకం** దూరబారాలకు పోగల అవకాశం చాల మందికి చెప్పవచ్చు వ్యవహారరీత్యా అనుకూల సమయం అనవసరంగా యితరులచే మాట పడే అవకాశమున్నది గ్రహించండి గాయనీ గాయకులకు వారాంతాన సదవకాశాలు స్త్రీలకు వృత్తియందు వికాసం ఆదాయమందు వృద్ధి

★ **సింహం** ఉద్యోగ వృత్తులందు మేలైన సమయం అనుకూల వార్తా శ్రవణం ఆదాయంలో ఎలాంటి లోపంలేదు తెల్ల రంగుకు సంబంధించిన వస్తు వ్యాపారమయితే ఈ వారం బాగా పుంజుకొంటారు వ్యవహారాలుంటే పరిష్కరింపబడవు స్త్రీలకు నూతనోత్సాహం ఉద్యోగమందు పెంపు దూర ప్రయాణాలకైసన్నాహం

★ **కన్య** అనుకున్న వ్యవహారాలు అలాగే జరుగుతాయి అది ఆనందదాయకమేగా' చిత్ర రంగావకాశాలు కొందరకున్నాయి గ్రహించి చేపట్టండి లాభం పొందండి పేరు తెచ్చుకోండి స్త్రీలకు రాజకీయంగా మేలుగాదు వస్తు సేకరణకు అనుకూలం గాదు ఆదాయమందు వృద్ధి చెప్పనవసరం లేదు

★ **తుల** ఎవరితో సాంగత్యం చేయాలో తెలియక వెనుక ముందులాడుతారు రాజకీయ మార్పుల వలన మీ మనోరథం ఈడేరదు ఉత్సాహంతో ఒకానొక వ్యవహారం సానుకూలం చేసకొంటారు స్త్రీలకు వృత్తియందు వికాసం ఉద్యోగంలో ఒక మెట్టు ఎక్కవైన సమయం

★ **వృశ్చికం** ఇప్పట్లో మీరు అనుకొన్న వ్యవహారం సానుకూల మవుతుందని ఆశింప వీలులేదు ఏదో మన కార్యం చేశామని పొంగిపోవటమేగాని అది ఏమాత్రం కలిసి రాలేదని గ్రహించాలి స్త్రీలకు ముఖ్య బంధువులు యింటికి రాగలరు గ్రహించండి

★ **దనుస్సు** నూతనోత్సాహత నూతన మిత్ర సాంగత్యం నూతన వ్యాపారానుకూలం ఎంతో కాలంగా యత్నించిన స్థలాన్ని సానుకూలం కావటం గమనింపదగిన అంశం అనుకొన్న శుభం దూరానికి వాయిదా వేయవలసిన స్థితి స్త్రీలకు వృత్తియందు పెంపు ఉద్యోగానుకూలం ప్రయాణాల వలన మేలు సాధ్యం

★ **మకరం** ముఖ్య బంధువులను కలసికుంటారు కొందరకు రాజకీయంగా మేలు చేకూరుట నిశ్చయం శని ఏకాదశ స్థానాన స్థితియుండుట చేత మీ స్థితిని పెంపు చేయగలపరిస్థితి ఏర్పడుతుంది నూతన వస్తు సేకరణకు అవకాశం స్త్రీలకు అధికారుల ఆదరణ అనుకూల వార్తా శ్రవణం

★ **కుంభం** మంచికో చెడకో కొందరు మిత్రులు చేరనున్నారు వ్యవహారరీత్యా అనుకూలమే అయినా కృషి చేయక తప్పదు వృత్తియందు చెప్పదగిన రాణింపు మాటకు మన్నన చేకూరుట అనుకొనని రీతిని ఆదాయం గమనించగలరు స్త్రీలకు ధన లబ్ధి ఆనందం సుఖశాంతులు

★ **మీనం** అనుకూలంగా అన్ని కార్యాలు జరగటం వార గ్రహ విశేషం గురు రాహు బుధ గ్రహాలు మీకు అనుకూలించగలవు కళా సాహితీ రంగాన మీ కృషి ఫలిస్తుంది చాలామందికి సినీ రంగావకాశా లుండగలవు అలాంటప్పుడు కృషి చేయాలిగా' విద్యా విషయంగా పెంపుగల వారం స్త్రీలకు దూర ప్రయాణాలు సుఖానందం

– విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

# ఉత్తరం వచ్చింది

## మల్లంగి గోపీకృష్ణ

"టంగు..టంగు' మంటూ పాతకాలంనాటి గడియారం పదకొండు గంటలు కొట్టింది

అన్నపూర్ణమ్మ మరోసారి బయటకువచ్చి వీధి చివరివరకూ ఆశగా చూసింది

"ఊహు .!" ఎక్కడా పోస్ట్‌మేన్ వస్తున్న జాడల్లేవు!

తనకు తెలియకుండానే ఆమె కళ్ళల్లో పలుచటి కన్నీటిపొర కదలాడింది చిన్నగా నిట్టూరుస్తూ లోనికెళ్ళిపోయింది

బయట వరండాలోని వాలుకుర్చీలో కూర్చొని పేపరు చూస్తున్న రంగనాథం మేష్టారు మనసులో ఆలోచనలు మేఘాలై ముసురుకొంటున్నాయి

అరగంట నుంచి చూస్తున్నా ఒక్క వార్తకూడా మనసు కెక్కడంలేదు విసుగ్గా పేపరును మడిచి ప్రక్కన పడేశాడు

అప్పుడే వీధి మలుపు తిరుగుతూ కనిపించాడు పోస్ట్‌మేన్!

రంగనాథంగారు నిర్నిమేషంగా అలాగే చూడసాగారు

అప్పుడే బయటకువచ్చిన అన్నపూర్ణమ్మ కళ్ళు దూరంగా వస్తున్న పోస్ట్‌మేన్‌ను చూడగానే వింతకాంతితో మెరిశాయి

అతను అక్కడక్కడా ఆగి ఉత్తరాలిస్తూ వస్తున్నాడు పోస్ట్‌మెన్ దగ్గర పడేకొద్దీ పరీక్షా పత్రాన్ని అందుకోబోయే విద్యార్థిలా అన్నపూర్ణమ్మ గుండె అదుర్దాగా కొట్టుకోసాగింది

రంగనాథంగారి ఇల్లు దగ్గరపడగానే 'సారీ మాష్టారూ ..ఈ రోజు కూడా ఉత్తర మేమీ రాలేదు" అంటూ జాలితో కూడిన చిరునవ్వును విసిరేసి సైకిలు త్రొక్కుకుంటూ వెళ్ళిపోయాడు ఒకప్పటి రంగనాథం శిష్యుడైన ఆ పోస్ట్‌మేన్

రోజూ వినే సమాధానమే అయినా హృదయాన్ని ఎవరో ముల్లుతో పొడిచినట్లయ్యింది అన్నపూర్ణమ్మకు

ఎందుకో ఆమెకు పోస్ట్‌మేన్ తమ ఇల్లు దాటకముందు ఆప్తబంధువులా, ఇల్లు దాటిన తరువాత ఆగర్భ శత్రువులా అనిపిస్తాడు.

నెమ్మదిగా తలతిప్పి రంగనాథంగారి కేసి చూసింది

పోస్ట్‌మేన్ రాకముందు తనెంతగా ఆతృతపడుతుందో, పోస్ట్‌మేన్ వచ్చిపోయాక ఆయనంత క్రుంగిపోతాడు ఆయన కళ్ళల్లో కదలాడే నిరాశా నీలిమేఘాలు ఆమె దృష్టి నెప్పుడూ దాటిపోలేదు

అరవై ఏళ్ళవయసు తెచ్చిన గాంభీర్యం ఆరు నెలల ఆవేదన మూలంగా కరిగిపోతోంది రోజు గడిచి రోజు వచ్చేసరికి వృద్ధాప్యం కన్నా వేదన ఆయనను మరింతగా లొంగదీసుకొంటోంది.

'నే నలా లైబ్రరీదాకా వెళ్ళొస్తాను తలుపులు కాస్త దగ్గరకేసుకో" అంటూ చెప్పులేసుకొని బయల్దేరారు రంగనాథంగారు. మండుటెండను సైతం లెక్కచేయక మనశ్శాంతి కోసం వెళుతున్న ఆయనను చూస్తుంటే అన్నపూర్ణమ్మ మనసు బాధగా నిట్టూర్చింది ఉస్సూరుమంటూ వంట చేయడానికి ఉపక్రమించింది

మార్పు అన్నది కాలానికున్న ముఖ్యలక్షణమైతే, ఆ కాలం వారిముందు ఓడిపోయింది యాంత్రికంగా కదిలిపోయేకాలం వేదనను ఎక్కువచేసేందుకు మాత్రమే ఉపయోగపడింది

* * * * * *

వరండాలో కూర్చొని బియ్యం బాగు చేసుకొంటున్న అన్నపూర్ణమ్మ తల ఎత్తకుండానే కళ్ళ చివర నుంచి రంగనాథంగారికేసి చూసింది

వాలుకుర్చీలో కూర్చొని భగవద్గీతను గుండెల మీదుంచుకొని అందులో లీనమైపోయారాయన

పాతికేళ్ళు ఆయనతో కలిసి కాపురంచేసిన ఆమె ఆ గీతా పఠనం వెనుక దాగిన గుండెను అర్థం చేసుకోగలదు వేదన వెల్లువై మనశ్శాంతి కరువైనప్పుడు మాత్రమే ఆయన భగవద్గీత నాశ్రయిస్తారు

పోస్ట్‌మేన్ వెళ్ళిపోయి అప్పుడే అరగంట గడిచిపోయింది మామూలుగానే ఈ రోజు కూడా ఉత్తరమేమీ రాలేదు

చెలియలి కట్టను దాటబోతున్న దుఃఖాన్ని ఆపుకొనేందుకు ఆయన చేస్తున్న ప్రయత్నాన్ని చూడగానే ఆమె మనసు కరిగిపోసాగింది

భగవద్గీతను ముందర పెట్టుకొన్న రంగనాథం గారికి అక్షరాలు అస్పష్టమై.. పరిసరాలు అదృశ్యమై. ప్రతీ పేజీలోనూ తన ఒక్కగా నొక్క కొడుకు సుందరరామమూర్తి మొహమే కనిపించ సాగింది ఇంత వేదనను కలిగిస్తున్న ఉత్తరాన్ని తలుచుకోగానే ఆయన ఆలోచనలు గతంలోకి జారిపోయాయి

* * * * * * *

దాదాపు పాతిక సంవత్సరాల క్రితం

ఇటు పల్లెగా ఎదగలేక, అటు పట్నంగా ఎదగలేక మధ్యస్థంగా ఉండిపోయిందా వూరు

చేతోత ట్రంకు పెట్టి పట్టుకుని, నెలలు నిండిన భార్యతో ఆ వూళ్ళోకి అడుగుపెట్టాడు రంగనాథం. ఆ వూళ్ళో కొత్తగా ప్రారంభించిన ఎలిమెంట్రీ స్కూల్లో ఆయనను టీచరుగా నియమించారు అక్కడకు వచ్చాక కానీ ఆయనకు అసలు పరిస్థితి అర్థంకాలేదు స్కూలు పెట్టడానికి ఓ పశువుల పాకైనా యిమ్మని ప్రాధేయపడాల్సి వచ్చింది

మొదట్లో స్కూలుకు అసలు ఎవరూ వచ్చేవారు కాదు.

'ఈ చదువులు చదివి వాడు ఎవర్ని ఉద్ధరించాలి మాస్టారూ? ఏదో ఇంట్లో అన్నా ఉంటే కాస్త చేతికంది సహాయంగా అన్నా ఉంటాడు' అంటూ పిల్లల్ని స్కూలుకు ఎవరూ పంపేవారు కాదు

కాని రంగనాథం పట్టు విడవకుండా ప్రతి యింటికీ వెళ్ళి స్కూలుకు పిల్లల్ని పంపమని నచ్చ చెప్పేవారు ఆయన కృషి ఫలితంగా ఓ నలుగురు విద్యార్థులతో ఆ స్కూలు ప్రారంభమైంది. మెల్లమెల్లగా ఆ స్కూలులో చేరేవారి సంఖ్య పెరగసాగింది

సెలయేరులా ప్రారంభమయిన ఆ స్కూలు నెమ్మదిగా నదిలా రూపొందింది. చెరగని చిరునవ్వుతో అందరిని ఆప్యాయంగా పలకరించే రంగనాథంగారంటే అందరిలో ఏదో తెలియని అభిమానం ఏర్పడిపోయింది.

"మా పిల్లవాడికి నాలుగు అక్షరం ముక్కలు నేర్పించారు, ఈ అరటిగెలుంచండి మాస్టారూ".

"మీ దయవల్ల మా వాడికి పట్నంలో పై చదువులకి అవకాశంవచ్చింది మీరు ఈ సంవత్సరం బియ్యం కొనకండి. మా పొలం నుంచి ఓ రెండు బస్తాలు తెచ్చి ఇంట్లో పడేస్తాను"

వాళ్ళ మాటలు వింటూంటే రంగనాథంగారి మనసు ఆనందంతో పొంగిపోయేది. అభిమానంతో నిండిపోయేది.

ఆ వూరికొచ్చిన కొద్ది రోజులకే అన్నపూర్ణమ్మకు ఓ కొడుకు పుట్టాడు. వాళ్ళ తాత పేరు కలిసొచ్చేలా వాడికి సుందరరామ్మూర్తి అని పేరు పెట్టుకొన్నారు రంగనాథం రామ్మూర్తి అంటే ఇద్దరికీ బహిఃప్రాణంలా వుండేది. వాడికి ఏ చిన్న దెబ్బ తగిలినా తమకే తగిలినంతగా బాధపడిపోయేవాళ్ళు

రామ్మూర్తిది చిన్నప్పటి నుంచీ అదో రకమైన మనస్తత్వం. తన యీడువాళ్ళతో ఎవరితోనూ కలిసేవాడు కాదు. స్నేహితులతో కన్నా

పుస్తకాలతో నే మంచి స్నేహం కుదిరిందతనికి

స్కూలుతో ఎప్పుడు ఫస్టు వస్తుండే తన కొడుకును చూస్తుంటే రంగనాథంగారికి గర్వంగా ఉండేది

హైస్కూలులో చదువుకుగాను ప్రక్కనున్న పట్నానికి పంపించేందుకు నిశ్చయించుకున్నారు కానీ ఆ నిర్ణయం తీసుకొనేటప్పుడు ఆయన మనసు మూగగా ఏడ్చింది రెండు రోజులపాటు ఆ ఇంట్లో ఎవరూ సరిగ్గాభోంచేయలేదు

చివరకు గుండెను రాయిచేసుకొని అన్నిరకాల జాగ్రత్తలు చెప్పి తమ ఊరి పిల్లలతో కలిసివుండేలాగున ఏర్పాటు చేసివచ్చారు

మొదట్లో ఏదో కోల్పోయినట్లు ఇద్దరూ బాధపడేవారు కానీ క్రమంగా దానికి అలవాటుపడిపోయారు వారానికి రెండుసార్లు వచ్చే ఉత్తరాలే వారిని ఓదార్చేవి ఏ కారణంచేతనయినా ఉత్తరం రావడం ఆలస్యమయినా లేక రాకపోయినా వెంటనే రంగనాదంగారు పట్నానికి పయనమయ్యేవారు

శెలవులలో రామ్మూర్తి ఇంటికి వచ్చినప్పుడు పోయిన కళ అంతా తిరిగి వచ్చినట్లనిపించేది ఉన్నన్నిరోజులూ పండగలాగా గడిచిపోయేవి

రోజులు దొర్లిపోతున్నాయి పది కేలండర్లు తిరిగిపోయాయి

రామ్మూర్తి డిగ్రీ ఫస్టుక్లాసులో పాసయ్యాడు

ఉద్యోగాన్వేషణలో వున్న రామ్మూర్తి నుంచి ఒమారు హఠాత్తుగా ఉత్తరం ఒదులు టెలిగ్రామ్ వచ్చింది

నేను పెళ్ళి చేసుకుంటున్నాను. వచ్చి ఆశీర్వదించవలసింది' అని'

నాలుగయిదు సార్లు చదివాకగాని విషయం అర్థంగాలేదు అర్థమయ్యాక ఆయనకు కాళ్ళు చేతులు ఆడలేదు మరో నాలుగు గంటలలో భార్యతో కలిసి పట్నంలోని కళ్యాణమండపంలోకి అడుగుపెట్టిన ఆయనకు నూతన దంపతులు పెళ్ళి బట్టలతో ఎదురొచ్చి నమస్కరించారు

"కులం కాని అమ్మాయిని చేసుకొంటే కాదంటారని అలా చేశాను మీ మనసు బాధపెట్టుంటే నన్ను క్షమించి ఆశీర్వదించండి "

కొడుకు మాటలు విన్న రంగనాధానికి నిజంగానే బాధేసింది . వేరే కులమమ్మాయిని పెళ్ళి చేసుకొంటున్నాడనికాదు ' పాతికేళ్ళుగా ప్రేమతో పెంచిన తల్లి దండ్రుల్ని అర్థం చేసుకోలేనందుకు ప్రేమించి చేసుకొనే పెళ్ళిని అంగీకరించి ఆశీర్వదించగల హృదయం తమకుందని గుర్తించనందుకు'

ఆర్తితో దొర్లిన కన్నీటిబొట్లే అక్షింతలై ఆ జంటను ఆశీర్వదించాయి

కొడుకు-కోడలు కళ్ళముందుంటే చాలు అన్న వాళ్ళ ఒక్క ఆశకూడా త్వరలోనే ఆవిరైపోయింది

రామ్మూర్తికి రూర్కేలాలోని ఓ ప్రైవేట్ ఫర్మ్‌లో ఉద్యోగం వచ్చింది మంచి ఉద్యోగం, వదులుకొంటే మళ్ళీరాదు అంటూ జాయినైపోయాడు

కాస్త ఆలస్యమైనా పర్లేదు-కాస్త దగ్గర్లో ఉద్యోగం చూసుకోరాదూ" అభ్యర్థన లాంటి రంగనాథంగారి కోరికను పాతకాలం బుద్ధులంటూ కోడలు కొట్టిపడేసింది

రైల్లో ప్రయాణమైపోతున్న వారికి వీడ్కోలు నిచ్చేందుకు వెళ్ళిన అన్నపూర్ణమ్మ కంట నీరు నిలువలేదు రంగనాథంగారికి పెద్దరికం అడ్డుపడటంతో అశృవులన్నీ కనుకొలకులలోనే ఇంకిపోయాయి తన హృదయాన్ని ఎవరో తననుంచి దూరంచేసి తీసుకెళ్ళినట్లయ్యిందాయనకు

ఒరేయ్' నిన్ను కని పెంచి ప్రేమతో పెద్దచేసిన రెండు ముసలి ప్రాణాల మూగబాధ నువ్వెందుకు అర్థంచేసుకోలేవురా మేం బ్రతికుండేదాకా నయినా మా ఎదురుగా వుంటే మాకు కాస్త మనశ్శాంతిగా నయినా వుంటుంది మా మాట వినరా" అని కొడుకుకు గట్టిగా అరిచి



చెప్పాలనుకున్నాడు . కానీ కొడుకు ప్రయోజకుడైతే చాలన్న తండ్రి మనస్సు ఆయనలోని భావసంచలనాన్ని అణిచివేసింది.

తరువాత వాళ్ళు ఒకటి రెండుసార్లు కొడుకు దగ్గరికెళ్ళివచ్చారు కోడలి సూటిపోటి మాటలు అక్కడ వారిని ఎక్కువరోజులు నిలువనిచ్చేవికావు

రామ్మూర్తి భార్యతో కలిసి సొంతవూరికి వచ్చినా నాలుగయిదురోజులకన్నా ఎక్కువ వుండేవాడుకాదు తనకు సెలవు లేదనో, కోడలికి ఈ వాతావరణం సరిపోవడంలేదనో వెంటనే వెళ్ళిపొయ్యేవాడు

రానురానూ ఆ రాకపోకలు కూడా కరువయ్యాయి రామ్మూర్తి ఏవి మరిచిపోయినా తన చిన్ననాటి అలవాటును మాత్రం మరిచిపోలేదు. ఎన్ని పనులున్నా ప్రతీవారం తప్పకుండా ఒక్క ఉత్తరమన్నా వ్రాసేవాడు.

ఆ ఉత్తరం నలిగిపోయేదాకా చదువుకోవడంలోనూ . తర్వాత మళ్ళీ రాబోయే ఉత్తరం కోసం ఎదురుచూడడంలోనూ వారికి సంతృప్తి, స్వాంతన లభించేవి ఏ వారమైనా ఉత్తరం రాకపోతే వాళ్ళ మనస్సు విలవిలలాడిపోయేది రామ్మూర్తికి ఏ మయిందో నన్న ఆవేదన వారిని నిద్రాహారాలకు దూరంచేసేది

అలాంటిది ఈమధ్య ఉత్తరాలు రావడం బాగా తగ్గిపోయింది నెలకొక ఉత్తరం రావడమే కష్టమైపోతోంది

మొదట్లో వాళ్ళకు అర్థమయ్యేదికాదు కానీ ఈమధ్యనే మెల్లమెల్లగా అర్థం కాసాగింది.. .ఉత్తరాలు వ్రాయకపోడానికి కారణం వాడికి తీరిక లేకపోవడం కాదని . దానికి అసలు కారణం నిర్లక్ష్యమేనని ..!

ఆ నిర్లక్ష్యమే యిప్పుడు వాళ్ళ మనసుల్ని నిప్పై కాలుస్తోంది

ఒక చిన్న ఉత్తరం కోసం.. ఆ ఉత్తరం మోసుకొచ్చే అక్షరాలలోని కాసింత ఆప్యాయతకోసం

# ఉత్తరం వచ్చింది

ఆ ముసలి హృదయాలు రెండూ తపించి పోతున్నాయి

* * * * * * *

ఆలోచనా ప్రపంచంలోంచి బయటపడి భారమైన హృదయంతో భార్యవైపు చూశాడు

అందాకా చేస్తున్న పనిని మరిచిపోయి వరండాలో గోడకు తగిలించిఉన్న ఫోటోవైపే చూస్తూ ఆలోచిస్తూ ఉందామె

ఆ ఫోటోలో రామ్మూర్తి తమిద్దరి మధ్యనా నిలబడి ఉన్నాడు. అది రామ్మూర్తిని హైస్కూలులో చేర్పేందుకు పట్నానికి తీసుకెళ్ళినప్పుడు తీసుకొన్నది ఫోటోగ్రాఫరు ఎంత నవ్వమని చెప్పినా

తమిద్దరి మొహంలోనూ బాధ కనిపిస్తూనే ఉంది రామ్మూర్తిని అక్కడ వదిలి వచ్చేటప్పుడు అన్నపూర్ణ ఎంతగా ఏడ్చిందో ఆయనకింకా బాగా గుర్తుంది. కానీ తనే మనసును గట్టి పరుచుకొని అన్నపూర్ణకు నచ్చచెప్పి ఎలాగో తీసుకొచ్చాడు

వాడి దగ్గరి నుంచి ఉత్తరం వచ్చేంత వరకూ ఆమె మామూలు మనిషి కాలేకపోయింది.

అంత పిచ్చిగా వాడిని ప్రేమించినందుకు వాడు తమకిచ్చిన ప్రతిఫల మేమిటి? ప్రతిఫలాన్నాశించే వాడిని తాము ప్రేమించారా.. .??

కానీ ప్రేమకు ప్రతిఫలంగా ప్రేమను కోరడంలో తప్పులేదుగా ... !!

ఆయన ఆలోచనలు ఆయన అదుపు తప్పిపోతున్నాయి

తను గమనిస్తూనే ఉన్నాడు అన్నపూర్ణ ఈ ఆరునెలల్లో బాగాచిక్కిపోయింది. వార్ధక్యం అంతా ఒక్కసారిగా మీదపడ్డట్లు క్రుంగిపోతోంది. లోపలికి పోయిన కళ్ళచుట్టూ నల్లటి వలయాలు రోజు రోజుకు పెరుగుతున్నాయి. ఈ మధ్య భోజనం కూడా సరిగ్గా చెయ్యడం లేదు ఆకలిలేదంటూ మంచినీళ్ళు త్రాగి పడుకొంటోంది తన జీవితంలో ఒక ముఖ్యభాగమైన . కాదు.. జీవితమే ఐన ఆమె వేదనను చూస్తుంటే ఆయన మనసు బాధతో విలవిలలాడిపోతోంది

"ఇంతటి దుఃఖాన్ని ఆమె చిన్న గుండె ఎన్నాళ్లనిమోయగలదు ...? ఆ ఆలోచన రాగానే అతని శరీరం భయంతో ఒక్కసారిగా వణికింది.

'ఊహు.. అలా జరగడానికి వీల్లేదు. అలా జరగడానికి వీల్లేదు" తనలో తానే గొణుక్కొన్నాడు.

మరి ఆమె దుఃఖాన్ని తనెలా దూరం చేయగలడు . ??

ఆ ప్రశ్నకు సమాధానం రెండు రోజులుపాటు ఎడతెగకుండా ఆలోచించిన తరువాత దొరికింది

* * * *

నాలుగు రోజులు ఏ విశేషము లేకుండానే గడిచి పోయాయి.

ఆ రోజుకూడా మామూలుగానే తెల్లవారింది

రంగనాథం వరండాలో న్యూస్ పేపర్‌ను కళ్లముందుంచుకుని కూర్చున్నాడు అతని కళ్ళు మాత్రం రాబోయే పోస్ట్‌మాన్ కోసమే ఎదురు చూస్తున్నాయి

ఎందుకో ఆ రోజు అన్నపూర్ణమ్మ కూడా హడావిడిగానే కనిపిస్తోంది

ఎన్నడూలేనిది "ఏమండీ ఉత్తరమేమైనా వచ్చిందా?" అంటూ ఇప్పటికే నాలుగుసార్లడిగింది మామూలుగా అయితే మనసులో ఉత్తరం కోసం ఎంత ఎదురు చూస్తున్నా పైకి మాత్రం ఏమీ పట్టించుకోని దానిలా కనబడేందుకు ప్రయత్నిస్తుండేది.

ఆమె ఆతృతను చూసి రంగనాథం తనలో తానే చిన్నగా నవ్వుకొన్నాడు. కానీ ఆ నవ్వు వెనక అతని హృదయం తీసుకొన్న ఒక నిర్ణయం కదలాడుతోంది.

"ఎందుకో ఈ రోజు ఉత్తరం తప్పకుండా వస్తుందని నాకు నమ్మకంగా ఉంది పూర్ణా" అన్నాడు వీధివైపు చూస్తూ.

అన్నపూర్ణమ్మ మొహంలో ఆశ్చర్యం ఓ క్షణంపాటు కదిలి మాయమైంది

"నాకూ అలాగే అనిపిస్తుంది" అంటూ లోనికి వంట పనిమీద వెళ్ళింది. రంగనాథం మళ్ళీ పేపర్ వైపు దృష్టి మరల్చాడు

"సార్.. ! పోస్ట్"

" . . ... ... "

ఉత్తరం కోసం ఎప్పుడూ ఎదురు చూస్తుండే వాళ్ళు ఈరోజు ఉత్తరం వచ్చిందన్నా తీసుకోడానికి రాకపోయేసరికి పోస్ట్‌మేన్‌కు ఎక్కడలేని ఆశ్చర్యంవేసింది.

"సార్. మీకు మీ అబ్బాయిదగ్గరనుంచి ఉత్తర మొచ్చిందిసార్!" అన్నాడు మరింత గట్టిగా.

రంగనాథం కదల్లేదు.

"పూర్ణా ....! నీకు మీ అబ్బాయిదగ్గరనుంచి ఉత్తరం వచ్చినట్లుంది కాస్త చూడూ......"

## గడుసులోకం —బాబు







అన్నాడు పేపర్‌లోంచి తల బయిటకు పెట్టకుండానే

'నాకా ? అదేదో మీకే వ్రాసివుంటాడు ఎంతయినా మీ ముద్దులకొడుకుకదా అంటూ తడిచేతులు చీరకొంగుకి తుడుచుకొంటూ వచ్చి నిలబడింది

లేదమ్మా, ఈరోజు మీ యిద్దరికీ అబ్బాయివగ్గిరనుంచి రెండు ఉత్తరాలు వచ్చాయి అంటూ ఉత్తరాల నందించాడు

"ఇద్దరికీనా ? వాళ్ళిద్దరి గొంతులూ ఒకేసారి ఆశ్చర్యంతో ప్రశ్నించాయి

ఉత్తరాల్ని అందుకొని చించి చదవబోతున్న వాళ్ళ కళ్ళల్లో ఆనందాశ్రువులు మెరుస్తున్నాయి. వణుకుతున్న చేతులతో ఉత్తరం మడతలు విప్పుతూన్న రంగనాదాన్ని ఆనందంతో పాటూ అయోమయం కూడా చుట్టుముట్టింది

తను ప్రాణంకన్నా ఎక్కువగా ప్రేమించే అన్నపూర్ణ ఆవేదనను తాత్కాలికంగా నయినా దూరం చేయాలని తను ఆత్మవంచన చేసుకొనైనా ఆమె కన్నీటిని కాస్తయినా తుడవాలని రామ్మూర్తి ఆమెకు ఉత్తరం వ్రాసనట్లు తనే వ్రాసి ప్రక్కవూరినుంచి పోస్ట్‌చేయించాడు ఆమెను మభ్యపెట్టి మోసం చేస్తున్నానేమో అన్న ఆలోచన కలిగినా, అన్నపూర్ణ మీద ప్రేమ ఆ ఆలోచనను తుడిచివేసింది మరి ఇప్పుడు

తనకూ ఉత్తరం వచ్చిందంటే రామ్మూర్తి నిజంగానే ఉత్తరం వ్రాశాడన్నమాట ఇన్నాళ్ళకయినా వాడికి తాము గుర్తుకు వచ్చినందుకు ఆయనకు చెప్పలేని సంతోషమేసింది

పూజ్యులైన నాన్నగారికి,

క్షేమం ఇంత ఆలస్యంగా ఉత్తరం వ్రాస్తున్నందుకు నన్ను మన్నించండి అత్యవసరమైన ఆఫీసు పనులవలన

రంగనాథంగారి కళ్ళు ఉత్తరం వెంబడి పరిగెడుతూన్నా, ఆయన మనసు సంబోదన దగ్గిరే నిలిచిపోయింది

"పూజ్యులైన నాన్నగారికి '

"పూజ్యులైన నా "ఉత్తరాన్ని మరోమారు చూశాడు

సందేహంలేదు

అతని హృదయాకాశంలోని మబ్బులన్ని మెల్లగా చెదిరిపోతున్నాయి అన్నాళ్ళూ తెలియని నిజం కోటిసూర్యుళ్ళ కాంతితో ప్రకాశిస్తూ కనిపిస్తోంది

'పూజ్యులైన" అన్న సంబోధన రామ్మూర్తి ఎన్నడూ వాడేవాడుకాదు అసలు వాడి కెపుడూ అలా వ్రాసే అలవాటేలేదు ఇక ఆ ఉత్తరంలోని అక్షరాలు ఆయనకు పాతికేళ్ళుగా చిరపరిచితాలు

నిద్రలోంచి లేపి అడిగినా ఆయన వాటిని సులభంగా గుర్తుపట్టగలడు

ఆ సంభోధన అన్నపూర్ణది ఆ అక్షరాలు అన్నపూర్ణవి వాటివెనుక దాగిన ఆర్ద్రహృదయం అన్నపూర్ణది!

ఆయనకు నవ్వాలనిపించింది

పిచ్చిగా పగలబడి నవ్వాలనిపించింది ఇంత సంతోషాన్ని మోస్తున్న గుండె పగిలిపోయేదాకా నవ్వాలనిపించింది ఎదుటనే ఒయాసిస్సునుంచుకొని, ఎండమావుల వెంబడి పరిగెత్తిన తన పిచ్చితనానికి నవ్వాలనిపించింది కాంతి ప్రవాహమై పొంగే ప్రేమను గుర్తించకుండా, గుడ్డివాడిలా మిణుగురు పురుగులకోసం వెతికిన తన అమాయకత్వానికి, అజ్ఞానానికి తనే జాలిపడి నవ్వాలనిపించింది అలా నవ్వుతూనే నీళ్ళు నిండిన కళ్ళతో ఎదురుగావున్న అన్నపూర్ణమ్మ వైపు చూశాడు

ఆమె మొహంలో కనబడుతూన్న జావాల్ని చూడగానే అనిపించింది తనే ఆమెకు ఉత్తరం వ్రాసినట్లు తెలిసిపోయిందని!

ఇద్దరికీ నోట నుండి మాట రావటంలేదు

ఒకరికళ్ళలోకి ఒకరు అలాగే చూస్తుండిపోయారు

పాతికేళ్ళుగా కలిసి కాపురం చేస్తున్నా ఒకరి నొకరు ఎందుకు సరిగ్గా అర్ధంచేసుకోలేకపోయారో వారికే తెలియడంలేదు

కలిసిన ఆ కళ్ళనుంచి ప్రేమ గంగాతరంగాల్లా ప్రవహిస్తోంది ఆ చూపుల్లో ఆప్యాయతవుంది అక్షరాల కందని ఆత్మీయతవుంది మాటల్లో చెప్పలేని మమకారం వుంది

అన్నిటినీ మించిన ఓదార్పు దాగుంది

తనకోసం ఇంతగా తపించిపోయే వ్యక్తి తన ఎదురుగానే వున్నారన్న నిజం వాళ్ళిద్దరినీ ఉక్కిరిబిక్కిరి చేస్తోంది అందని ప్రేమకోసం అర్రులుచాచి తమ మద్యన పెరుగుతున్న ప్రేమలతను నిర్లక్ష్యం చేసిన తమ అవివేకానికి ఆశ్చర్యమేస్తోంది ఈ వయసులో తమకు కావలిసింది కాసంత ఆప్యాయత మరి కాస్త ఆత్మీయత!

ఇక ప్రేమంటే

ఒంటరి మనసును ఓదార్చి సేదతీర్చేది '

కష్టసుఖాలను కలిసి పంచుకొనేది "

ఆ ఆత్మీయతను, ప్రేమను, ఆప్యాయతను అందించేందుకు కన్నకొడుకయినా కట్టుకున్న వాళ్ళయినా వేరెవ్వరయినాఒక్కటే

"మనిషెవ్వరయినా కావలిసింది వారి మనసు అందించే ప్రేమ మాత్రమే!"

ఆ భావన వాళ్ళలో కలగగానే పాతికేళ్ళ తమ వైవాహికజీవితాన్ని, అందించిన సుఖదుఃఖాల్ని అన్నిటినీ మరిచిపోయి,అప్పుడే పెళ్ళయిన కొత్తదంపతుల్లా మనసువిప్పి మాటల్లో మునిగిపోయారు

* * * * * *

ప్రతీరోజూ ఉత్తరం కోసం వడిగాపులు కాచేవాళ్ళు, ఇప్పుడు తను వాళ్ళ ఇల్లు దాటిపోతున్నా ఎందుకు పట్టించుకోవడంలేదో పోస్ట్‌మేన్‌కు కొంచెం కూడా అర్ధంకాలేదు

బహుశా ఎప్పటికీ అర్ధంకాదేమోకూడా " □

# పాఠకుల శీర్షిక

# చిన్నారి బాలల దీనగాథలు

## తల్లులు బాధ్యతను విస్మరించగూడదు

సాయంత్రం 5 గం లకు కూరలు కొంటుంటే ఎదురింట్లో క్రొత్తగా దిగినావిడ ఆఫీసు నుంచి వస్తూ కనిపించింది ఆటో దిగిందో లేదో కాళ్ళకు చుట్టేసుకొని ఏడుస్తున్నారు ఆవిడ పిల్లలు 10 నెలల పాప 3 ఏళ్ళ పాపాను తల్లి కోసం అలమటించి పోతూ తల్లిని చుట్టేసుకొంటున్న వాళ్ళని చూస్తే జాలి ముంచు కొచ్చింది

నేడు మన సమాజంలో తల్లి వుండి తల్లి పెంపకాన్ని కోల్పోయిన దీనావస్థలో వున్న పిల్లలు ఎంతోమంది వున్నారు 3వ నెలకల్లా వుద్యోగంలో చేరాలని నెల తిరిగేసరికి పాలని మాన్పించేవారు ఇంట్లో ఎవరూ చూసేవారు లేక వేరే వూళ్ళో వున్న పుట్టింట్లోనో అత్తింట్లోనో దింపేసేవారు లేదా వూళ్ళోనే వున్న అమ్మ ఒడి అనబడే బేబీ సెంటర్లలోనో దింపేసేవారు ఎంతోమంది తల్లులు వున్నారు అవసరం వున్నా లేకపోయినా వుద్యోగం పేరుతో 2 3 నెలలు కూడా నిండని పసివారిని ఆ(?) ఈ గుడ్డుకు ఏం తెలుస్తుంది' ఎవరు పెంచితే వాళ్ళదగ్గరే వుంటారని ఆఫీసులకు యూమ్మని వెళ్ళిపోతున్నారు కాని 9 నెలలు తల్లి కడుపులో వుండి పుట్టిన తర్వాత 2 నెలలు తల్లి ప్రక్కన పడుకొన్న పసివాళ్ళు తల్లి స్పర్శను గుర్తించలేరు'

చిన్నతనంలో ఇతరులకు అప్పచెప్పబడ్డ ఈ పసి పిల్లలు తరచు అనారోగ్యం పాలవుతారు అటువంటి వారిని తల్లి లాగ ఓపిగ్గా పెంచుతున్నవారు ఎంతకని చూడగలరు' వాళ్ళ కసుర్లు తిట్లు తింటూ ఆ తల్లి ఎప్పుడు వస్తుందా అని దీనంగా ఎదురుచూస్తుంటారీ పిల్లలు ఇంక స్కూలు కెళ్ళే పాపలు 3 గం కల్లా యింటికొచ్చి తల్లి దండ్రులు ఎప్పుడు వస్తార అని ఎదురు చూస్తూ బిక్కు బిక్కు మంటూ వుంటారింట్లో బాధ్యత విస్మరించిన కొంతరు తల్లులు వాళ్ళ తీరిక వేళల్లో కూడా పిల్లలను చేరదీయరు సగం అలవాటులేక సగం బద్ధకం వలననూ పసిపిల్లలకు వాళ్ళు ఎంతచేసినా ఎంతపెట్టినా తల్లి తమని చేరదీయాలని గుర్తించాలని తమ దగ్గరే అనుక్షణం వుండాలని తల్లి ప్రేమ లాలనని ఆశిస్తారు కాని వుద్యోగం చేసే ప్రతి తల్లి మొగ్గలోనే పిల్లల ఈ ఆశల్ని త్రుంచేస్తుంది తల్లుల్లారా మీ బిడ్డలని ఇంకొకళ్ళకి అప్పజెప్పే ముందు వాళ్ళ మానసిక స్థితిని కొంచెం అర్థం చేసుకొనేందుకు ప్రయత్నించండి ఉద్యోగం ముఖ్యమో పిల్లల ఆలనాపాలనా ముఖ్యమో తేల్చుకోండి

-ఇ రేవతి,

న్యూబాకారం, హైదరాబాద్




* * *

## కఠినంగా శిక్షించాలి

పసిపిల్లలు దైవ స్వరూపులంటారు కానీ నేడు ఎంతోమంది పిల్లలు విరిసీ విరియని మొగ్గల్లా తల్లితండ్రుల చాటు బిడ్డల్లా, ఆడుతూ పాడుతూ ప్రపంచమంటే ఏమిటో తెలియని పసి కందుల్లా వుండటం లేదు

చాలామంది పిల్లలు బాల శ్రామికులు గా మారి అనేక బాధలకు లోనవుతున్నారు నేడు మన దేశంలో 44 మిలియన్ల బాల శ్రామికులున్నారు ఈ బాల శ్రామికులు మన దేశంలోనే కాదు విదేశాలలో కూడా, ముఖ్యంగా దక్షిణ ఆఫ్రికాలో చిన్న చిన్న పిల్లలను బాల శ్రామికులుగా మార్చి బానిసల కంటే హీనంగా చూస్తున్నారు

1938లో బాల శ్రామిక రద్దు చట్టం 1986లో బాల శ్రామిక క్రమబద్ధ శాసనం ఇంకా జాతీయ బాల శ్రామిక కార్యక్రమం, వెట్టి చాకిరీ విముక్తి గ్రామీణ ఋణ విముక్తి వంటి శాసనాలెన్నో ప్రవేశపెట్టినా ప్రయోజనం కనిపించడంలేదు ప్రభుత్వం ఎన్ని శాసనాలూ చట్టాలూ ప్రవేశపెట్టినా అవి కాగితం వరకే పరిమితమవుతున్నాయి 'యూనిసెఫ్' కూడా వీరి కొరకు ఎంతో కృషి చేస్తున్నా ఫలితం వుండటంలేదు

బాలలపై జరుగుతున్న ఈ దారుణాలకు కారణాలు 1 వీరి తల్లితండ్రుల ఆర్థిక పరిస్థితి 2 నిరక్షరాస్యత 3 అధిక సంతానం

మనదేశంలో (శివకాశి) బాణసంచా అగ్గిపెట్టెల తయారీకి కొన్ని చిన్న కుటీర పరిశ్రమలలో అగరువత్తుల తయారీకి ఫిరోజాబాద్‌లో గ్లాసుల తయారీకి పలకల పని కార్పెట్ల పని, ఇళ్ల నిర్మాణాల పని, రైల్వేలలో రేవులలో గనులలో పిల్లలనే నియమిస్తున్నారు వీరి తల్లితండ్రులు ఆర్థికంగా వెనుకబడి వుండటం వలన తమ పిల్లల పొట్ట గడవడం కోసం పిల్లలనే పనులకు పంపుతున్నారు ఈ పిల్లలకు దొరికే కూలి కూడా చాలా తక్కువ శ్రమమాత్రం ఎక్కువ కాబట్టి వీరిలా కావడానికి వీళ్ల తల్లితండ్రుల



ఆర్థిక పరిస్థితి కారణం అవుతోంది

తల్లితండ్రుల నిరక్షరాస్యత వలన కూడా బాలలు శ్రామికులుగా మారుతున్నారు తల్లితండ్రులు నిరక్షరాస్యులు కావడం వలన భగవంతుడిచ్చే పిల్లలను వంపరాదని తలచి ఆపరేషన్లు చేయించుకోక ఎక్కువమంది పిల్లలను కని వాళ్లను పోషించే ఆర్థిక స్తోమత లేక తమతో పాటు వ్యవసాయ పనుల్లోనో ఇంటి నిర్మాణాల పనుల్లోనో తీసుకు పోతుంటారు అందు వలన అధిక సంతానం కూడా పిల్లలు బాల శ్రామికులుగా మారడానికి కారణమవుతోంది

కొంతమంది అమ్మాయిలు అది తప్పో ఒప్పో తెలియని వయసులో చేసే పనులకు పెళ్లి కాకుండా పిల్లలను కని గత్యంతరం లేక వాళ్లను అనాథ శరణాలయాలలో ఇచ్చేస్తుంటారు ఇక్కడ తల్లితండ్రుల అండదండలు, భయభక్తులూ లేక స్వేచ్ఛగా

బ్రతుకుతూ తమ జీవితాన్ని తమ ఇష్టానుసారం చేసుకుంటారు వీళ్ళు యజమానుల దెబ్బలకు, నిందలకు బలవుతుంటారు ఎంత వెట్టి చాకిరీ చేసినా యజమానులు చావబాదుతూ వుండటంతో వీళ్ళల్లో ప్రతీకార జ్వాలలు జనించి 'గాంధీ' కావలసిన వాళ్ళు 'గాడ్సే'లు గా మారుతున్నారు చిన్నప్పటి నుండి ఛీత్కారాలకు, దెబ్బలకు అలవాటైపోయి జేబు దొంగలుగా, బందిపోట్లుగా నక్సలైట్లుగా టెర్రరిస్టులుగా గూండాలుగా మారుతున్నారు

అందువలన తల్లితండ్రులకు విద్యా బోధన సదుపాయాలు కల్పించితే వారికి వెట్టి చాకిరీ బాల శ్రామికత్వం గురించి తెలిసే అవకాశం వుంటుంది పనికి తగ్గ కూలినిచ్చి బాంకుల ద్వారా ఋణాల




ఇప్పిస్తే వారి ఆర్థిక పరిస్థితి కూడా మెరుగుపడి తమ పిల్లలను విద్యా వంతులను చేయగల్గుతారు వారు అక్షరాస్యులైతే అధిక సంతానం గురించి వివరించిన వారు అర్థం చేసుకొనగల్గుతారు

బాలలను పనికి పెట్టుకొనేవాళ్ళకు, అందుకు సహకరించే వారి తల్లి తండ్రులు లేదా సంరక్షకులకు ప్రభుత్వం జరిమాన విధిస్తోంది కాని వీరిని ఇంకా కఠినంగా శిక్షించాలి బాల శ్రామికులకు ప్రభుత్వం ఉచిత విద్యను ప్రసాదించాలి పరీక్ష ఫీజులలో మినహాయింపు, స్కూళ్ళల్లో సీట్లకు రిజర్వేషన్లు ఏర్పాటు చేసిన యీ బాలలు విద్య నభ్యసించి తాము చేసే పనులకు స్వస్తి చెప్పడానికి సిద్ధపడతారు తద్వారా బాల శ్రామికత్వాన్ని అరికట్టవచ్చు

అనాధ శరణాలయంవారు రాక్షసుల్లా ప్రవర్తిస్తూ గొడ్డు చాకిరీ చేయిస్తే ఆ పిల్లలు చివరకు కిరాతకులుగా దుర్మార్గులుగా మారుతున్నారు కొందరు తమ బాధలను మరవడం కోసం మత్తు మందులకు అలవాటు పడుతున్నారు అందువలన ఆ పిల్లలకు వృత్తి విద్యలు, పెయిటింగ్ నృత్యం, సంగీతం విద్య వారి కిష్టమైన వాటిని నేర్పించాలి అప్పుడు వేళ్ళతో సహా పాతుకుపోయిన యీ సమస్యను కొంతైనా అరికట్టవచ్చును

- షాహీన్, అక్కయ్యపాలెం, విశాఖపట్నం

* * *



# మానవత్వం, నైతిక విలువలు పెరగాలి!

మనిషి జీవితం తెల్లకాగితం వంటిది ప్రతి అక్షరం ఒకో నిమిషం కాని పిల్లల జీవితం పెద్దల వ్రాతల్లో ఉంది వికసించే పువ్వుగా వెలిగే దివ్వెగా కళకళలాడుతూ భవిష్యత్తులో ఏ గాంధీగానో, ఏ జగదీష్ చంద్రబోసుగానో మరియే ఇతర ప్రముఖ వ్యక్తిగానో రూపొందవలసిన పిల్లలు అతి దారుణంగాను అమానుషంగాను, తల్లిదండ్రులు, సంరక్షకులు యజమానులు అనబడే పెద్దల చేతులలో నలిగి పోయి శారీరకంగాను, మానసికంగాను దుర్భలులై తమ గమ్యం ఏమిటో తెలియని బ్రతుకు గడుపుతున్నారు

తమ ప్రతిబింబాలుగా, ప్రతిరూపాలుగా చూచుకోవలసిన తల్లిదండ్రులు తమ పిల్లలను దారుణ, మారణ కాండకు గురిచేయుటకు వారి విద్యా విహీనత వలన కలిగే అమాయకత్వం ఆర్థిక ఇబ్బందులు, బాధ్యతా రాహిత్యం త్రాగుడు పేకాట అక్రమ సంబంధాలు ధనార్జన మొదలగు వ్యసనములు కారణములు

గంపెడు పిల్లలను పోషించే ఆర్థిక స్థోమత లేక తమ పిల్లలు సంపాదించే నాలుగు రూపాయల కోసం కొందరైతే తమ స్వసుఖం కోసం వ్యసనాలకోసం పొరుగు వాడికన్న ఒక మెట్టు పైన ఉండాలనే మూర్ఖపు పట్టుదల కోసం పిల్లలకు నచ్చచెప్పో లేక శారీరకంగా హింస పెట్టి గాని వారిని ఫ్యాక్టరీలు, పొలాలు బట్టీలు హోటళ్ళు మరియు ఇతర అత్యంత ప్రమాదకరమైన పనులలో పని చేయిస్తూ బాల కార్మికులుగా తయారు చేస్తున్నారు నిండీ నిండని కడుపుతో, చాలీ చాలని బట్టలతో, తెలిసి తెలియని వయస్సులో చీత్కరింపులను అవమానాలను భరిస్తున్న పసి కందుల శ్రమను, భవిష్యత్తును దోచుకుంటున్న యజమానుల అనాదరణ మూలంగా రోగగ్రస్తులవడం ప్రమాదాల వలన శాశ్వత వికలాంగులవడం లేదా ఆ వయసులోనే నూరేళ్ళు నిండి పోవడం జరుగుతూనే ఉంది కోరికలను అదుపులో ఉంచుకో లేక తప్పుడు పనులు చేయడం, పిల్లలు పసికట్టి చూస్తే ప్రలోభపెట్టి డబ్బు ఆశ చూపించి వాళ్ళను తప్పుడు త్రోవ పట్టించి సంఘ విద్రోహ శక్తులుగా తయారు చేయడం జరుగుచున్నది

కొంతమంది తల్లిదండ్రులు తమకు కోపం వచ్చినప్పుడు ఆ ప్రభావం తమ పిల్లల మీద చూపిస్తూ వాళ్ళని మానసికంగా ఎదగనివ్వరు ఇటువంటి పిల్లలు భయాందోళనలతోను అవమానంతోను అనుమానంతోను మానసికంగా దిగజారి పోతుంటారు డబ్బున్న వాళ్ళలో కొందరు తమ పిల్లలను ఆయాల మీద పనిమనుషుల మీద వదలి వారికి కావలసినప్పుడు అవసరాలకు మించి డబ్బు అందిస్తూ, బాధ్యతా రహితంగా వాళ్ళను పట్టించుకోరు భావి పౌరులను అందించ వలసిన స్త్రీ మూర్తి భవిష్యత్తును చిన్నతనము నందే సమాధి కట్టి వ్యభిచారిణులుగా తయారు చేసి, ధనార్జన చేసుకొంటున్నారు

చిన్నారి బాలలను ఈ దారుణాల నుండి రక్షించాలనే అధికారికంగా ప్రభుత్వం చాల చట్టాలు చేసింది కాని అవి చాలవు పూర్తి రక్షణ, పౌష్టికాహారము, ఉచిత వైద్య సదుపాయము, నిర్బంధ విద్య, హింసకు గురి చేసిన వారిపై కఠిన చర్యలు, భద్రత మొదలైనవి చట్ట పరంగా అమలు జరపాలి ఇలా అయితే నూటికి పదిమంది ఈ దారుణాల నుండి రక్షింపబడతారు మనుష్యులలో మానవత్వం, నైతిక విలువలు పెరుగుట వలన సమాజంలో ఈ దారుణాలు పూర్తిగా సమసి పోతాయి

–బల్ల శ్రీధరి, పుల్లేటికుర్రు, (తూ గో) □

కూపన్

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

చిన్నారి బాలల దీన గాథలు

రచన పంపిన వారి పేరు

పూర్తి చిరునామా

పిన్ కోడ్




### వై ఐ హైదరాబాదు

★ గోళ్ళు తీసి ఇంట్లో వేయకూడదు అంటారు అది మూఢనమ్మకం- సైంటిఫిక్ కారణం ఎవరి నడిగినా సరిగా చెప్పరు

● దీనికో పెద్ద వైజ్ఞానిక శాస్త్రవేత్తను సంప్రదించ నవసరంలేదు చిట్టితల్లీ పాకే పిల్లలు తప్పటడుగులు వేసే పిల్లలు జోళ్ళు లేకుండ నడిచేవారి కాళ్ళలో గుచ్చుకోకుండా ఎయట పారేయడం పసివాళ్ళు తెలియక నోట్లో పెట్టుకుంటే వచ్చే ప్రమాదం వూహించలేరా' అందుకే- చిక్కు జుట్టూ గోళ్ళూలాంటివి పారేయవలసనవి అవతల పారేయమంటారు దీన్లో మూఢనమ్మకం ఎముంది?'

### జి వి ఎమ్ కాకినాడ

★ కొ...ు ఎంతో తెలివి తేటలుండీ పరీక్షలు తప్పుతు వుంటారు దీన్నేమనాలి?

● పరీ...క్ష కావలసిన తెలివి- వేరు దానివల్ల తంవాత ఉపయోగం శూన్యం విషయగ్రహణ తెలివి దాన్ని వినియోగించ కల్గడం విజ్ఞానం అవి రెండూ స్వంతంగా పరిశ్రమించి ఎకరించాలి

### సి హెచ్ ఎన్ ఆర్ సత్తెనపల్లి

★ దీపావళికి బాణ సంచ కోసం ఖర్చు పెట్టే దనంపై మీ అభిప్రాయం?

● మరీ దారుణంగా పోటీపడి వందలూ వేలూ తగలెట్టే వారంటే- నా కిష్టం వుండదు ఎదో- సరదాకి ఎల్లలకిదీ - మన సంప్రదాయం అని చెప్పడానికి కొంచెం కాలిస్తే నష్టం ఏమిటి?

★ నరసరావుపేటలోని హేతువాద సంఘ అధ్యక్షులు కొద్దికాలం క్రిందట చనిపోయారు వారి చితికి వారి భార్య నిప్పుపెట్టింది ఒక అభ్యుదయ హేతువాది భార్య అయిన మీరు పై చర్యను సమర్థిస్తారా' లేక ఖండిస్తారా?

● ఎవరి నమ్మకాలు వారివి- అని నమ్మే మనిషిని నేను మహాకవి శరీరం విశాఖ ఆస్పత్రి స్వీకరించ లేదు గోరాగారు నమ్మినదాన్ని వారి కుటుంబం నెరవేర్చలేదు అంచేత నాకిలాంటి విషయాల్లో- మా నాన్నగారి నమ్మకమే- చనిపోయాక- ఎవరు నిప్పంటిస్తేనేం! అయినా నాదొక్క కోరిక- ఎలక్ట్రికల్ క్రిమిటోరియమ్‌కి సాగించాలి- అని అందుకే మైలాపూరుపైడు వెళ్ళినప్పుడల్లా- అది పని చేస్తూందీ అని ఓసారి చూస్తూంటాను' కర్మ నెలకి ముప్పయి రోజులది- అవుటాఫ్ ఆర్డర్? అదీ నా బెంగ

### జి ఎస్ బి బెంగుళూరు

★ నన్ను అర్థం చేసుకొనే వ్యక్తి దొరికేవరకు నేను పెళ్ళి చేసుకో దల్చుకోలేదు నాకు మంచి ఉద్యోగం వుంది నా కాళ్ళపై నేను నిలబడగలను కానీ అప్పుడప్పుడు ఈ సమాజంలో మనుషులు చేసే విమర్శలకు తట్టుకోగలనో లేదో అని భయం వేస్తుంది

● అదే కూడదు పిరికితనం పరాజయానికి తొలిమెట్టు ఎవరో ఎందుకు? కుటుంబంలోని వాళ్ళే కావలసినంత విమర్శిస్తారు కాస్త వెనుకంజవేస్తే అంతే- అంతా నెత్తిన మొత్తే వాళ్ళే మీ ఉద్యోగం చూసి- అదే జీవితాంతం వచ్చే పీసమీల్ కట్నంగా భావించి పెళ్ళికి సిద్ధపడే- వరులు కూడా వుండకపోరు మిమ్మల్ని మీ ఉద్యోగాన్నేకాదు మీ సంపాదనని సహితం కష్టించి ఆర్జించినదిగా భావించి గౌరవించే వ్యక్తి మీకు దొరకాల అప్పటిదాకా ఆగడంలో తప్పులేదు ఆడపిల్లలు- జీవిత ధ్యేయం పెళ్ళే అనుకోడం మానాలి అదే ఒక పెద్ద ముందడుగు ఆర్థికంగా ఎవరిపైనా ఆధారపడకుండా వుండడానికి తర్ఫీదు నొందాలి అది కొండంత ధైర్యం యిస్తుంది భార్యని మనిషిగా గౌరవించని వ్యక్తి కోసం డబ్బు కూడపోసి బానిసత్వం కొనుక్కోవడం శుద్ధ అవివేకం ఐ లైక్ యువర్ గట్స్ అలాగే వుండండి

### ఎం డి ఎస్ ఇరువరం

★ అమ్మా నాన్న డబ్బుగల అమ్మాయిని పెళ్ళి చేసుకోమంటున్నారు నాకు సంస్కారం కల పేదయింటి అమ్మాయిని చేసుకోవాలని వుంది మీ అభిప్రాయం?

● నీ పెళ్ళికి నా అభిప్రాయం దేనికయ్యా? డబ్బున్న పిల్లకి సంస్కారం వుండదని ఎవరు చెప్పారు? పేదింటి పిల్లకి సంస్కారం వుండి తీరాల నెక్కడవుంది?'

### కె కె ఆర్ కోటబొమ్మాళి

★ నేను ప్రేమించిన అమ్మాయి అందకత్తె చదువుకూడా వుంది నన్ను ప్రేమించింది కాని వాళ్ళు ఊరునుంచి మారి పోయిన తరువాత నన్ను మర్చిపోయింది దీనికి కారణం ఏమిటి అక్కా?

● అది - అదే మీ యిద్దరి మధ్యన ఉ..నేది ప్రేమకాదని అర్థం తమ్ముడూ అయినా అమ్మాయి చూసి నవ్వినంత మాత్రాన- ప్రేమించేసిందనుకునే అమాయకులా- యీనాటి కుర్రకారు- ఇన్ని నవలలు చదువుతూ ఇన్ని సినిమాలు చూస్తూ- ఎన్నో రకాల ఆడపిల్లలని ఏడిపించడం నేర్చుకుని కూడా- మీరింత అమాయకంగా వున్నారంటే నమ్మలేకుండా వున్నాను'

### జి వి హైదరాబాదు

★ మనుషులు చిన్న విషయాలు కూడా అర్థం చేసుకోలేరు ఎందుకు రామలక్ష్మిగారూ?

● ఎందు కేమిటయ్యా- లోకజ్ఞానం అందరికీ ఉండవలసినది చాలా కొద్ది మందికే వుండేది ఎవరూఅది తమకు లేదు అనుకోనిది అందుకే అర్థం చేసుకోరు-

### డి ఎస్ కె కోవూరు

★ గర్భస్థ శిశువు చెప్పిన కథలపై మీ ఉద్దేశం ఏమిటంటారు?

● గర్భంలో వుండగానే ఆడదాని వేదనను కఠినమైన యీ సమాజంలో కొందరికైనా కనువిప్పు కల్గేలాగా చెప్పడమే- ఉద్దేశ్యం

### బి వి డి డి అరసవల్లి

★ పెద్ద విషయాలలో నిగ్రహంతో మెలిగే వ్యక్తి స్వల్ప విషయాల్లో తేలికగా బయట పడిపోతా రెందుకు?

● అదే పెద్దవాళ్ల చిన్న బలహీనత' చిన్న విషయాల్లో- తనని పట్టించుకోడంలేదని- ఇగో దెబ్బతిని తెగ బాధపడిపోతారు- చాలామంది పెద్దలు ఇంత చిన్న విషయం- చెప్పేదేమిటని- మనం అనుకోవచ్చు- □






నిర్మాత ఎ.వి.సుబ్బారావు దర్శకత్వం తాతినేని రామారావు

# మార్పు

## ఎం.వి.ఎస్.ఎస్. ప్రసాద్.

తాయారమ్మ మనసు వికలమయి పోయింది ఆ రోజు ఉదయం తన కోడలు అన్న మాటలు అంతకంటే ఎక్కువగా తన కడుపు చించుకు పుట్టిన కొడుకు కోడలికి వంత పాడుతూ అన్న మాటలు శూలాల్లా ఆమె హృదయాన్ని తూట్లు పొడిచేసాయి తన కొడుకు రాంబాబులో అటువంటి మార్పు వస్తుందని ఆమె కలలో కూడా అనుకోలేదు భర్త బతికున్న రోజులలో గుట్టుగా సంసారం చేస్తూ గౌరవంగా బతికేది ఆవిడ ఆమెకి ఏ కోరికలూ ఉండేవి కావు కానీ పసుపు కుంకుమలతో తనువు చాలించాలని అనుకున్న ఆమెకు భగవంతుడు అన్యాయం చేసాడు

ఉదయం సంఘటన తలుచుకుంటూంటే ఆమెకి దుఃఖం ఆగలేదు ఉదయం తొమ్మిది గంటలయినా కోడలు రాజ్యం తాయారమ్మకి కాఫీ ఇవ్వలేదు తాయారమ్మకి నీరసం వచ్చి కళ్ళు తిరిగినట్లని పించింది ఆమె కోడలిని కాఫీ ఇవ్వమని అడిగింది దానికి రాజ్యం అంతెత్తున అత్తగారిపై విరుచుకు పడింది

హం! ఇంట్లో మనుషులు ఉన్నారు ఎందుకు? ఊరికే పడి తినడానికి అన్నిటికి నేనే చావాలి వట్టి గొడ్డుకు అరుపులు మెండు అన్నట్టు ఏమీ ఉపయోగం లేని వాళ్ళకు తిండి పెట్టడానికే సరిపోతోంది ఆయన జీతం నా జీతం కూడా కాఫీ మంచి నీళ్ళ దగ్గర నుంచీ నేనే అందించాలి ఆడపుట్టుక పుట్టాక తోటి ఆడది కష్టపడుతూంటే కనీసం సహాయం చెయ్యాలని కూడా అనిపించదేమో మనుషులకి అయినా మనిషి అయితే కదా!?

తాయారమ్మకి కళ్ళనీళ్ళ పర్యంతం అయింది ఏమీ మాట్లాడలేక పోయింది ఎందుకంటే అంతకు ముందు ఒకసారి కాఫీ కలుపుకు తాగుతూంటే గేదె కుడితి తాగినట్లు తెగ తాగుతారు మనుషులు అయినా తేరగా వస్తుంటే తెగ తింటారని అని కోడలు అన్న మాటలు తాయారమ్మ చెవుల్లో రింగు మంటున్నాయి అసలు చీటికి మాటికి కోడలు అలా మాట్లాడడం మామూలు అయిపోయింది కానీ ఎప్పుడూ కొడుకు దగ్గర ఆ విషయం చెప్పుకోలేదు తన కొడుకు సంపాదన తన తిండికి కూడా ఖర్చు పెట్ట కూడదా అని బాధ పడింది తాయారమ్మ

ఆ రోజు కొడుకు రాంబాబు ఆటు కేసి రావడం చూసిన తాయారమ్మకి ఆశ కలిగింది అతను అంతా వినే ఉంటాడని కోడలిని మందలిస్తాడని కాని ఆ ఆశ అడియాసే అయ్యింది

ఏమిటమ్మా! నువ్వు మరీను మీ కోడలు అన్ని పనులూ చేసుకోలేక చస్తూంటే కాస్త సహాయ పడొచ్చుగా? మనదేమన్నా జమిందారీ కుటుంబమా? అదీకాక అది ఉద్యోగస్తురాలు కదా! అక్కడ వస్తువు ఇక్కడ పెట్టక పోతే ఎలా? అంటూ తల్లి మీద కేకలేసాడు రాంబాబు

అదికాదురా అంటూ తాయారమ్మ ఏదో చెప్పబోయింది కానీ రాంబాబు ఆ మాటలను ఆదిలోనే త్రుంచేసాడు

నువ్వేం చెప్పకే నా కసహ్యం పెద్ద దానివై ఉండి పెద్దరికం నిలుపుకోకపోతే ఎలా? పోనీ కదాని ఇన్నాళ్ళు ఊరుకున్నా ఇక లాభం లేదు నువ్వొకచోట మేమొకచోట ఉండాల్సిందే!

ఏమిటిరా రామం!?? ఏమిటిరా నువ్వనేది!!!??

అంత ఆశ్చర్యపడి పోక్కర లేదు లేవే నీకూ కోడలికి ఒక క్షణం పడనప్పుడు విడిపోవడమే మంచిది

అదేమిటిరా రామం అలా అంటావు? నేనెంత నోరు మూసుకు ఉంటున్నానో ఎలా సర్దుకు పోతున్నానో నీకూ తెలుసు నేనేమన్నా మీకు ఏదైనా ఇబ్బంది కలిగిస్తున్నానా?

అలా అయితే సమస్యే ఉండేది కాదు నీ చాదస్తంతో నీకు సుఖం లేకుండా చేసుకుంటున్నావు మాకు సుఖం లేకుండా చేస్తున్నావు అసలు నాకు నువ్వు తల్లిలా కాకుండా ఒక శత్రువులా ప్రవర్తిస్తున్నావు నన్ను మీ కోడలిని హింసిస్తున్నావు

ఆ తరువాత రాంబాబు మాట్లాడిన మాటలు తాయారమ్మకి వినిపించ లేదు ఆమె తల గిర్రున తిరగసాగింది ఒక్కగా నొక్క కొడుకు సుఖంగానూ సంతోషంగాను ఉండడం తన కిష్టం లేదా? పుట్టినప్పటి నుంచీ కంటికి రెప్పలా కాపాడిన తను వాడిని హింసిస్తోందా? నిలబడే శక్తి లేక నిలుచున్న చోటనే చతికిలబడి పోయింది తాయారమ్మ

ఓ క్షణం ఆగి మళ్ళీ మాట్లాడడం ప్రారంభించాడు రాంబాబు–

అమ్మా! రోజులు మారి పోయాయి ఇక మనం కలిసి ఉండడం అనేది అసంభవం మేము వేరే ఇల్లు చూసుకుంటాం

ఒరేయ్ మీ రెక్కడికీ వెళ్ళొద్దురా మీ తాతగారూ మీ నాన్నగారు మనకు ఇచ్చిన ఆస్తిరా ఈ పెంకుటిల్లు దీనికి నువ్వే వారసుడివి నువ్వు ఇక్కడే ఉండు నేను నేనే ఎక్కడికో పోతానురా

రాంబాబు ఏమీ మాట్లాడకుండా అక్కడ నుంచి వెళ్ళి పోయాడు

ఇన్నాళ్ళకు తన పాచిక పారినందుకు మహా సంతోషం కలిగింది రాజ్యంకి

ఉదయం జరిగిన సంఘటన గుర్తుకు వచ్చిన తాయారమ్మ మనస్సు మొద్దుబారి పోయింది కోడలు పక్కింటి కామాక్షమ్మ గారింటికి వెళ్ళింది కొడుకు ఆఫీసు నుంచి వచ్చే వేళయింది వీధి గుమ్మంలో నే దిగాలుగా నుంచుంది తాయారమ్మ

రాంబాబు ఆఫీసు నుంచి వస్తూనే ఏమిటే? ఇక్కడ నుంచున్నావు? అంటూ ఇంట్లోకి తొంగి చూసి మీ కోడలు ఇంట్లో లేదా? అని అడిగాడు

లేదురా! పావుగంటలో వస్తానని వెళ్ళింది చాలాసేపయింది బహుశా పక్కింటావిడతో కలిసి ఏ బజారుకైనా వెళ్ళిందేమో! అని మళ్ళీ అదికాదురా బాబూ నీ నిర్ణయం అంటూ ఏదో చెప్పబోయింది తాయారమ్మ

ఏమిటమ్మా! నేను చచ్చి ఆఫీసు నుంచి వస్తే మళ్ళీ గొడవ మొదలా?

నేను చెప్పేది వినుబాబూ! నా మాట "

అబ్బా!!! ఈ వెధవ గొడవలు ఉండేవే గాని నా మొహాన కాస్త కాఫీ తగలెయ్ అంటూ తల్లిని కసురు కున్నాడు రాంబాబు అంతలో పక్కవాళ్ళబ్బాయి వచ్చి రాజ్యం పెద్ద బజారుకి వెళ్ళిందని ఇంకో గంటలో వస్తుందని చెప్పాడు తాయారమ్మ కాఫీ కలుపడానికి వంటింట్లోకి వెళ్ళింది రాంబాబు ఆమెని అనుసరించాడు

★ ★ ★ ★ ★ ★

రైలు వేగంగా పరిగెడుతోంది రాంబాబు రాజ్యం ఐదవనెల వచ్చిన వారి పసిబాబు కూచుని ఉన్నారు రాజ్యం మొహం దిగాలుగా ఉంది ఆమె హృదయం పశ్చాత్తాపంతో దహించుకు పోతోంది పసివాడు కిటికీ లోంచి బయటకు చూస్తూ తాను చూసిన సుందర దృశ్యాలను గూర్చి తన తల్లికి ఏదో చెప్పాలని మూగ భాషలో ప్రయత్నిస్తున్నాడు రాంబాబు మౌనంగా కూచుని ఉన్నాడు అతని మనస్సులో ఆలోచనలు ఈగలలా ముసురు తున్నాయి

హుం! మనిషి మనస్తత్వం ఎచిత్రంగా ఉంటుంది కొంత మంది తనకి తోచిందేగాని ఇతరులు ఎంత చెప్పినా వినరు తన భార్య ఆ కోవకు చెందిందే తను పెద్దవాళ్ళ పట్ల తమ బాధ్యత గురించి పెద్దవాళ్ళనే వాళ్ళు ఇంట్లో ఉంటే ఎంత ధైర్యంగా నిర్భయంగా ఉంటుందో భార్యకు ఎంత చెప్పినా వినలేదు చివరికి ప్రత్యక్షంగా రాజ్యం తెలుసుకోవాలని తను నాటకం ఆడాల్సి వచ్చింది కొంత కాలం ఆ నాటకం తల్లికి కూడా తెలీక ఆవిడ చాలా బాధ పడింది ఆవిడను మరునాడు తన

...రామ ఇంటికి పంపిస్తాననగా అంతా వివరించి చెప్పి తనని క్షమించమని అడిగాడు ఆ రోజు తన భార్య రాజ్యం పక్కింటావిడతో బజారుకి వెళ్ళడం వలన తల్లికి తన నాటకం గురించి చెప్పే వీలు కలిగింది అసలు విషయం ఇప్పటికి కూడా రాజ్యంకి చెప్పలేదు ఎలాగయితేనేం రాజ్యం తన తప్పు తెలుసుకుంది ఇంటికి పెద్ద దిక్కు విలువ ఏమిటో బాగా తెలియ వచ్చింది తనంత తానే అత్త గారు ఎక్కడ ఉన్నారని అడిగి ఆవిడని తీసుకు రావడానికి బయలుదేరే వరకూ ఊరుకోలేదు ఎటువంటి

పెట్టుకుంటు నన్ను క్షమించండత్తయ్యా నా మాటలు ప్రవర్తన తలుచుకుంటే సిగ్గేస్తోంది అంది

పిచ్చి పిల్లా! బాధపడకు లేలే! అంటూ తన కోడలిని గుండెలకి హత్తుకుంది తాయారమ్మ

అత్తయ్యా వెంటనే బయలు దేరండి మీ బట్టలు ఎక్కడున్నాయో చెప్పండి నేను సర్దేస్తాను ఈ లోపల మీ మనుమడితో ఆడుకుంటూ ఉండండి

కంగారెందుకమ్మా?





మనిషిలో ఎంత మార్పు! మనస్సులో నవ్వుకున్నాడు రాంబాబు అంతలో స్నేహను వచ్చింది

కొడుకుని కోడలిని మనుమడిని చూసి తాయారమ్మ సంతోషంతో తలమునక లయింది రాజ్యం అత్తగారి కాళ్ళమీద పడి కళ్ళమ్మట నీళ్ళు

అలా కాదు మీరు ఒక్క క్షణం కూడా మాకు దూరంగా ఉండడానికి వీలులేదు లాభం లేదంటే మనం ఈ రోజే బయలు దేరుతున్నాం!

సరే నీ ఇష్టం! పద ఇద్దరం కలిసే వెళ్దాం అంటూ లోపలికి నడిచింది తాయారమ్మ

పెళ్ళయ్యాక తన కొడుకులో పెద్ద మార్పు వచ్చిందనుకున్న తాయారమ్మకి అది కాకపోగా తన కోడలిలో మంచి మార్పు రావడం చాలా సంతోషం కలిగించింది! ఇంట్లోకి నడుస్తూ తృప్తిగా నిట్టూర్చిందామె □

## కాశ్మీర్‌లో గీతా ఆర్ట్స్ 12వ చిత్రం

మే 1 నుంచి 15 వరకు కాశ్మీర్‌లో నాలుగు పాటలు చిత్రీకరిస్తాం దీంతో దాదాపు షూటింగ్ పూర్తయిపోయినట్లే అన్నారు ఎ కోదండరామి రెడ్డి ఈయన స్క్రీన్‌ప్లే దర్శకత్వంలో అల్లు రామలింగయ్య సమర్పించే గీతా ఆర్ట్స్‌వారి 12వ చిత్రంలో చిరంజీవి విజయశాంతి జగ్గయ్య అల్లు రామలింగయ్య కన్నడ ప్రభాకర్ రఘువరన్ రాజ్యలక్ష్మి మమత బేబీ సుజాత వగైరా తారాగణం జంధ్యాల మాటలు చక్రవర్తి సంగీతం లోక్‌సింగ్ ఛాయ తార నృత్యాలు బి చలం శిల్పం బాబూరావు నిర్వహణ వెళ్ల స్వామి కూర్పుతో అల్లు అరవింద్ నిర్మాత

## కులాల కురుక్షేత్రం చిత్రానికి శరత్ దర్శకత్వం

సర్వమత సామరస్యాన్ని సమానత్వాన్ని సౌభ్రాతృత్వాన్ని చాటి చెప్పే యితివృత్తం టైటిల్ సాంగ్‌ను శ్రీశ్రీ గణపతి సచ్చిదానంద స్వామీజీ రాశారు కృష్ణాజిల్లా బట్లపెనుమర్రు తోట్లవల్లూరు విజయవాడ పరిసరాలలో ఒకే షెడ్యూల్‌లో షూటింగ్ పూర్తవుతుంది అన్నారు వల్లభనేని లక్ష్మీదాసు ఈయన నిర్మించే శ్రీ దత్త సచ్చిదానంద ఫిలిమ్స్‌వారి పై చిత్రంలో నరేష్ హీరో ఎం వి ఎస్ హరనాథరావు మాటలు వేటూరి పాటలు కె వి మహదేవన్ సంగీతం శ్రీకాంత్ ఛాయ బి నాగరాజన్ శిల్పం సాహుల్ సాహసాలు

దొరికితే దొంగలు లో రాధ





"దొంగగారూ స్వాగతం"లో

సినిమా

రాధారెడ్డి సంయుక్త దర్శకత్వం అక్కినేని శ్రీనివాసరావు ప్రొడక్షన్ శివశంకర్ నృత్యాలు డి వెంకటరత్నం కూర్పుతో శరత్ దర్శకుడు

## వి ఎస్ ఆర్ట్ మూవీస్ చిత్రానికి కె రంగారావు దర్శకత్వం

నెరకుట్టి అనే విజయవంతమైన మళయాళం చిత్రం మాతృక అన్నారు దాదాపు పదేళ్ళుగా ఎందరో ప్రముఖ దర్శకులవద్ద సహకార దర్శకుడుగా పనిచేసిన కె రంగారావు ఈయన తొలిసారిగా దర్శకత్వంవహించే చిత్రాన్ని వి ఎస్ ఆర్ట్ మూవీస్ బానర్‌లో వి శ్రీనివాసరావు జి బిక్షపతి నిర్మిస్తారు జీవిత రమ్యకృష్ణ డాక్టర్ రాజశేఖర్ ప్రభృత నటవర్గం తనికెళ్ళ భరణి మాటలు ఆత్రేయ గీతాలు కె బావిరెడ్డి సహకార దర్శకత్వం బాలు ప్రొడక్షన్ రాజ్‌కోటి సంగీతం కార్తీక్- అశోక్ ఛాయ కె బాబూరావు కూర్పుతో ఎస్ దశరథ సమర్పణ హైదరాబాద్‌లో మే 11 నుంచి 20 వరకు మొదటి షెడ్యూల్ రెండో షెడ్యూల్ జూన్ 20 నుంచి జులై 20 వరకు పాటలను ఊటీలో షూట్‌చేస్తాం అని కె రంగారావు తెలిపారు

## పాపం పసిపాప

ఫారెస్ట్ బాక్‌డ్రాప్‌లో థ్రిల్లర్ బేబీ శాలిని ప్రదానపాత్రదారిణి మే 1 నుంచి జూన్ 20 వరకు ఒకే షెడ్యూల్లో షూటింగ్ అన్నారు నటుడు శైలజ ఎక్ప్రెస్ అదినేత బెనర్జీ ఈయన నిర్మించే పై చిత్రానికి ఎం నందకుమార్ దర్శకుడు



విజయశాంతి

# నేషాలు

_జి.వి.జి.



పద్మావతి ఫిలింస్ డివిజన్ ప్రొడక్షన్ నెం 2లో రాధిక



"మాఊరి మగాడు"లో కృష్ణ, శ్రీదేవి

## సినిమా

### కల్యాణ చక్రవర్తి చిత్రానికి రావుశ్రీ దర్శకత్వం

"గ్రామీణ వాతావరణంలో హాస్యప్రధాన చిత్రం సెంటిమెంట్ కూడా ఉంటుంది," అన్నారు నాటక ప్రయోక్త రావుశ్రీ. ఈయన బాపు, కోడి రామకృష్ణ, ఎం. ఎస్. కోటారెడ్డి ప్రభృతుల వద్ద దర్శకత్వ శాఖలో అనుభవం గడించారు. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో ఎస్. హనుమంతరావు నిర్మించే భాగ్యలక్ష్మి ఆర్ట్ ఫిలిమ్స్ చిత్రంలో కల్యాణ చక్రవర్తి హీరో. గొల్లపూడి కథ, జె. వి. రాఘవులు సంగీతం, సురేంద్రనాథ్‌రెడ్డి కూర్పుతో సి. గోపాలరావు నిర్వహణ బాధ్యతలు వహిస్తారు.

### పి. చంద్రశేఖరరెడ్డి దర్శకత్వంలో జయప్రద చిత్రం "రాకీ"

"హీరో రాంకుమార్‌కి ఉజ్వలమైన భవిష్యత్తు ఉంది. ఇతని సోదరి జయప్రదకు హీరో సోదరిగానే హిందీ మాతృక 'రాకీ' లోని రీనారాయ్ పాత్రను మలచాం. అలనాటి హీరోలు రామకృష్ణ, రంగనాథ్ జగ్గయ్య, జైశంకర్ ఈ చిత్రంలో నటించడం ఒక విశేషం. మరో విశేషం– ఈ చిత్రాన్ని సమర్పిస్తున్న జయప్రదతో పాటు ఆమె సోదరులు రాంకుమార్, రాజబాబు, వీరి సోదరి, ఈ చిత్రనిర్మాత సౌందర్య కుమారుడు మాస్టర్ సిద్ధార్థ ఇలా కుటుంబ సభ్యులంతా కలిసి నటిస్తున్నారు. షూటింగ్ దాదాపు ముగిసినట్లే", అన్నారు పి. చంద్రశేఖరరెడ్డి. ఈయన దర్శకత్వం వహించే జయప్రద ఫిలిమ్ సర్క్యూట్ వారి పై చిత్రంలో నూతన్ ప్రసాద్, కోట శ్రీనివాసరావు, మురళీకృష్ణ, కె. ఆర్. విజయ, రమాప్రభ, పద్మ, సుపర్ణ ఇతర పాత్ర ధారులు. గణేష్ పాత్రో సంభాషణలకర్త. ఆర్. డి. బర్మన్ స్వరకల్పనలో ఆత్రేయ, వేటూరి గీతాలు రాశారు. దేవరాజ్ చాయ, పేకేటి రంగ శిల్పం, స్వామి సాహసాలు, ఆర్. బి. కృష్ణ – రాజ్‌కుమార్ ప్రొడక్షన్ డి. రామకృష్ణ సహకార దర్శకత్వం, మన్నె రాధాకృష్ణ సంయుక్త దర్శకత్వం, గౌతంరాజు కూర్పు నిర్వహిస్తున్నారు.

"కథ అడ్డం తిరిగింది"లో చిత్ర, నరేష్, జీవిత, చంద్రమోహన్






35 ఎం. ఎం. టీవీలు వచ్చే వరకు టీవీల వల్ల సినిమా పరిశ్రమకు ఎలాంటి దెబ్బా తగలదని నా అభిప్రాయం!

### కృష్ణతో గోపీ ఫిలిమ్స్ చిత్రం

"నవంబర్ నుంచి వచ్చే జనవరి వరకు షెడ్యూల్స్, అన్నారు ఎ. గోపాలకృష్ణ. ఈయన సమర్పించే గోపీ ఫిలిమ్స్ చిత్రంలో కృష్ణ హీరో. సత్యానంద్ మాటలు, చక్రవర్తి సంగీతం, జాస్తి సత్యశేఖర్ – జాస్తి రమణమూర్తి నిర్వహణతో కోడి రామకృష్ణ దర్శకుడు.

## రాఘవేంద్రరావు దర్శకత్వంలో వెంకటేష్ "భారతంలో అర్జునుడు"

రసవత్తరమైన కథను ఆబాలగోపాలాన్ని ఆకట్టుకునేలా ఎలా తెర కెక్కించాలో తెలిసిన నిష్ణాతులలో డైరెక్టర్ కె. రాఘవేంద్రరావు ఒకరు. అందుకే ఈయన రూపొందించే చిత్రాల కోసం ప్రేక్షకులు ఎంతో ఆత్రుతతో నిరీక్షిస్తుంటారు. భారత సంగ్రామం నాటి పరిస్థితులను మించిన పలు సమస్యలతో సతమత మవుతున్న నేటి భారతావనిలో పలుకుబడి గలవారి దౌర్జన్యాలను ప్రతిఘటించి, సమాజంలో సుఖ శాంతులను ఎలా నెలకొల్పవచ్చున్న ఇతి వృత్తంతో ఈయన దర్శకత్వంలో ఈయన తండ్రి కె. ఎస్. ప్రకాశరావు



"విజేత విక్రమ్"లో వెంకటేష్, ఫారా

భారీ ఎత్తున నిర్మించిన ప్రకాష్ స్టూడియోస్ వారి "భారతంలో అర్జునుడు" చిత్రంలో వెంకటేష్, కుష్బూ నాయకా నాయికలు. రావు గోపాలరావు, రంగనాథ్, నూతన్ ప్రసాద్, సుధాకర్, అల్లు రామలింగయ్య, కోట శ్రీనివాసరావు, చలపతిరావు, పి. ఎల్. నారాయణ, సాయికుమార్, మాడా, మానిక్ ఇరానీ, ముచ్చెర్ల అరుణ, తాతినేని రాజేశ్వరి, సంయుక్త, కుయిలి, నిర్మల, కల్పనారాయ్, చిట్టిబాబు, విశిష్టమైన పాత్రలలో ఈ చిత్ర రచయితలైన పరుచూరి సోదరులు పాల్గొన్నారు జొన్న విత్తుల గీతాలు, చక్రవర్తి సంగీతం, కె ఎస్ ప్రకాష్ ఛాయ, భాస్కరరాజు శిల్పం, రఘు నృత్యాలు, విజయన్ సాహసాలు, వి ఎస్ రెడ్డి సహకార దర్శకత్వం కోటగిరి వెంకటేశ్వరరావు కూర్పుతో కె. కృష్ణమోహనరావు నిర్మాణ సారథి.



"చక్రవర్తి"లో మోహన్‌బాబు, చిరంజీవి

## కల్యాణ చక్రవర్తి "కృష్ణలీల"

"ఇతరులపై ఆధార పడకుండా, ఎప్పుడో మంచి కాలం వస్తుందని ఎదురు చూడకుండా స్వయం శక్తితో ముందంజ వేసే వారికి విజయం తథ్యం – అనే ఇతివృత్తంలో వేములపల్లి మోహనరావు రాసిన ప్రథమ బహుమతి పొందిన నవలను తెరకెక్కిస్తున్నాం. మే మొదటి వారం నుంచి జూన్ రెండవ వారం వరకు జరిగే మూడు షెడ్యూల్స్‌లో షూటింగ్ పూర్తవుతుంది." అన్నారు రవిరాజా పినిశెట్టి. ఈయన దర్శకత్వంలో ప్రసాద్ ఆర్ట్ క్రియేషన్స్ అధినేతలు సి. డి. నాగేశ్వరరావు, ఎస్. సూరిబాబు నిర్మించే "కృష్ణలీల" చిత్రంలో కల్యాణ చక్రవర్తి, రమ్యకృష్ణ, మోహన్‌బాబు, సత్యన్నారాయణ, శుభలేఖ సుధాకర్, సాక్షి రంగారావు, ఎస్. వరలక్ష్మి, శ్రీదుర్గ పాత్రధారులు. వేటూరి గీతాలకు, రాజ్ కోటి బాణీలు కూర్చారు. రమణ ఛాయ, కుదరవల్లి నాగేశ్వరరావు శిల్పం, సాహుల్ సాహసాలు, శివశంకర్ నృత్యాలు, కనగాల జయకుమార్ సంయుక్త దర్శకత్వం, వెంకటేశ్వరరావు– శాయి ప్రొడక్షన్ నిర్వహిస్తున్నారు.

"ముద్దాయి"లో ముచ్చెర్ల అరుణ, రాధ





"ఇంటి దొంగ"లో కల్యాణచక్రవర్తి, అశ్వని



'కసాయి గుండెలు'లో క్రాంతిమోహన్, పూర్ణిమ

# సినిమా

## మూడు వంతులకు పైగా పూర్తయిన "అత్తగారూ, జిందాబాద్!"

ప్రేక్షకులను కడుపుబ్బ నవ్వించే సన్నివేశాలతో, మధురమైన సంగీతంతో రంజింపజేసే చిత్రం మూడు వంతులకు పైగా పూర్తయింది అన్నారు డాక్టర్ బానుమతీ రామకృష్ణ ఈమె నిర్మిస్తూ ప్రదాన పాత్ర నిర్వహించే బరణీ పిక్చర్స్ వారి పై చిత్రంలో కల్యాణచక్రవర్తి రోహిణి కోట శ్రీనివాసరావు, జె వి సోమయాజులు, చక్రపాణి పద్మనాభం, వై జి మహేంద్రన్ ఏలేశ్వరం రంగా వై విజయ, దివ్య సితార కృష్ణవేణి, సరోజ సూర్యకళ ఆదిగా గలవారు పాల్గొంటున్నారు బమిడిపాటి రాదాకృష్ణ సంబాషణలకర్త సీతారామశాస్త్రి జాలాది గీతాలు రాశారు జె సత్యనారాయణ చాయ, సుబ్రహ్మణ్యం శిల్పం, బి హరినారాయణ సహకార దర్శకత్వం – కూర్పుతో డాక్టర్ బరణి సమర్పించే ఈ వినోదాత్మక మైన చిత్రానికి పి చంద్రశేఖర రెడ్డి దర్శకుడు జూన్ విడుదల

## కె వి. వి. సత్యనారాయణ కొత్త చిత్రంలో కల్యాణ చక్రవర్తి, హరీన్ చక్రవర్తి

ఏప్రిల్ 20న మా హీరో కల్యాణ చక్రవర్తి జన్మదిన శుభసందర్భాన నేను నిర్మించే అక్షింతలు' చిత్రం షూటింగ్ పూర్తయి అదే రోజున సౌదామిని పిక్చర్స్ పతాకంలో నిర్మించే కొత్త చిత్రానికి ప్రారంబోత్సవం జరిగింది ఈ కొత్త చిత్రం రాజమండ్రి తాడేపల్లి గూడెం పరిసరాలలో గ్రామీణ వాతావరణంలో మే నెలలో పూర్తవుతుంది, అన్నారు కె వి వి సత్యనారాయణ ఈయన కొత్త చిత్రంలో కల్యాణ చక్రవర్తి, హరీన్చక్రవర్తి గొల్లపూడి మారుతీరావు రమ్య వై విజయ సుదర్శన్ చిట్టిబాబు ఆదిగాగల వారు పాత్రదారులు కొంపెల్ల విశ్వం మాటలు శ్యామ్ సంగీతం సురేన్‌బాబు చాయ దొరై–వెంకటేశ్వరరావు– శీను ప్రొడక్షన్ రామచంద్రన్ సహకార దర్శకత్వం కె రామ్మోహనరావు నిర్మాణ సారద్యంతో మౌళి కథ స్క్రీన్‌ప్లే దర్శకత్వ బాధ్యతలు వహిస్తున్నారు

## కోదండరామిరెడ్డి, నాగార్జున కాంబినేషన్‌లో వి. దొరస్వామిరాజు చిత్రం

సెంటిమెంట్ కామెడీ మేళవించిన గ్రామీణ ఇతివృత్తం మేలో పక్షం రోజులు జూన్‌లో పక్షం రోజుల షూటింగ్‌తో పూర్తవుతుంది అన్నారు ఎ కోదండరామిరెడ్డి ఈయన దర్శకత్వంలో ప్రముఖ పంపిణీ దారులు వి దొరస్వామిరాజు నిర్మించే వి ఎం సి ప్రొడక్షన్స్ వారి చిత్రంలో నాగార్జున సరసన ఇద్దరు నాయిక లుంటారు గొల్లపూడి మారుతీరావు శ్రీవిద్యతో పాటు విలన్‌గా ఓ నవనటుడు పాల్గొంటారు సత్యానంద్ మాటలు వేటూరి పాటలు చక్రవర్తి సంగీతం ఎస్ సుదాకరరెడ్డి చాయ, శ్రీనివాసరాజు శిల్పం తార నృత్యాలు, బి వి సుబ్బారావు ప్రొడక్షన్ డి వెంకటరత్నం కూర్పు నిర్వహిస్తున్నారు

"తాయారమ్మ – తాండవకృష్ణ"లో షావుకారు జానకి. అర్జున్.



## శోభన్‌బాబు ద్విపాత్రాభినయంతో దొరికితే దొంగలు

దొంగగా ఇన్‌స్పెక్టర్‌గా ఎంతో తేడాలున్న రెండు పాత్రలను శోభన్‌బాబు అమోఘంగా పోషించారు అన్నారు కె మురళీమోహనరావు ఈయన దర్శకత్వంలో కృపాకరరెడ్డి నిర్మించిన శ్రీ కామాక్షి క్రియేషన్స్ వారి పై చిత్రం షూటింగ్ పూర్తయింది విజయశాంతి రాధ నాయికలు సత్యనారాయణ గొల్లపూడి మారుతీరావు గిరిబాబు నూతన్‌ప్రసాద్ కోట శ్రీనివాసరావు చలపతిరావు వై విజయ అన్నపూర్ణ జానకి ఇతర నటవర్గం సత్యానంద్ వేటూరి చక్రవర్తి ఎన్ సుధాకరరెడ్డి తోట యాదు నరసింహారావు శ్రీనివాసరావు జ్యోతేంద్ర పట్టాభి రాము మూర్తి ప్రభృత సాంకేతిక వర్గంతో ఎస్ కృష్ణప్రసాద్‌రెడ్డి ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్

## డైరెక్టర్ కోదండరామిరెడ్డి కొత్త చిత్రాలు

కమలహాసన్ శ్రీదేవిలతో అనం గోపాలకృష్ణారెడ్డి నిర్మించే చిత్రానికి జూన్‌లో అంకురార్పణ జరుగుతుంది అదే నెలలోనే డి వి ఎస్ రాజు నిర్మాణం ప్రారంభించే చిత్రంలో బాలకృష్ణ విజయశాంతి నాయికా నాయకులు జూలైలో మొదలయ్యే రోజా మూవీస్ చిత్రంలో చిరంజీవి భానుప్రియ ప్రధాన పాత్రధారులు బాలకృష్ణతో రామకృష్ణా సినీ స్టూడియోస్ చిత్రం సెప్టెంబర్‌లో సెట్స్‌కు వెళ్తుంది అక్టోబర్ నుంచి చిత్రీకరణ జరిగే విజయలక్ష్మి ఆర్ట్ ఎక్స్‌ప్రెస్ చిత్రంలో చిరంజీవి భానుప్రియ రాధ ఆదిగాగల వారు పాల్గొంటారు □

జయబేరి లో విజయలలిత పసాద్ బాబు



# ఆంధ్రసచిత్రవారపత్రిక



పాఠకులకు
## శతచిత్ర నటి సుమలత
సమాధానాలు!

### త్వరలో ప్రారంభం!

తెలుగు సినిమా ప్రేక్షకుల ఆదరాబిమానాలని విశేషంగా చూరగొన్న శత చిత్ర నటి సుమలత ఆంధ్ర సచిత్ర వారపత్రిక పాఠకుల ప్రశ్నలకు సమాదానాలు ఇస్తారని తెలియచేయటానికి సంతోషిస్తున్నాము త్వరలో ప్రారంబం కాబోయే ఈ శీర్షికకి పాఠకులు అర్థవంతమైన ప్రశ్నలని మాత్రమే పంప గోరుతున్నాము వారం వారం ప్రచురింపబడే ఈ శీర్షికలో ప్రతివారం సుమలత ఎన్నిక చేసిన ఉత్తమ ప్రశ్నని పంపిన వారికి ఆటోగ్రాఫ్‌తో ఉన్న ఆమె అందమైన ఫోటో బహుమతిగా లబిస్తుంది ప్రశ్నలు పంపేవారు తమ ప్రశ్నని ఈ కింది కూపన్‌లో స్పష్టంగా సిరాతో లేదా బాల్ పాయింట్ పెన్‌తో రాసి తమపేరు పూర్తి చిరునామాతో సహా సుమలత సమాదానాలు శీర్షిక పేర సంపాదకుడు ఆంధ్ర సచిత్ర వారపత్రిక గాంధీనగరం విజయవాడ –520003 అన్న చిరునామాకి పంపాలి ఒక కూపన్‌లో ఒక ప్రశ్నని మాత్రమే రాయాలి విడిగా రాసి పంపినవి పరిశీలింప బడవు

**పాఠకులు** ఈ అవకాశాన్ని ఉత్సాహంతో వినియోగించుకోగలరని ఆశిస్తున్నాము

-------------------- కూపన్ --------------------

ఆంధ్ర సచిత్ర వారపత్రిక
## సుమలత సమాధానాలు

ప్రశ్న

పంపినవారి పేరు

పూర్తి చిరునామా

# అభిమాన తారలపై అభిప్రాయం

తెలుగు సినిమారంగంలో ధైర్య సాహసాలకు మారుపేరు అయిన కృష్ణ అంటే నాకు ఆరో ప్రాణం తెలుగు చలన చిత్ర రంగానికి డేరింగ్ అండ్ డాషింగ్ హీరో కృష్ణగారు "మకుటం లేని మహారాజు" వంటి వారు మొట్ట మొదటి సారిగా తెలుగు చలన చిత్రరంగంలో సినిమా స్కోప్‌తో 'అల్లూరి



సీతారామరాజు" చిత్రాన్ని నిర్మించి ఒక చరిత్రను సృష్టించిన సాహసి పారితోషికం విషయంలో నిర్మాతలకు ఎలాంటి ఇబ్బందులు కలిగించకుండా సహకరించే సహృదయులు తెలుగు నాట వరదలు, తుఫానులు సంభవిస్తే పరిశ్రమలోని అందరి కంటే ఎక్కువగా సహాయ నిధికి విరాళాన్ని యిచ్చే వితరణ శీలి "మోసగాళ్ళకు మోసగాడు" వంటి కౌబాయ్ చిత్రాల్లో తనకు తానే సాటి అనిపించుకునే నటశేఖరులు, అఖిలాంధ్ర ప్రజానీకం చేత నాలుగు సార్లు 'సూపర్ స్టార్'గా ఎన్నికైన ఏకైక తెలుగు హీరో. ఇన్ని సుగుణాల నిధి అయిన కృష్ణగారిని అభిమానించటంలో ఆశ్చర్యమేమీ లేదు కృష్ణ, జయప్రద నటించిన "అల్లరి బావ' చిత్రం చూసినప్పటి నుండి వారిద్దరూ నాకు అభిమాన నటీనటులై పోయారు వారిద్దరి కాంబినేషన్‌లో మరిన్ని తెలుగు చిత్రాలు రావాలని నా ఆకాంక్ష

-కె. వీరభద్రాచారి,

ముచ్చుమర్రి, నందికొట్కూర్

★ ★ ★

నా అభిమాన నటీమణి, అందాల తార రాధ అతి తక్కువ కాలంలోనే విశేష అభిమానమును,



ఆకర్షణను పొంది, తారా పథానికి చేరుకున్న గ్లామర్ క్వీన్ రాధ ఈమె నటించిన చిత్రాలు నేను అధిక సంఖ్యలో చూసాను. నటనకు ప్రాధాన్యం గల పాత్రలలో, చక్కని నటన ప్రదర్శిస్తుంది

ఇటీవల విడుదలయిన "రాక్షసుడు" చిత్రంలో ఆద్యంతమూ – ప్రేక్షకులను నవ్విస్తుంది ఈ చిత్రంలోని రాధ చిలిపి నటన – నన్ను ఆకర్షించింది రాధ తన నటనలో భావ ప్రకటన – సామర్ధ్యాన్ని ముద్దుగా ప్రదర్శించగలదు.

గతంలో రాధ నటించిన దొంగ,రక్తసింధూరం, కొండవీటి రాజా, అడవి దొంగ, అడవి రాజా, ఆత్మబంధువు తదితర చిత్రాలలో రాధ గారి అభినయం జనరంజకంగా ఉంది. రాధ, చిరంజీవిల జంట చూడ ముచ్చటగా ఉంటుందన్న అభిప్రాయం ప్రేక్షకుల్లో స్థిరపడిపోయింది కనుక రాధ అవకాశాన్ని బట్టి చిరంజీవితో ఎక్కువ చిత్రాలలో నటించి, అభిమానులను ఆనందింపజేస్తారని ఆశిస్తున్నాను పాత్ర స్వభావం తెలుసుకొని, కథా బలం గల చిత్రాలలో నటించి మరింత క్రేజ్ సంపాదించుకోవాలని రాధకు నా సూచన

జి. యమధర్మరాజు.

యస్. కే. డి. నగర్, ఆదోని.

★ ★ ★

మహోన్నత సినీ వినీలాకాశంలో సామ్రాట్‌లాగ దూసుకొని వచ్చాడు నందమూరి అందగాడు యువరత్న బాలకృష్ణ కళామతల్లి ముద్దు బిడ్డ ఈ 'కథా నాయకుడు తెలుగు సినీ వినీలాకాశంలో



ప్రేక్షకులచే పట్టాభిషేకం చేయించుకున్న ఈ "భార్గవరాముడు "మొన్నటి "ముద్దుల కృష్ణయ్య", నిన్నటి "అల్లరి కృష్ణయ్య" "నేటి సామ్రాట్" ఈ "ప్రెసిడెంట్ గారబ్బాయి' ప్రేక్షకులు గర్వించదగ్గ అందాల నటుడు యువతరం హీరో మా "కలియుగ కృష్ణుడు"

జంధ్యాల దర్శకత్వంలో "సీతారామ కళ్యాణం" చేయించుకొని పల్లెసీమల్లో అందాన్ని సంత. రించుకొని వీరవిహారం చేసిన "మంగమ్మగారి మనవడు", "అనసూయమ్మగారి అల్లుడు" కళా తపస్వి విశ్వనాథ్ దర్శకత్వంలో అందాల నటి విజయశాంతి సరసన నటిస్తే చూడాలని ఉంది.

- కళారాణి, త్రోవగుంట (ప్రకాశం)

★ ★ ★

డైనమిక్, యంగ్, యాంగ్రీ, యాక్షన్ హీరో చిరంజీవి అంటే నాకు ఎంతో యిష్టం అతని ప్రతి సినిమా చూస్తాను. అప్పటి "ప్రాణం ఖరీదు" సినిమా నుంచి నేటి "ఆరాధన" సినిమా వరకు అతను నటించిన పాత్రలన్నీ, వెరైటీ పాత్రలే అతను నటించిన "ఛాలెంజ్' సినిమాలో అతను వేసిన పాత్ర నేటి యువకులకు ఆత్మస్థైర్యాన్నిచ్చే గొప్ప పాత్ర. అతని చిరునవ్వులు చిందించే ముఖం చూస్తుంటే ఎంతో ఆహ్లాదంగా వుంటుంది.

చిరంజీవి అంటే నాకు ప్రత్యేకమైన అభిమానం వుండటానికి ప్రత్యేకమైన కారణాలు ఒకటి చిరంజీవిగారు అనాధ పిల్లల కోసం ఒక బృహత్తర కార్యక్రమం చేపట్టి వారిని అభివృద్ధిలోకి తేవడానికి



పూనుకోవడం

రెండవది అతను ఏ రాజకీయ పార్టీ తరపున ప్రచారం చేయకుండా ఏ రాజకీయాల జోలికి పోకుండా తన వ్యక్తిత్వం నిలుపుకోవడం

అందుకే చిరంజీవి నాటి, నేటి, ఎప్పటికీ డైనమిక్ హీరోయే

-ఎమ్. ఫణికుమార్,

నాగార్జునసాగర్ డామ్

★ ★ ★

నేను చంద్రమోహన్‌గారి అభిమానిని ఎందుకంటే ఆయన నటించిన మొదటి చిత్రం "రంగుల రాట్నం" లోని ఆయన నటనకు ముగ్ధుడనై అభిమానిగా మారినాను ఆయన ఫస్ట్ పిక్చర్‌లోనే బెస్ట్ యాక్టర్‌గా నా మనస్సులో స్థిరపడినారు అంతే కాకుండా విశ్వనాథ్‌గారి పిక్చర్‌లో నటించడమే ఎంత గొప్ప అదృష్టము అనుకొనే యాక్టర్‌లు చాలామంది ఉన్నారు అటువంటిది విశ్వనాథ్‌గారి అనేక చిత్రములు "సిరి సిరి మువ్వ', శుభోదయం', "సీతామాలక్ష్మి', "శంకరాభరణం , "ఓ సీత కథ చిత్రములలో ఆయన నటించారు అవే కాకుండా "పదహారేళ్ళ వయసు", మొదలగు చిత్రములలో



నటించినారు. 'సిరి సిరి మువ్వ", "ఓ సీత కథ", "పదహారేళ్ళ వయసు" చిత్రములలో ఆయన నటించారు అనుట కంటే జీవించారు అనుట అతిశయోక్తి కాదు. ఆయన ఎట్టి పాత్రనైనా అవలీలగా పోషించి చక్కగా రక్తి కట్టించగల ఆల్ రౌండర్.

- కె. శ్రీనివాసరావు, భీమవరం □

# పెద్ద కథ

## వడ్డీ

టి.యస్.వి.కృష్ణమూర్తి



స్టెప్స్ మధ్యనున్న పిట్ మీదుగా నడిపించుకు వెళ్ళి ఏకంగా వరండాలో ఆపాను మోటారుసైకిలు ఆ సమయంలో మామూలుగా నా కోసం ఎదురు చూస్తూ వరండాలో నిలబడే పిల్లలు అక్కడ లేరు స్టాండువేసి మోటార్‌బైక్ నిలబెట్టి, పెట్రోలు ఆపుచేసి, కీస్ ఊడదీసుకుని హాల్లోకి నడిచాను

చిరునవ్వుతో ఎదురొచ్చే నా శ్రీమతి కూడా హాల్లోకి రాకపోగా వికారంగా కన్పించే పనిమనిషి పాపమ్మ కంగారుగా పరిగెత్తుకు వచ్చేసరికి కాస్త తెల్లబోయాను

అమ్మగారు సాయంకాలము మూడు గంటల రైలు బండికి పిల్లలిద్దర్నీ తీసుకుని మీ అత్తగారి



ఊరెళ్ళారు బాబూ! మీరు రాగానే ఈ కాగితం ఇమ్మన్నారు! అంటూ ఓ కాగితం అందించింది పాపమ్మ

ఏం కొంపలు మునిగాయో, ఎవరి ప్రాణంమీదికి వచ్చిందో అని కంగారు పడిపోతూ గబగబా కాగితం మడతలు విప్పాను

శ్రీవారికి,

మీరు ఇంతకాలం నాకు వివరాలు తెలియనివ్వకుండా చేస్తున్న వ్యాపారం ఏమిటో నాకు పూర్తిగా, క్లియర్‌గా తెలిసిపోయింది ఈ రోజు నాకు మీమీద చాల కోపం వచ్చింది ఎంత సరిపెట్టుకుందామని ప్రయత్నించినా నా మనసు అంగీకరించడం లేదు అందుకే మొట్టమొదటి పర్యాయం మీమీద అలిగి మీతో చెప్పకుండా, మీ అనుమతి తీసుకోకుండా పల్లెకు వెళ్తున్నాను పిల్లల్ని కూడా తీసుకుని వారం రోజుల తరువాతకానీ తిరిగిరాను

డబ్బు, బంగారం, హోదా ఇలాంటి వేవీ లేకపోయినా మీ నీడన నవ్వుతూ బ్రతికెయ్యగల ఆత్మస్థైర్యం నాకుంది ఆ విషయం మీకూ బాగా తెలుసు కానీ, నా ఆలోచనా విధానాలన్నీ తెలిసీ మీరు నన్ను ఒకరంగా మోసం చేశారు ఇంతకన్నా బాధాకరం మరొకటి ఉంటుందా?

మీరు చేస్తున్న ఆ పాపిష్టి వ్యాపారంతో వచ్చిపడుతున్న ఈ సౌఖ్యాలను నేను ఏమాత్రం ఇష్టపడను ఇకపై మన సంసారనావ సజావుగా, ఆనందంగా నడవడం కోసం మీరు ఆ వ్యాపారాన్ని పూర్తిగా ఆపెవెయ్యాలి నేను తిరిగి వచ్చేలోగా

ఈ ఒక్క విషయంలో మాత్రం మీ ఇష్టాయిష్టాలను నేను గుర్తింప దలచుకోలేదు అందుకు నన్ను మన్నించండి. ఇంతకన్నా ఎక్కువ వ్రాయవలసిన అవసరం లేదు కదూ"

వెళ్ళివస్తాము

మీ

సుగాత్రి

నా గుండె ఝల్లుమంది ఏదయితే జరగకూడదో అదే జరిగింది నా శ్రీమతికి తెలియనివ్వకుండా అతి రహస్యంగా నేను సాగిస్తూ వచ్చిన వ్యవహారం అంతా తనకి తెలిసిపోయింది

దేవతలాంటి సుగాత్రి, నన్ను వదిలి ఒక్క రోజయినా గడపలేని నా శ్రీమతి వారం రోజులపాటు





నన్ను వెలేసి నాకు దూరంగా ఉండాలని వెళ్ళిపోయిందంటే తనకి వచ్చిన కోపం సామాన్యమైనది కాదు ఖచ్చితంగా వారం రోజులపాటు సుగాత్రికి దూరంగా నేను నిస్సారంగా జీవించడమా? నెవర్!

"పాపమ్మా!"

నేను అరచిన అరుపుకు పాపమ్మ మళ్ళీ పరిగెత్తుకు వచ్చింది కంగారుగా వంట గదిలోంచి.

"నేనూ ఇప్పుడే మా అత్తగారి ఊరు వెళ్తున్నాను. మేము తిరిగి వచ్చేదాకా రాత్రులందు మీ అబ్బాయిలిద్దర్నీ ఇంట్లో పడుకోమని చెప్పు. ఇల్లు జాగ్రత్త!" అనేసి లోపలి గదిలోకి పరుగుతీశాను.

ఐదు నిముషాలలో వి ఐ పి బ్రీఫ్ కేసులో బట్టలు సర్దుకుని హాల్లోకి వచ్చాను చోద్యం చూస్తున్న దానిలా ఇంకా అక్కడే నిలబడివుంది పాపమ్మ.

"నేను స్టేషనువద్ద దిగిపోయి ఆంజనేయులు చేత మోటారుసైకిలు ఇంటికి పంపిస్తాను!" అంటూ బయల్దేరాను

ఆఫీసునుండీ వసూళ్ళకు వెళ్ళిన ఆంజనేయులు అదృష్టవశాత్తు నాకు సులభంగానే తటస్థపడ్డాడు అతన్ని నాతో పాటు తీసుకువెళ్ళి రైల్వేస్టేషనువద్ద అతనికి మోటారుసైకిలూ, ఆఫీసుకు శెలవుచీటీ అప్పజెప్పి బయల్దేరబోతున్న పాసింజరు ట్రియిన్ అందుకున్నాను మా అత్తగారి ఊరి తాలూకు స్టేషన్‌లో మెయిల్‌గానీ, ఎక్స్‌ప్రెస్‌గానీ ఆగవు.

రైలు పురోగమించడం ప్రారంభించగానే నా ఆలోచనలు గతంలోకి తిరోగమించడం మొదలు పెట్టాయి

★ ★ ★ ★

బామ్మకి క్యాన్సరు జబ్బు వచ్చేదాకా నాకు ఆర్థికపరమైన ఇబ్బందులంటే ఏమిటో సరిగ్గా అవగాహన కాలేదు.

రికవరీలుపోగా పదకొండు వందలు జీతం చేతికి అందేది. అందులో వందరూపాయలు నా స్వంత ఖర్చులకు ఉంచుకునే వాడ్ని. రెండువందలు బెనారస్ యూనివర్సిటీలో చదువుతున్న చిన్న తమ్ముడికి నా వాటాగా పంపివేసే వాడిని. వంద రూపాయలు పిల్లల కాన్వెంటు ఫీజులు కట్టేవాడ్ని. వంద రూపాయలు ఫోస్టాఫీసులో కట్టేసేవాడ్ని మిగిలిన ఆరువందల రూపాయలు సుగాత్రి చేతిలో పడవేసే వాడ్ని.

మా పల్లెనుండీ తిండిగింజలు వచ్చిపడేవి కాబట్టి ఆ ఆరువందలతోనే ఏలోటూ లేకుండా సంసారాన్ని నెట్టుకు వచ్చేది సుగాత్రి అందులోంచే మిగిల్చి పిల్లల పుస్తకాలూ, చిన్న చిన్న వస్తువులూ, దీపావళి టపాకాయలూ లాంటివన్నీ తనే కొంటుండేది. ప్రతి సంవత్సరం ఫెస్టివల్ అడ్వాన్సు, ప్రావిడెంట్‌ఫండులోన్ డ్రా చేసి అందరికీ బట్టలు ఒకేసారి కొనేసేవాడ్ని మళ్ళీ సంవత్సరంలోపు ఆ బాకీలు తీరిపొయ్యేవి.... మళ్ళీ...

ఒంటెద్దు బండి నడకలాగే అయినా హాయిగా, సుఖంగా సాగిపోతుండేది నా జీవితం. ఎలాంటి వ్యధలూ, మానసిక ఆవేదనలూ మా దరిదాపులకు వచ్చేవి కావు. రోజులు అలా, అలా సాగిపోతోండగా బామ్మ జబ్బు పడింది ఓ పర్యాయం.

* * * *

మొదట ఆర్డినరి ఎక్స్‌రే తీశారు. ఆ తరువాత రెండ్రోజులు ఆగి ఏదో లిక్విడ్ మింగించి మరో ఎక్స్‌రే తీశారు. ఆ తరువాత రోజు ఏదో ఎలక్ట్రిక్ బల్బులాంటి చిన్ని వస్తువును అతి సన్నని వైర్లతో సహా మింగించి స్క్రీనింగ్ చేశారు. మళ్ళీ ఎక్స్‌రే తీశారు.

మా ఊర్లో, మా తాలూకా కాదు మా జిల్లాలోనే చాల మంచి పేరున్న డాక్టరు వేదవ్యాస్.

"త్రోట్ క్యాన్సర్ బిగినింగ్ స్టేజిలోనే ఉందని ఖచ్చితంగా చెప్పగలను. మీరు ఏమాత్రం ఆలస్యం చెయ్యకుండా హైదరాబాదు తీసుకు వెళ్తే తప్పకుండా నయం అయిపోతుంది." అన్నాడు ఆయన స్వచ్ఛమైన ఇంగ్లీషులో బామ్మకి అర్థం కాకుండా.

నా గుండెలో రాయి పడింది.

"మీరు రేపు ఉదయం పది గంటలకు రండి. పేషెంటు హిస్టరీ షీటు, కవరింగ్ లెటర్ తయారు చేసి ఉంచుతాను. వాటిని తీసుకుని మీరు ఎప్పుడైనా బయల్దేరవచ్చు!" అన్నాడు ఆయనే మళ్ళీ!

పాపం ఆయనకు ఎలా తెలుస్తుంది.... నేను పుట్టి పెరిగిన మా పల్లెటూరు, పై చదువు సాగించిన తిరుపతి, ఉద్యోగం చేస్తున్న ఈ ఊరు తప్ప మరో ఊరు చూసిన వాడ్ని కాననీ, బావిలో కప్పలాంటి వాడిననీ!?

"అలాగే డాక్టర్! ఉదయాన్నే వస్తాను!" అంటూ లేచి బామ్మను తీసుకుని బయల్దేరాను.

నా టెలిగ్రాములు అందుకుని అన్నయ్యా, పెద్ద తమ్ముడూ, రెండోవాడూ పరుసగా దిగిపొయ్యారు. ఆలోగా మా పల్లెనుండి అమ్మా, నాన్నగారూ కూడా బయల్దేరి వచ్చారు నేను పంపించిన ఉత్తరం అందుకుని.

"ఒరేయి క్యాన్సరు వచ్చినవాడూ, కాటికి వెళ్ళినవాడూ ఒక్కటేరా! అనవసరంగా అంత దూరం ఎందుకుగానీ ఇక్కడి మిషన్ హాస్పటల్‌లోనే చేర్పించేద్దాము. ఆయుస్సున్నన్నాళ్ళు ఉండనీ!" అనేశాడు అన్నయ్య.

ఇంకో వంద సంవత్సరాలు గడచిపోయిన తరువాత మనిషి ఆలోచనలు ఇంకెంత ఉన్నతంగా ఉంటాయో? అనుకున్నాను వాడి మాటలు విని.

"ఈ వయసులో బామ్మకి నయం అవుతుందనే నమ్మకం నాకూ లేదు.... హైదరాబాదంటే మాటలా?" అన్నాడు పెద్ద తమ్ముడు.

వేగం పుంజుకుంటున్న కాలంలో మనిషి ఎక్కడ్నుండి ఎక్కడికి ఎదిగిపోతున్నాడో? కమర్షియల్ థింకింగ్ అనేది ఎలా పుడుతుందో తెలియదు కానీ అది ఆత్మీయతల్ని సునాయాసంగా త్రోసి రాజంటుంది, అనిపిస్తుంది కొన్నిసార్లు మనుషుల చేత.

"నయం కాకపోవచ్చు అనే అనుమానం ఎందుకు? నయం అవుతుంది అనే ఆశతో హైదరాబాదు తీసుకు

వెళ్ళడం మన కర్తవ్యం నా వద్ద ప్రస్తుతం వెయ్యి రూపాయలున్నాయి ప్రస్తుతానికి ఆ వెయ్యీ ఇస్తాను ఆపై కావాలంటే నెలకి రెండు వందల చొప్పున పంపగలను బామ్మకి పూర్తిగా నయం అయ్యేదాకా!'

అన్నాడు చిన్న తమ్ముడు సీరియస్‌గా వాడ్ని ప్రాక్టికల్ వెధవ అనుకునే వాళ్ళం అందరమూ వాడే ఎన్నోరెట్లు నయం నిజానికి అన్పించింది నాకు ఆ సమయంలో

రెండు నిముషాలు మా అందరి మధ్యా నిశ్శబ్దం రాజ్యమేలింది

మొదట నిశ్శబ్దాన్ని బంగపరచినవాడు నా పెద్ద తమ్ముడు

నేనూ వెయ్యి రూపాయలు ఇవ్వగలను కానీ నెలనెలా వంద రూపాయల కంటే ఎక్కువ పంపలేను చిన్నవాడికి కాశీకి నెలనెలా రెండు వందలు నేనూ పంపుతున్నానుగా' అన్నాడు

నేను ప్రస్తుతం ఏమీ ఇవ్వలేనురా నెలనెలా రెండు వందల రూపాయలు మాత్రం పంపగలను అదీ కష్టంమీద' అన్నాడు అన్నయ్య

వాడది పెద్ద సంసారం వాడికి ఫామిలీ ప్లానింగ్‌ను గూర్చి సరయిన అవగాహన లేకపోవడం వల్ల పిల్లలు ఎక్కువ!

మా సంభాషణలతో తనకేం సంబంధం లేనట్లుగా వరండాలో కూర్చుని రామకోటి వ్రాసుకుంటోంది చావునీ, బ్రతుకునీ నిర్వికారంగా తీసుకోగలిగే వయసుకు ఎదిగి పోయిన బామ్మ!

నా కళ్ళలో నీళ్ళు తిరిగాయి చిన్న తనంలో నన్ను ఏవరైనా పిల్లలు కొట్టి ఏడిపిస్తే కర్ర పట్టుకుని వాళ్ళని వెతుకుతూ బయల్దేరేది బామ్మ అమ్మ నను కేకలేస్తే తన బొడ్లోంచి రాగి కాణీయో, ఇత్తడి అర్ధనాయో తీసి ఇచ్చి నన్ను ఓదార్చేది తను ఏ ఊరు వెళ్ళినా నన్ను తన వెంట తీసుకు వెళ్ళేది రాత్రులందు నన్ను తన ప్రక్కలో పడుకో బెట్టుకుని వెచ్చగా రగ్గు కప్పి రకరకాల కథలను చెప్పేది

బామ్మకి జబ్బు నయం చేయించకుండా ఎలా ఉండగలను ప్రశాంతిగా' అనుకున్నాను

* * * *

పోస్టాఫీసులో నా పేరిట నెలకు వంద చొప్పున కడ్తూ ఉండిన మొత్తం ఆరువేల రూపాయల వరకూ ఉన్నది డ్రా చేశాను తమ్ముళ్ళు ఇచ్చిన రెండు వేల రూపాయలూ నాన్నగారు పల్లెలో గింజలు అమ్మి తెచ్చిన రెండు వేలూ మొత్తం పదివేల రూపాయలు తీసుకుని, బామ్మనూ, అమ్మనూ, నాన్ననూ, అన్నయ్యనూ తీసుకుని హైదరాబాదు బయల్దేరాను

అదృష్టవశాత్తు హైదరాబాదులో హాస్పటల్‌కి దగ్గరగానే సౌకర్యాలున్న ఓ గది దొరికింది నెలకు నాలుగు వందల రూపాయల అద్దెకి నిజానికి అంతలో ఆ ప్రాంతంలో సౌకర్యాలున్న గదులు దొరకడం చాల కష్టమట

బామ్మని హాస్పటల్‌లో చేర్పించిన తరువాత రెండ్రోజులు అక్కడే ఉండి తరువాత అమ్మనూ, నాన్ననూ బామ్మకి తోడు ఉంచి వాళ్ళకి కావల్సినవన్నీ కొని గదిలో ఉంచి నేనూ అన్నయ్యా ఎవరి ఊర్లకు వాళ్ళు వచ్చేశాము

* * * *

బామ్మని తీసుకెళ్ళడాన్కి క్యాన్సర్ రూపం ధరించి వచ్చిన మృత్యు దేవతతో సమరం మొదలు పెట్టారు హాస్పటల్ వాళ్ళు

* * * *

రోజులు, వారాలు, నెలలు గడుస్తున్నాయి వారానికి లేదా పది రోజులకు ఒకసారి ఎవరో ఒకరం వెళ్ళి బామ్మనీ అమ్మా నాన్నలనూ చూసి పరిస్థితి తెలుసుకుని వస్తున్నాము

డబ్బు మంచినీళ్ళలా ఖర్చయి పోతుండడం వల్ల పదివేల రూపాయలు త్వరలోనే పూర్తయి పోయాయి నాకు తెలియకుండా తను దాచుకుని ఉండి అవసరాన్ని గ్రహించి సుగాత్రి నాకు అందించిన పన్రెండు వందల రూపాయలు కూడా అయిపోయాయి

అన్నయ్యా, తమ్ముళ్ళూ నెలనెలా పంపుతున్న ఐదువందలూ, పరిస్థితిని అర్థం చేసుకుని తన ఖర్చులు పూర్తిగా తగ్గించుకుని చిన్నతమ్ముడు బెనారస్ నుండి నెల నెలా వాపసు పంపుతున్న వందా, నా జీతంలో మిగిలిస్తున్న డబ్బూ అన్నీ కలిసినా చాలడం లేదు

చివరికి విదిలేని పరిస్థితులలో నా జీవితంలో మొట్ట మొదటి పర్యాయం అప్పుకోసం ప్రయత్నం చేశాను మా ఆఫీసులోనే అటెండరు మల్లయ్య వద్దే అప్పు లభిస్తుందని తెలిసి తెల్లబోయాను

లూజు బట్టలలో దీనంగా కన్పించే మల్లయ్య, సోడాబుడ్డీ కళ్ళద్దాలలోంచి భావశూన్యంగా చూసే మల్లయ్య, నాలాంటివాళ్ళు జాలిపడి అప్పుడప్పుడు క్యాంటీన్‌లో టిఫిన్‌లు ఇప్పిస్తే ఆప్యాయంగా తినే మల్లయ్య, కష్టాల బరువులో నడుం వంగిపోయిన వాడిలా, విషాదం తప్ప ఆనందం అనేది ఎరుగని వాడిలా కన్పించే మల్లయ్య ఒక్క మాటలో చెప్పాలంటే మూడ్ దొరకని ఆర్టిస్టు గీసిన అసంకల్పిత చిత్రంలా కన్పించే మల్లయ్య అప్పులు ఇస్తాడా?

నా ఆశ్చర్యం చూసి విసుక్కున్నారు నాకు ఇన్‌ఫర్‌మేషన్ ఇచ్చిన తోటి ఉద్యోగులు అతనివద్ద కూడా ఆశ్చర్యం కనబరచు వడ్డీ రెట్టింపుగా లాగుతాడు అని బయపెట్టారు కూడా

ఆశ్చర్యంలోంచి తేరుకున్న తరువాత మల్లయ్యను పిలిచి విడిగా మాట్లాడాను

మీకాసార్! ఎంతయినా తీసుకోండి ఇస్తాను నూటికి నెలకు పది రూపాయలు వడ్డీ!' అన్నాడు

బాప్‌రే! టెన్‌పర్సెంటా?

మీరు మంచివారూ, ఎప్పుడూ అప్పులు చెయ్యని వారూ నమ్మకస్తులూ, ముఖ్యంగా మీ అవ్వగారి జబ్బు నిమిత్తం అప్పు చేస్తున్న వారూ కాబట్టే వడ్డీ తగ్గించి చెప్పాను ఇతరు లెవరికీ నేను ఇంతవరకూ నూటికి నెలకు పన్రెండు రూపాయలకు తక్కువ ఇచ్చింది లేదు నిజంసార్!' అన్నాడు మల్లయ్య

వడ్డీ చాల ఎక్కువ!' అనుకున్నాను మనసులో

పోనీ ఒకపని చెయ్యండి బంగారం ఏదయినా తీసుకురండి నూటికి ఆరు రూపాయల వడ్డీతోటే డబ్బిస్తాను బంగారం మీదనయితే!' అన్నాడతను నా మనసులో భావం గ్రహించిన వాడిలా

నేను చకచకా ఆలోచించాను

సుగాత్రి శరీరం మీదున్న నగలన్నీ వాళ్ళ పుట్టి నింటివాళ్ళు పెట్టినవే! నేను చేయించినవి ఏమీలేవు కాబట్టి వాటిలో ఏ ఒక్కటీ కూడా తాకట్టు పెట్టడం బావుండదు. నాన్న ఊపిరి ఉండగా అమ్మ తన మెడలోని కాసుల పేరు ఊడదీయదు వదినా మరదల్లు అంత ఉదారంగా తమ నగలు తాకట్టు పెట్టడానికి తీసి ఇవ్వరు ఖచ్చితంగా!

ఆలోచనలు మాని తలవిదిలించాను

పదిహేనువందల రూపాయలు అప్పు తీసుకున్నట్లు మల్లయ్య భార్యపేరిట కాగితం వ్రాసి ఇచ్చి వెయ్యి రూపాయలు తీసుకున్నాను అతని వద్ద అయితే ఈ విషయం నేను సుగాత్రికి చెప్పలేదు చెప్పి తనకి కూడా ఎందుకు అశాంతిని



కలిగించడం అనుకున్నాను

ఆ రోజునుండీ హోటళ్ళలో కాఫీ, టీలు త్రాగడం, సిగరెట్లు త్రాగడం చివరికి సినీమాలు చూడడం కూడా పూర్తిగా మానుకున్నాను నాకు ఉద్యోగం వచ్చిన నాటినుండీ తెప్పిస్తున్న డైలీ పేపరు హిందూను కూడా నిలిపవేశాను

కర్తవ్య దీక్షలో కొన్ని సుఖాలు త్యజించక తప్పదు మరి

టెన్‌పర్సెంట్ వడ్డీతో తీసుకున్న వెయ్యి రూపాయలు కూడా అట్టే రోజులు కాకమునుపే పూర్తయిపోయాయి

నాన్నగారి దగ్గర్నుండి ఉత్తరం వచ్చి పడింది మళ్ళీ! నాలో పట్టుదల పెరిగింది!!

★ ★ ★ ★

మళ్ళీ మల్లయ్య వద్ద ఇంకో వెయ్యి రూపాయలు తీసుకోవాలని నిశ్చయించుకున్నాను అయితే ఈ పర్యాయం మాత్రం సుగాత్రికి విషయం అంతా వివరించాను

పది రూపాయల వడ్డీతో వెయ్యి రూపాయలు తీసుకున్నారా? ఇంకో వెయ్యి తీసుకోబోతున్నారా? అంటూ నిర్ఘాంత పోయింది సుగాత్రి సుగాత్రికి వడ్డీ వ్యాపారులంటే అసహ్యం వడ్డీకి అప్పులు తెచ్చుకునే వాళ్ళన్నా గిట్టదు తనకి

అవును వడ్డీ ఎక్కువే, తక్కువ వడ్డీకి అంటే నూటికి ఆరు రూపాయల వడ్డీతోట కూడా అప్పివ్వ గలడు ఆయన అయితే బంగారం ఏదయినా తాకట్టు పెట్టాలి! అన్నాను

ఏడిచాడు మన ఎదురింటి యశోదమ్మ పిన్ని గారు బంగారంమీద నూటికి మూడు రూపాయల వడ్డీతోటే అప్పులు ఇస్తారు ఈవాళ శుక్రవారం రేపు వెళ్ళి యశోదమ్మ పిన్నిగారివద్ద నా నెక్లెస్ తాకట్టు పెట్టి రెండు వేల రూపాయలు తీసుకు వస్తాను వెయ్యి రూపాయలు మామగారికి పంపించండి ఇంకో వెయ్యి తీసుకువెళ్ళి ఆ మల్లయ్య ఎవరో అతనికి ఇచ్చేయండి ఇంకెప్పుడూ నాకు తెలియకుండా అడ్డమైన గడ్డి వడ్డీ రూపంలో తినే నరరూప రాక్షసుల వద్ద అప్పులు చేయకండి నాకు కంపరం, భయం బాబూ వడ్డీ తినేవాళ్ళ

# వడ్డీ

'చేతులలో పడ్తే పచ్చని సంసారాలు ఒక్కసారిగా ఎరేడి భగ్గుమని కాలిపోతాయి' అంది సుగాత్రి

ఈసారి నిర్ఘాంతపోవడం నా వంతయింది నిరుపాదాయులాగా వుండే ఎదురింటి యశోదమ్మ గారు భక్తురాలు, చెయెత్తి మొక్కాలనిపించే మనిషి వడ్డీ వ్యాపారం చేస్తారా? ఆమాటే అన్నాను సుగాత్రితో

ఆఁ! లక్షణంగా! అంది సుగాత్రి ఆ పాపపు బరువు దించుకోవడానికే ఆ పూజలూ, వ్రతాలూ అన్నీ! అంది మళ్ళీ తనే కాస్త కోపంగా

సుగాత్రికి వడ్డీ వ్యాపారం చేసే వాళ్ళంటే తగని భయం, అసహ్యం, కోపం కూడా!

★ ★ ★ ★

నేనిచ్చిన వెయ్యి తీసుకుని నా కాగితం నాకు తెచ్చి ఇవ్వగానే మల్లయ్యను క్యాంటీనుకు తీసుకు వెళ్ళి టిఫిన్ ఇప్పించాను

మల్లయ్యా! నీకెంతమంది పిల్లలు?

ముచ్చటగా ముగ్గురే బాబూ! అన్నాడు మల్లయ్య ఆనందంగా

సదా భావశూన్యంగా కన్పించే అతని చూపులలో ఓ మెరుపు కన్పించింది నాకు ఆ క్షణంలో

చదువు కుంటున్నారా?

అవును బాబూ! పెద్దబ్బాయి విశాఖపట్నంలో ఇంజనీరింగ్ చదువు తున్నాడు రెండో అమ్మాయి తిరుపతిలో డాక్టరు చదువుతోంది ఆఖరివాడు మదనపల్లెలో అదేదో హార్టికల్చరట బాబూ, అది చదువుతున్నాడు

మల్లయ్య కంఠ స్వరంలో మొట్టమొదటసారి ఎంతో తృప్తి, కాస్త గర్వం విన్పించాయి నాకు ఓ వింత కాంతి కూడా స్పష్టంగా కన్పించింది అతని కళ్ళలో నాకాసమయంలో

ఆఫీసువాళ్ళిచ్చే యూనిఫాం తప్ప వేరే బట్టలు తొడుక్కోని మల్లయ్య ఎవరైనా పిలిస్తే తప్ప క్యాంటీన్ మొహం చూడని మల్లయ్య, హవాయి చెప్పులు తప్ప మరొకటి వాడని మల్లయ్య ఈ మల్లయ్య తన పిల్లల్ని ఒకరిని వైజాగ్‌లో



ఇంజనీరింగ్, మరొకర్ని తిరుపతిలో మెడిసన్, ఇంకొకర్ని మదనపల్లెలో బి యస్ సి చదివిస్తున్నాడంటే సామాన్యమైన విషయం కాదు అతని కృషి వెనుక ఎంతో దీక్ష, పట్టుదల ఉండి వుండాలి

నీవేం చదివావు మల్లయ్యా?

టిఫన్ తినడం ముగించి ప్లేటులోనే చేయి కడుక్కుంటున్న మల్లయ్య విషాదంగా నవ్వాడు

వానాకాలం చదువు బాబూ నాది నా చిన్నతనంలో వేలాది రూపాయలు ఖరీదు చేసే తడిపొలాలు కలిగిన ఆసామీ మా నాన్న కానీ ఆయన ఊర్లు తిరగడానికీ త్రాగుడుకూ అలవాటు పడిపోయి మొత్తం ఖాళీ వేసేశాడు దాంతో మా సంసారం వీదిన పడినట్లయి పోయింది బాబూ!

చదువుకోవాలని నేను ఎంత తాపత్రయపడ్డానో నాకొక్కడికే తెలుసు కానీ చదివించేవారే కరువయ్యారు నాకు అమ్మ దిగులుతో జబ్బున పడిపోయిన మనిషి నాన్న త్రాగుబోతు, తిరుగుబోతు" తో బుట్టుపులెవరూ లేనివాడ్ని"

నోట్సులు కుట్టుకోవడానికి డజను తెల్ల కాగితాలు దొరికేవి కావు పెన్సిలు కొనుక్కోవడానికి కాణీ ఉండేదికాదు అచ్చు పుస్తకాలు అసలుండవు స్కూలుకు ఎలాగో వెళ్ళాలన్నా శుభ్రమైన దుస్తులు ఒక్క జత అయినా ఉండేవికావు

నిజం చెప్పాలంటే కడుపు నిండా తిండికీ, ఒంటి నిండా బట్టకీ, కంటి నిండా నిద్రకు నోచుకోని రోజులవి చివరికి ఆకలిని భరించలేక ప్రతిరోజూ బాగా చీకటిపడ్డాక నా జత పిల్లలు నన్ను గుర్తించకుండా ముసుగు కప్పుకొని వెళ్ళి నాలుగు వీదులలో అన్నం అడుక్కు తెచ్చుకొని నేను కాస్త తిని, అమ్మకు కాస్త పెట్టి, మరునాటి ఉదయానికి కాస్త దాచుకొనేవాడ్ని ఆ పరిస్థితులలో ఉన్న నాకు చదువు ఒకటా?

నా జతగాళ్ళందరూ ఒక్కో మెట్టే పైకెక్కి పోతుంటే కన్నీటితో వాళ్ళకు మనసులోనే శుభాకాంక్షలతో వీడ్కోలు చెప్పుకొనేవాడిని సంవత్సరాలు గడచిపోయాయి అలా అలా!

నా గుండె ఎండిపోయి, నా మనసు బండబారి పోయి, నా కళ్ళలో కన్నీరు ఇంకిపోయిన తరువాత చాల కాలానికి చిన్నతనంలో ఈ ఊర్లో నాతో పాటు చదివిన మురళీధర్ అనే మిత్రుడు ఈ ఆఫీసుకి గెజిటెడ్ ఆఫీసర్‌గా వచ్చాడు అతను ఈ ఊరు వచ్చిన మరునాడే నన్ను వెతుక్కుంటూ వచ్చాడు

అప్పటికి నేను ఓ కమ్మరి కొలిమిలో సమ్మెట బాదే ఉద్యోగం చేస్తున్నాను పొట్ట కూటి కోసం నా పరిస్థితి అంతా గ్రహించిన మురళీదర్ నాకు ధైర్యం చెప్పి తనే స్వయంగా ప్రయత్నం చేసి ఒక అటెండరు పోస్టు తెప్పించి నాకు ఇప్పించాడు తన పీరియడ్‌లోనే

అలా స్థిరపడ్డాను బాబూ ఈ ఉద్యోగంలో

నేను పడ్డ బాధలూ, ఆవేదనలూ, అశాంతీ నా పిల్లలు అనుభవించకూడదనే స్థిర నిశ్చయంతో నేను ప్రతి పైసాకీ విలువనిచ్చి కూడబెట్టటం

నేర్చుకొన్నాను అంతేకాదు పెంచి పెద్ద చేయడం కూడా నేర్చుకున్నాను

ఇంకో నాలుగు నెలల్లో నేను రిటైర్ అయిపోతాను కదా బాబూ? ఆ తరువాత నేనే పనీ చెయ్యనవసరం లేదు ఈ వడ్డీ వ్యాపారం కూడా మానేస్తాను' నా శేష జీవితం హాయిగా ప్రశాంతంగా గడచిపోతుంది

బాగా డబ్బుండాలి బాబూ' బాగా డబ్బుండాలి మనిషికి– డబ్బులేనినాడు ఎ సుఖమూ ఉండదు మనిషికి అంతేకాదు డబ్బులేని మనిష ఎందుకూ పనికిరాడు ఈ లోకంలో

నేను డబ్బు సంపాదించుకుని ఉండకపోతే నా పిల్లలు ఇంత పైకి ఎగబడేవారా? ఈ రోజు కూడా నా తల్లి బాగా ఆరోగ్యంగా తిరుగుతోంది' ఎందుకో చెప్పనా బాబూ?' కేవలం డబ్బు మహిమ డబ్బు లేకుండా ఉండి వుంటే నా తల్లి ఎప్పుడో చచ్చిపోయి వుండేది అనారోగ్యంతో

డబ్బు చేర్చుకున్నవాన్ని కాబట్టి నా చివరి రోజులు ప్రశాంతంగా రామా' క్రిష్ణా'' అనుకొంటూ గడిపివేయగలను ఇదీ బాబూ నా కథ' అంటూ ముగించాడు మల్లయ్య

నేను అతని వైపు చూస్తూ కూర్చుండిపోయాను అతను వడ్డీ వ్యాపారం చేస్తాడని తెలిసినప్పుడు అతనిమీద తేలిక రకం అభిప్రాయం ఎర్పరచుకున్నందుకు సిగ్గుపడ్డాను కూడా

ఈ లోకంలో ఒక్కో వ్యక్తి గొప్పదనం ఒక్కో రకంగా ఉంటుంది

మల్లయ్య గొప్పవాడు నిజానికి'

* * * * * *

ఆ తరువాత కూడా ఒకటి రెండు నగలు అజ్ఞాత వాసంలోకి వెళ్ళాయి

ఆటు తరువాత అనవసరంగా వడ్డీ ఎందుకండీ దండుగ? డబ్బున్నప్పుడు చేయించుకుందాం గానీ అమ్మి వేయండి అంటూ తరువాతవి ఒక్కటొక్కటే అందించడం మొదలుపెట్టింది సుగాత్రి చివరకి తాళిబొట్టు తో వున్న చైను తప్ప మరో బంగారం ముక్క లేకుండా పోయింది సుగాత్రి శరీరం మీద కమ్మలూ ముక్కుపుడకలూ కూడా ఇచ్చేస పాస్టిప్ పెట్టుకోసాగింది తను

నా చేతి వాచి ఉంగరం నా సైకిలు ఇంట్లోని ఫిలిప్స్ రేడియో టేపు రికార్డరు బట్టల బీరువా గ్రైండర్ కూడా అమ్మేశాను వరుసగా

అన్నీ అయిపోయిన తరువాత నా వాటా భూమి కూడా అమ్మేయాలనుకున్నాను కానీ నా పరిస్థితి తెలుసుకున్న మా ఆపీసరు మోటారు సైకిలు అడ్వాన్సు మ్యారేజి అడ్వాన్సు ఇలా ఆఫీసు ద్వారా ఇవ్వగలిగిన అప్పులు వరుసగా ఇప్పించి ఆదుకొని పల్లెలో తిండిగింజలు ఇస్తున్న భూమిని పోగొట్టుకోకుండా కాపాడాడు

నేను మా బామ్మను బ్రతికించుకోడానికి నా శాయశక్తులా ప్రయత్నిస్తూ తల్లక్రిందులయిపోతూ ఉంటే నా బంధువులలో స్నేహితులలో చివరకి మా ఆఫీసు స్టాఫులో కూడా చాలామంది నన్నో పనికిమాలినవాడి క్రింద జమకట్టి చులకనగా

# ఈ వేమన పద్యాలు




నీళ్లలోన నోడ నిగిడి తిన్నగ బ్రాకు
బైట మూరడైన బ్రాక లేదు
నెలవు దప్పు చోట నేర్పరి కొఱగాడు
విశ్వదాభిరామ వినురవేమ.

చూడ్డం మొదలుపెట్టారు

నేను వాళ్లెవరినుండీ ఎ ఆర్థిక సహాయమూ ఆశించకపోయినా కనీసం వారెవరికీ ఎలాంటి ఇబ్బందినీ కలిగించకపోయినా నన్ను అర్థవిహీనమైన ప్రశ్నలతో పనికిరాని మాటల ఈటిలతో గాయపర్చడమూ చిన్న అవకాశం లబించినా అవమానించడానికి ప్రయత్నించడమూ చెయ్యసాగారు

డార్విన్ థియరీని కళ్లకు కట్టినట్టు చూపిస్తున్న వాళ్లను చూస నవ్వాలో ఎడవాలో బాధపడుతూ కూర్చోవాలో అర్థంకాక సతమతం అయిపోయేవాడిని ఎదురు దాడి చేసే ఓపిక లేక ఎంత ఆలోచించినా వాళ్ల సంస్కారరాహిత్యానికి కారణాలు అవగతం అయ్యేవికావు

చివరికి అన్నయ్యగారికీ తమ్ముళ్లకూ కూడా ఇదంతా విసుగ్గా తయారయినట్లుంద వయసు అయిపోయిన ముసలి వ్యక్తి కోసం ఇంత డబ్బు తగలెయ్యడం వృదా అనే బావన వాళ్లలో తలయెత్తి ఉండాలి నాతో ధైరెక్టుగా ఎమీ అనకపోయినా వాళ్ల ముబావం చూసి నాకు అనుమానం వచ్చేసంది నా అనుమానం నిజమో కాదో ఆ బగవంతునికే తెలియాలి కానీ నేను చెయ్యగలిగింది మాత్రం ఏమిటి ఆ పరిస్థితులలో?

అయితే బగవంతుడు గొప్పవాడు' వాడి దయవల్ల నా పట్టుదల నెగ్గింది యమబటుల్ని వెనక్కి తరిమికొట్టి సంపూర్ణ ఆరోగ్యం పొంది నోరారా రామబజన చేస్తూ బామ్మ ఇంటికి తిరిగి రావడానికి తరువాత అట్టే రోజులు పట్టలేదు

(ముగింపు పై వారం,

పాఠకుల శీర్షిక

# గర్భస్థ శిశువు చెప్పిన కథలు

## "దీనగాధ"

ఆ రోజేకాదు ప్రతీ రోజూ వ్యాపార విషయాల వలన నేను చాలా బిజీగా ఉండటం నాకు అలవాటుగా మారిపోయింది వర్క్ కొంచెం తెంపు అవటంతో కాఫీ సిప్ చేస్తూ ఫైల్స్ చూస్తున్నాను

దండంబాబు మొరటుగా నైనా సున్నితమైన గొంతు వినబడటంతో తలెత్తి చూసాను

ఎదురుగ ఎనిమిదేళ్ళ బాలిక చేతులు కట్టుకొని భయం భయంగా నా వైపే చూస్తోంది

ఏం కావాలి నీకు ఎవర్నువ్వు కొద్దిగా గట్టిగానే అడిగాను నేనడిగిం దానికి బాలిక భయ పడిందేమో ఏడుపు మొఖం పెట్టేసింది

నల్లగా మాసిన చినుగు బట్టలు



ఆ పాప పసిమిచా యకు ప్రకృతి మాత ఇచ్చిన పాల బుగ్గలకు ఏ మాత్రం అడ్డురావటం లేదు

నాపేరు మల్లి బాబు మా అయ్య మా అమ్మ నన్ను సిన్నప్పుడు వదిలి పెట్టి పోయిన్రు రైలు టేషన్లో తాత దగ్గరే ఉంటున్నా' బాబు మీ ఇంట్లో పనులు సేత్తా కొంచెం కూడు పెట్టండి కళ్ళల్లోంచి జారుతున్న కన్నీటిని ఆపాప తుడుచుకోలేదు

ఆ పాప దీనత్వాన్ని చూసి నాలో సహజ మైన జాలి మేల్కొంది

మీ అమ్మా నాన్న ఇప్పుడెక్క డున్నారు? కాఫీ త్రాగటం మరచి పోయేను

మా అయ్య సచ్చి పోయినాడంట మా అమ్మ ఎక్కడో కూలిపన్జేస్తాం దంట ఆ ఇసయాలన్నీ మా తాతకు తెలుసు"

మీ అమ్మ దగ్గరకు పంపిస్తాను వెళ్తావా?

వద్దు బాబు వద్దు అది మాయమ్మ కాదు నన్ను ఈ నరకం లోకి లాగింది మాయమ్మ ఎలా అవుతుంది బాబు

నేను పెద్దగా ఆశ్చర్య పోవటం అదే మొదటి సారనుకుంటా ఆ బాలిక ముఖ కవళికలలో చాలా మార్పు వచ్చిందని గ్రహించ గలిగాను

నిన్ను మీ అమ్మ నరకంలోకి లాగిందా? కన్న తల్లిని అలా అనచ్చా? లాలింపుగా మంద లించాను

చాలా సేపు నుంచోటం వల్ల కాళ్ళు నొప్పి కలిగించాయేమో పక్కగా ఉన్న బల్లపై కూర్చుని ఆ చిన్నారి హృదయం ఓ వేడి నిట్టూర్పు విడిచింది

ఫైల్ సంగతి మరచి పోయాను

ఆపాప చెప్పటం మొదలెట్టింది

అవును బాబు నన్ను ఈనరకం లోకి లాగింది మాయమ్మే తొమ్మిదేళ్ళ క్రితం నేను మాయమ్మ కడుపులో పడంగానే బయటి ప్రపంచకం విషయాలు తెలుసుకున్నాను

ఆకలి మంటల కీకారణ్యంలోకి నన్ను లాగొద్దని స్త్రీని కుక్కకంటే హీనంగా చూస్తోన్న ఈ లోకంలో నాకు జన్మ ఇవ్వద్దని ఎంతో వేడుకున్నాను, మరెంతగానో రోదిం చాను కాని నాగోల ఎవరూ వినలేదు

అప్పుడు మా అయ్య గవర్మెం టోరి నౌకరి చేసే వాడుట అదే నాకు చెప్పి నిన్ను కష్టపెట్టకుండా అన్నయ్యల్లాగానే పువ్వుల్లో పెట్టి పెంచు తామని చెప్పేరు

నేను ఈ భూమి మీద పడేసరికి మా అయ్య కాలిరిగి నౌకరి పోయిందట

ఇక అప్పుడు నన్ను పెంచ లేక రైలుటేషన్లో అడుక్కునే తాతకు ఇచ్చేసినారంట

ఆ చిన్నారి హృదయం ఎంతగా కుమిలిందో కన్నీటి సెలయేళ్ళైన ఆ పాప కన్నీరు జాలు వారుతూ చిరిగిన గౌనును తడుపుతున్నాయి

నా చెయ్యి బెల్పై పడింది పరిగెత్తుకుంటూ వచ్చాడు ప్యూన్

ఈ అమ్మాయిని మా ఇంటికి తీసుకెళ్ళు ఆర్డరిచ్చాను

వాడు ఓ సారి నావైపు ఆశ్చర్యంగా చూడటం నేను గమనించక పోలేదు

నా ముద్దుల రోజీని మల్లిని ఒకే స్కూల్లో చేర్పించాలి అనుకుంటూ ఫైలు వైపు చూసేను

కొన్ని అక్షరాలు తడిసి ఉన్నాయి

అవి నా కన్నీటితోనే

–బాణావతు శ్రీనివాస్,
కోలపల్లి ఈశ్వర్ నెల్లూరు □

కూపన్

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

గర్భస్థ శిశువు చెప్పిన కథలు

కథ వ్యాసం రాసిన వారి పేరు ____________

____________

పూర్తి చిరునామా ____________

పిన్ కోడ్ ____________




(గత సంచిక తరువాయి)

నాగభూషణం విరాగిగా తిరుగుతున్నాడు

ప్రచారం చేయడానికి మేమతనికి ఒక దారి నిర్దేశించాము వెళ్లేటప్పుడు ఏయే వీధులలోంచి పోవాలో ఎక్కడ నిలబడి ప్రచారం చేయాలో చెప్పాము మిగిలిన బాధలన్నీ అతనే పడాలి ఒక పైసా కూడా నాగభూషణం జేబులోంచి తీసి యివ్వలేదు

మధ్యాహ్నం ఒంటి గంటకు భోజనాలు గదిలోకి తెప్పించుకున్నాము తరువాత ఒక గంట విశ్రాంతి మూడు గంటలకు నాగభూషణం ఎవరినో కలియడానికి వెళ్తానన్నాడు నేను కూడా ఒకసారి రాజశేఖరం ఎటువంటి ప్రచారం చేస్తున్నాడో చూసి వస్తానని బయలుదేరాను నాగభూషణంతో సాయంకాలం అయిదుకి హోటలుకి తిరిగివస్తానని తరువాత ఇద్దరం కలిసి ఏడు గంటలకు థియేటరు చేరుకుందామని చెప్పాను దానికతడు అవుననలేదు కాదనలేదు

ఉదయం కాళేశ్వరరావు మార్కెట్టు కనకదుర్గ గుడి దిగువ ప్రాంతాలలో ప్రచారం ముగించుకొని ఈవేళకు రాజశేఖరం మొగల్రాజపురం చేరుకుంటాడు అక్కడ సాయంకాలం అయిదు వరకు ఉంటాడు తరువాత లబ్బీపేట మీదుగా రాత్రి ఏడు వరకూ ప్రచారం చేసి ఎనిమిది గంటలకు తిన్నగా థియేటరు చేరుకుంటాడు

రిక్షా చేయించుకొని మొగల్రాజపురం బయల్దేరాను అక్కడికి చేరేసరికి మూడున్నర అయింది అక్కడ కొంచెం విశాలంగా ఉన్న చోట ఒక రిక్షా ఆగి ఉంది ఆ రిక్షాలో ఒక ఇరవైమూడేళ్ల మనిషి కూర్చున్నాడు గొంతు సవరించుకొని అతను ఉపన్యాసం మొదలుపెడుతున్నాడు

ఓ మహాజనులారా!! మీరెంత అదృష్టవంతులు ఈ రాత్రి ముగ్గురు గొప్ప నటులు రంగస్థలం మీద తమ కౌశల ప్రదర్శన చేస్తున్నారు ఆంధ్రదేశంలో వాళ్ళు అగ్రగణ్యులు హరిశ్చంద్ర పాత్ర ధరిస్తారు వాళ్లలో ఎవరు గొప్పగా నటిస్తారో వారికి మహానట బిరుదం ప్రదానం చేస్తారు నటుడు చిన్నప్పటి నుంచి కలలు కంటాడు చాల గొప్పవాడినైపోదామని అదే ఆశ అతనిని ముందుకి నడిపిస్తుంది ఈ ప్రపంచమంతా పెద్ద నాటకరంగం – మనమందరం అందులో పాత్రదారులం అటువంటప్పుడు రంగస్థల నటుడికి జీవిత యాత్రలో సాగే నటుడికి భేదమేముంది?? రంగస్థల నటుడు తన గాడిబట్టిన జీవితాన్ని నటించడు ఇంకెవరివో గొప్పవాళ్ల పాత్రలు నటిస్తాడు అది నటన – జీవితం కాదు ఆ నటన జీవితానికి ఎంత సమీపంగా ఉంటే అంత అద్భుతంగా ఉంటుంది ఎవరో నాగభూషణంగారు హరిశ్చంద్ర వేషం వేస్తున్నారని పరీక్షలకు చదవడం మానేసి రాత్రంతా నాటకం చూశాను అప్పుడెంత – టిక్కెట్టు రూపాయే కదా – అప్పుడే నాగభూషణంగారి హరిశ్చంద్ర నాటకం చూశాను పక్క పక్క ఊళ్ల నుంచి ప్రజలు బళ్ళు చేసుకు వచ్చారు నాగభూషణం గారికి అప్పటికే ఆరు బిరుదులున్నాయి అతనికేం? మహరాజు – మహారాజు వేషం వేస్తే ఆనాటి మహారాజులు కూడా అతనికి తీసికట్టే కదా! అప్పటి నుంచీ అతనిదొకటే గుణం – తన వేషం తనే వేసుకుంటాడు దానిన్ని పెండాలు దాకా మోసుకొస్తాడు అవేం పద్యాలు – అవేం రాగాలు! అవేం మాటలు – ఆ రోజుల్లో మైకులున్నాయా? అతను పద్యం చదువుతుంటే ఆఖరున కూర్చున్న ప్రేక్షకుడికి కూడా చాల స్పష్టంగా వినిపిస్తుంది అందరు అలా నిశ్శబ్దంగా కూచొని ఒళ్ళు మరచిపోయేవారు

ఏదేది – అదే పద్యం – మెడలో మాంగల్యం చూసి – ఆ చంద్రమతి మెడలోని పుస్తెలు మరెవ్వరికీ కనపడవు – అప్పుడు పద్యం చదువుతాడు

రాజశేఖరం ఆ పద్యం చదువుతున్నాడు చుట్టూ ఉండే ఖాళీస్థలమంతా నిండిపోయింది ఆ పద్యం అచ్చంగా నాగభూషణం చదివినట్టే ఉంది చివరను రాగం ఒక పావు గంటవరకు లాగించి ప్రజలు ఉబ్బితబ్బిబ్బయ్యేటట్టు చదువుతున్నాడు

నేను నా రిక్షాను కొంచెం దూరంలో అతనికి సులువుగా కనిపించని దూరంలో ఉంచి వింటున్నాను

జరిగిన కథ – 9 నాగభూషణంతో వివాహానికి రాగలత మహానటు పోటీలో పాల్గొనడం షరతుగా పెడుతుంది మహానట పోటీల్లో నాగభూషణం బహుమతి గెలుచుకుంటాడు బహుమతి అందుకునే సమయానికి పెరాలిసిస్ స్ట్రోక్‌తో పడిపోయిన నాగభూషణాన్ని కొవ్వూరు తీసుకు వచ్చి శుశ్రూష చేస్తుంటుంది రాగలత శుశ్రూష క్రమంలో నాగభూషణాన్ని తీర్చిదిద్దినది రాజశేఖరమని రాగలతకు అర్థమవుతుంది రాజశేఖరానికి ఉత్తరాలు వ్రాయడం మొదలు పెడుతుంది రాగలతకు మహానట పోటీ ముందు రాజశేఖరం కనిపించిన సంఘటన గుర్తు కొస్తుంది

ఆ హరిశ్చంద్రుడు మరో పద్యం చదువుతాడు ముందో వెనుకో – అకటా – చేరెడు నేలకుండగడె

ఆ పద్యం ముందు చదివిన దానికన్న అద్భుతంగా ఉంది జనం ఇంకా పెరుగుతున్నారు అంతటితో ఆగిపోయాడు!

చంద్రమతి ఆ వేషం వేసినావిడ ఎటువంటిదనుకున్నారు పంచ కావ్యాలు చదువుకుంది సంగీతం నేర్చుకుంది గజ్జె కడితే ముజ్జగాలను నిలబెడుతుంది కాని ఆవిడ తనకుండే విద్యలేం అక్కడ ప్రదర్శించలేదు కొడుకు కనిపించలేని తరుణంలో ఆమె రాగాలతో సాము చేస్తుందా? ఆమె చదివిన ఒక్క పద్యం చాలునయ్యా! హృదయమున్న మనిషికి కళ్లంట జలజల నీళ్లు కారకుండా ఉంటాయా

అపుడు రాజశేఖరం పద్యం ఆఖరి పాదాలు రెండూ ముందు చదివాడు

నీ కుమారుని బోలిన నా కుమారు

వేగ కాన్పింప జేయవో విశ్వనాథ

ఆ రెండు పాదాలు చదివి తిరిగి పద్యం మొదటి నుంచి చదవడం మొదలుపెట్టాడు

జలదమా



# రాగలత

ఆ పద్యం వింటూ ప్రజలు చేష్టలు దక్కి నిలిచిపోయారు

చాల గంభీరంగా ఉంది వాతావరణం ఇంకా అతను చదివే పద్యాలను వినాలని ప్రజలు ఎదురు చూస్తున్నారు

ఇంకా చాలా మంచి పద్యాలున్నాయి మీరందరూ ఈ రాత్రి జరిగే పోటీ నాటకాలకు రండి గొప్పవాళ్లెవరో మీరే నిర్ణయించండి మీ అభిమతానికి అనుగుణంగా ఉన్న నాటకం హరిశ్చంద్ర

అక్కడితో మొగల్రాజపురం ప్రచారం అయిపోయింది సాయంకాలం అయిదు గంటలవుతోంది థియేటరుకి ఏడున్నరకి వెళ్లాలి ఇంకా చాల వేళ మిగిలింది తరువాత ప్రచార స్థానం లబ్బీపేట అక్కడ కూడా విని వెళ్లిపోవాలని అనుకున్నాను

రాజశేఖరం మధ్యాహ్నం భోజనం చేశాడో లేదో పొద్దున్న టిఫిన్ కూడా సరిగా చేయలేదు రాత్రంతా శ్రమపడి ప్రయాణం చేసి వచ్చాడు పొద్దున్న పది దగ్గిరనుండీ ప్రచారంలోనే మునిగిపోయాడు ప్రచార సామగ్రి ఏముంది? రెండు స్పీకర్లు – అంప్లిఫయరు – బేటరీ సెట్ – అదే రిక్షా ఆక్రమించింది దాని వెనుక రాజశేఖరం నడుస్తున్నాడు నిర్ణీతమైన స్థలం దగ్గిర ఆగి మైకు ముందు చెప్పవలసినవి చెప్తున్నాడు ఇంకెవరూ ఈ విధంగా శ్రమపడరు ఈ నాగభూషణం ఎంత స్వార్థపరుడు

నా రిక్షా కూడా మెల్లిగా లబ్బీపేట చేరుకుంది

రాజశేఖరం తన సరంజామా సిద్ధం చేసుకొని ఉపన్యాసం మొదలుపెడుతున్నాడు

ఈ విజయవాడ పౌరులెంత అదృష్టవంతులు! దేశంలో మకుటాయమానమయిన రంగస్థలంపై ముగ్గురు ఉత్తమ నటులు ఈ రాత్రి ప్రదర్శనలిస్తున్నారు వారిలో ఒకరికి మహానట బిరుదం లభిస్తుంది ఒకే నాటకం హరిశ్చంద్ర మహారాజు వేషంలో వాళ్లు మీకు దర్శనమిస్తారు ఈ మధ్య అంటే నాలుగు సంవత్సరాలయి ఈ బిరుదానికి అర్హులైన నటులే దొరకలేదు ఈ రోజుల్లో నటులంటే సినిమా నటులనే అర్థమిస్తుంది రంగస్థలానికో ప్రత్యేకత ఉంది అందుబాటులో ఉండే సాధన సామగ్రి చాల పరిమితమైనది తొందర తొందరగ డ్రెస్సులు మార్చుకోవాలి సీనులు మార్చుకోవాలి మైకుల ముందు తక్కువ స్థలంలో తిరుగుతూ నటించాలి ఇన్ని ఇబ్బందులు పడుతూ ఈ రంగస్థల నటులు ఏదో సాంప్రదాయాన్ని పునరుద్ధరించాలని ఈ కళను సజీవ సమాధి చేయడం సహించలేక మీ అందరి సహకారాన్ని కోరుతున్నారు మహానుభావులు కపిలవాయి రామనాథశాస్త్రి వేమూరి గగ్గయ్య మాధవపెద్ది కన్నాంబ సురభి నాట్యమండలివారు బందావారు స్థానంవారు రంగస్థలానికొక గౌరవం సమకూర్చారు వారి బాణీలు మీరొక్కసారి వినండి – ఒళ్లు పులకిస్తుంది




తరువాత రాజశేఖరం ఆ ప్రఖ్యాత నటుల పద్యాలు చదివాడు వాళ్ల పాటలు పాడాడు పద్యంలో గమనం అర్థ విశ్లేషణ రాగచ్ఛాయలు ఒకటేమిటి వాళ్లు ఎన్నో ఏళ్ల క్రింద వేలాది ప్రేక్షకుల హృదయాలలో సంచలనం కలిగించిన ఉత్తమమైన పద్యాలు ఈనాడు అంత స్ఫూర్తివంతంగానూ చదివి వినిపించాడు

వింటున్న వాళ్లందరూ ముక్కుల మీద వేళ్లు వేసుకుంటున్నారు

ఆ నటుల పేరులే వినని యువతరం అంత గొప్పగా వాళ్లు పాడారా అని అబ్బురపడ్డారు

అన్నీ వినిపించి చివరకు రాజశేఖరం అన్నాడు

ఎవరి బాణీ వారిది ఏ పూవు అందం ఆ పూవుదే – ఏ కుసుమ సౌగంధ్యం ఆ సుమానిదే అనంతమైన వర్ణ సమ్మేళనంలో ఏ పుష్ప శోభ ఆ పుష్పానిదే ఒకటి మంచిదని మరొకటి కాదని చెప్పలేము నా బాణీ కూడా వినండి

అపుడు రాజశేఖరం కృష్ణలీలల నుండి ఒక పద్యం చదివాడు నిజానికది భాగవతంలోనిది

నల్లనివాడు – పద్మ నయనంబులవాడు

ఆ పద్యం ఎంత లలితంగా ఉంది? ఎంత మధురంగా ఉంది! ఎంత రమ్యంగా ఉంది! ఎంత మనోజ్ఞంగా ఉంది! ఎంత అద్భుతంగా ఉంది

ఎంతమందో జనం అందరూ ఆ పద్యం విని అమృతం తాగి తృప్తులైనట్లు పరబ్రహ్మను దర్శించి పునీతులైనట్లు అనుభూతిని పొందుతున్నారు నాలో నాకే నవ్వు వచ్చింది నాలో కలిగిన ఈ మార్పులు అందరికీ కలిగాయని అనడం సమంజసమేనా? నేనేం చేయను వాళ్ల ముఖాలు ఈ మార్పులన్నీ దాచడంలేదు

రాజశేఖరం చాల గొప్పవాడు శ్రోతల హృదయాలను తన గుప్పటలో ఉంచుకొని వాళ్లా భ్రమనుండి తేరుకోక పూర్వమే మెల్లిగా తన బాణీ ఒకటి వాళ్ల మనసుల్లో ముద్రవేసి జారుకుంటున్నాడు ఈ ప్రచార విధానం నాకు చాల కొత్తగా కనిపించింది

ఆలోచిస్తూ కూర్చున్నాను నా రిక్షాలో

లబ్బీపేట ఉపన్యాసంలో ఈ రాజశేఖరం మహానట బిరుదం పొందడానికి సిద్ధంగా ఉన్న నాగభూషణం గురించి ఒక మాటైనా అనలేదు ఈ పద్యాలు చాలమట్టుకు నాగభూషణం పాత్రలకు సంబంధించనివి అంటే అతను మెచ్చనివి అన్నిటికీ మించి తనకో బాణీ ఉందని అప్రయత్నంగా ఇతను బయటపడుతున్నాడు ఆ పద్యం చదవడం బాణీయే కొత్తది సమ్మోహనాస్త్రం వేసినట్లు శ్రోతలను కట్టి పడేసింది వాళ్లు ఇంకా ఇంకా వినాలని ఉత్సాహంగా ముందుకొస్తుంటే ఇతను చల్లగా రంగం నుండి ఉపక్రమిస్తున్నాడు

చేతికుండే రిస్టు వాచీ చూసుకున్నాను అప్పుడే ఆరు గంటలయిపోయింది నాకోసం నాగభూషణం ఎదురు చూస్తుంటాడు కాలం ఎంత వేగంగా పరిగెడుతున్నది వెంటనే వెళ్లిపోవాలనుకున్నాను కాని కాళ్లాడడంలేదు ఈ రాజశేఖరం చెప్పినది రెండు చోట్ల విన్నాను ఒక చోట చెప్పినట్లు రెండో చోట చెప్పలేదు అంతా కొత్తగానే ఉంది చదివిన పద్యం చదవడంలేదు పాడిన పాట పాడడం లేదు అతని మాటలు ఎంత లోతులకు పోతాయి!

ఏడు గంటలు కొట్టగానే అతను కూడా దుకాణం కట్టేశాడు

ఆఖరి ప్రచారోపన్యాసం వింటే ఇంకా అతని గురించి బాగా తెలుసుకోవచ్చు నాగభూషణానికేదో సమాధానం చెప్పవచ్చు ఈ అవకాశం మాత్రం జారవిడుచుకోలేను

ఆఖరి మజిలీ సూర్యారావుపేటలో అక్కడ పెద్ద పెద్ద యిళ్లు – ఆ యిళ్లలో సంపన్న కుటుంబాలు అక్కడ వినేవాళ్లెవరుంటారు? అక్కడెందుకు ఆఖరి ఉపన్యాసం ఏర్పాటు చేశారు?

క్రమంగా వెలుగు తగ్గుతోంది

రాజశేఖరం రిక్షా మెల్లిగా నడుస్తోంది దాని వెనుక అతను అతను నడుస్తున్నాడు మరో రిక్షా వేయించుకొని పోవలసింది ప్రచారం చెయ్యమని చెప్పడమే నాగభూషణానికి తెలుసు ఇచ్చిందిలేదు అతనికి ఎక్కినట్టు లేదు అతని దగ్గిర డబ్బుందో లేదో? నాకేనా కొంత బుద్ధి పుట్టవలసింది ఆ యిద్దరి మధ్య నేను తొందరగా ఏ నిర్ణయం తీసుకోలేకపోయాను ఏం చెయ్యడం అతనిని సమీపించి ఏ హోటలులోనో కాఫీ అతనితో తాగితే బాగుంటుందేమో! అప్పుడే

అరుంపావు – సరిగ్గా ఏడు గంటలకు ప్రచారం ముగింపోవాలి సంస్థకు చెందిన మనుషులు ప్రతి విషయం చాల శ్రద్ధతో గమనిస్తున్నారు

నేను సూర్యారావుపేట చేరేసరికి అప్పుడే రాజశేఖరం మైక్ అమర్చి మాట్లాడడానికి సద్ధంగా ఉన్నారు రెండు రోడ్లు ఒకదాన్నొకటి క్రాస్ చేస్తున్నాయి ఒక మూలకు కొంతమందేనా నిలబడడానికి చోటుంచి రాజశేఖరం మైకు సరిచేశారు

హాయిగా యిళ్ళలో ఉన్న సంపన్నులారా! మిమ్మల్ని కొంతకాలం ఇబ్బంది పెట్టవలసి ఉంది ఓర్పుతో మీరీ రెండు మాటలు వింటే నా ప్రచార కార్యక్రమం ముగుస్తుంది మరి కొద్దిసేపటిలోనే పోటీ నాటకం హరిశ్చంద్ర మొదలవుతుంది తినబోయే కూరకు రుచి అడగడమేమంటారో! దాని గురించి మీకు కొంచెం చెప్తే మీరు ఇంకా ఆనందిస్తారు హరిశ్చంద్ర పాత్రను ముగురు నిర్వహిస్తున్నారు చూచిన నాటకమే మళ్లా మళ్లా అదే స్టేజి మీద చూస్తే విసుగనిపించదా? బహుశా ఈ హరిశ్చంద్ర నాటకం కొన్ని వేలసార్లు ఆడి ఉంటారు చూచినవాళ్లే చూస్తున్నారు వాళ్లే ఒకే బిగిని ముగ్గురు నటులు ఏ విదంగా స్టేజి మీద రాణిస్తారో చూడడానికి తొందరపడుతున్నారు ఈ నాటకంలో నాయకుడు అంటే హీరో హరిశ్చంద్రుడు అతడు చక్రవర్తి ఆడిన మాట తప్పకుండా ఉండడం కోసం ఏ మానవుడూ ఊహించలేని బాధలకు లోనవుతాడు అందుకోసం ఎంతేనా త్యాగం చేస్తాడు రాజ్యం బార్య బిడ్డ అన్నీ పోయి మరుభూమిలో బానిసగా పనిచేస్తాడు కాబట్టి ఇతను సామాన్యమయిన నాయకుడు కాదు మహా నాయకుడు మహానాయకుడు సాధారణంగా ధీరోదాత్త నాయకుడయే ఉంటాడు ధీరోదాత్తుడి గుణాలు చిత్తగించండి ఈ నాయకుడు అతి గంబీరమైనవాడు మహాసత్త్వుడు అంటే మహా బలశాలి క్షమాశీలుడు స్థిరబుద్ధి అవికత్థనుడు అంటే ఆత్మ ప్రశంసను చేసుకోనివాడు వినీతుడు ధర్మము వేపే మనసు కలవాడు చేసిన ప్రతిజ్ఞను చివరి వరకు పాలించవలసినవాడు లోక వ్యవహారం శాస్త్రం తెలిసినవాడు వాంగ్మి అంటే సంబాషణాదక్షుడు – ఇవన్నీ అతని శీలానికి సంబందించిన గుణాలు ప్రకృతి ననుసరించి ఈ మహా నాయకుడు ఉత్తముడు సాత్విక గుణసంపన్నుడు ప్రియంవదుడు శూరుడు తేజస్వి – ఇలా చెప్పుకుపోతుంటే ఎన్నో ఉన్నాయి

సుందర్ గుణ – మందిర్ యువా యువతి బిలో కైం జాహి

కవితా – రాగ – రసజ్ఞ జో నాయక కహియే తాహి అంటాడు జ్ఞాన వినోదుడు మహా నాయకుడి వేషం వేసే నటుడు ఈ గుణాలన్నీ రంగస్థలం మీద చూపించడానికి ప్రయత్నిస్తాడు అలంకార శాస్త్రజ్ఞులో మాటన్నారు మహానటుడి గుణగణాలు అతడు దరించే మహానాయకుల పాత్రల గుణాలకు విరుద్ధంగా ఉండవు అంటే ఎవరయితే రంగస్థలం మీద నిజజీవితంలోను ఈ సద్గుణాలు కలిగి ఉంటారో వారే మహానట బిరుదానికి అర్హులు

మహా నాయకులలో రాముడు జీమూతవాహనుడు యుధిష్ఠిరుడు వస్తారు ఈ హరిశ్చంద్రుడు కూడా వారితో సమానమయినవాడే ఆ వేషం వేస్తున్న నటులలో కొన్ని ఉత్తమ గుణాలున్నా ఈ మహానట బిరుదం వారికివ్వచ్చు ఇది రహస్యం మచ్చుకి రెండు పద్యాలు చదువుతాను వినండి

అప్పటికే చాలమంది పోగయారు పద్యాలు చదవడంతో జనం ఇంకా వచ్చారు గుమ్మాలలో డాబాల మీద ఆడవాళ్ళు నిలబడి వింటున్నారు వీదులలో జనసంచారమే అంతగా ఉండదన్న చోట ఉన్నవాళ్లే అందరూ ఒళ్ళు మరచిపోయి వింటున్నారు

సరిగ్గా ఏడయింది

నమస్కారం అందరికీ పెట్టి రాజశేఖరం ప్రచారం సమాప్తి చేశాడు

మరో అయిదు నిముషాలలో ఎక్కడివాళ్ళు అక్కడికి వెళ్ళిపోయారు

అతని రిక్షా ముందు – దానికి అర ఫర్లాంగు దూరంలో నా రిక్షా – నా ఆలోచనలన్నిటిలోను రాజశేఖరమే ఉన్నాడు నాగభూషణం గురించి హోటలు చేరిన తరువాత జ్ఞాపకమొచ్చింది అప్పటికి ఏడున్నర దాటి పోయింది

తొందరగా మా గదుల దగ్గరికి పరుగెత్తాను నాగభూషణం గది తలుపు తాళం వేసి ఉంది తొందరగా నా గది తెరచి ఒళ్ళు కడుక్కొని చీర మార్చుకొని వీధిలోకి వచ్చాను రాజశేఖరం వస్తాడేమోనని అయిదు నిముషాలు వేచి ఉన్నాను అప్పుడు జ్ఞాపకం వచ్చింది అతను మైకు అప్పజెప్పడానికి

# రాగలత

కాళేశ్వరరావు మార్కెటు వేపు వెళ్ళిపోయాడని – ఎప్పుడొస్తాడు, ఎక్కడికొస్తాడు? నాకు వేటికీ సమాధానాలు లేవు.

అప్పటికే ఎనిమిదయింది. నాగభూషణం ఏం చేస్తున్నాడో?

ఆటో చేయించుకొని థియేటరు చేరుకున్నాను. ముగ్గురు నటులకు మూడు వేరే వేరే గదులిచ్చారు. ఒకరికొకరికి సంపర్కంలేదు. మాకిచ్చిన గది తలుపు తట్టాను. లోపల గడియలేదు. తలుపు తోసుకొని లోపలికి ప్రవేశించాను.

నా కళ్లను నేనే నమ్మలేకపోయాను.

హరిశ్చంద్ర మహారాజు టేబిలు దగ్గర కుర్చీ మీద కూర్చున్నాడు. వేషం పూర్తి అయింది అతడు బ్రాందీ సీసా నుండి గ్లాసులోకి మధువు పోసి, దానిలో సోడా కలుపుకుంటున్నాడు.

రమారమి సంవత్సరం పైగా అతనితో తిరుగుతున్నాను. ఒకనాడు నాకతడు తాగినట్లు తెలియలేదు.

నాగభూషణం!" ఉరిమాను.

అతను తలెత్తి నావేపు చూశాడు. జవాబు చెప్పకుండా గ్లాసు ఖాళీ చేశాడు.

ఏమిటీ ఆగడం? అప్పుడే మొదటి నటుడు రంగస్థలం మీద ఉన్నాడు. నువ్వు రెండోవాడివి. 'మహానట' బిరుదం పొందవలసిన వాడివి. ఇది నీకు తగునా?

అతను మరో గ్లాసు నిండా సోడా పోస్తున్నాడు.

తొందరగా ఆ గ్లాసు తీసి విసిరేశాను.

రాగలతా! ఈ విషయంలో నన్నడ్డడానికి నీకు అధికారం లేదు. ఎప్పుడు తాగాలో ఎప్పుడు తాగకూడదో నాకు తెలుసు. అనుకున్న ప్రకారం అన్నీ జరిగితే ఈ తాగడం అనవసరం. ఇప్పుడు చాలా అవసరం."

ఇప్పటికి తాగింది చాలు. ఆపు!

చాలదు. నేనన్నీ మరచిపోయేదాకా తాగాలి."

టేబిలు మీద సోడాబుడ్లు పక్కకు పెడుతున్నాను. అతను బ్రాందీసీసా తీసుకొని ఎ నీళ్ళు, సోడా కలపకుండా సీసాలో మిగిలినదంతా తాగేశాడు.

నాగభూషణం! నువ్వు ఇంత అసహ్యకరంగా ప్రవర్తిస్తావని నేను కలలో కూడా అనుకోలేదు. ఎందుకింత తప్పు పని చేశావ్?"

నాగభూషణం అంత మైకంలోను నవ్వాడు.

రాగలతా! నిజం అంత వేగం తెలుస్తుందా? దానికోసం ఎంత శ్రమ పడాలి

అతని మాటలు నాకప్పుడు అర్థంకాలేదు.

ఆరు నెలల తరువాత నాకు తెలిసింది. అప్పటికి అన్నీ అయిపోయాయి. నా హృదయం ఎవరికో సమర్పించుకున్నాను.

అప్పటికి తొమ్మిది గంటలయింది.

రాజశేఖరం జాడ కనిపించడంలేదు. ఏం చేయడం? 'మహానట' బిరుదం మీద చాలమంది రసికులు పందాలు వేశారు. ధర్మయ్య మీద పదివేలు, వీరభద్రరావు మీద అయిదు వేలు, నాగభూషణం మీద వేయి రూపాయలు.




ఎవరు పోటీలో గెలిస్తే వారికి పందెం మొత్తంలో సగం భాగం యిస్తారు. మిగిలినది పందెంలో గెలుపొందినవారు పంచుకుంటారు.

ఈ పందెం మాట అటుండనీయండి.

సరిగ్గా పదకొండు గంటలకు నాగభూషణం స్టేజి మీద ఉండకపోతే ఎంత గొడవ జరుగుతుంది. హాలు నిండా కిక్కిరిసి కూర్చున్నారు. స్టేజి విరగ్గొడతారు. నాగభూషణం చర్మం వొలుస్తారు. అతని సెక్రటరీనని బహిరంగంగా నన్ను రేప్ చేస్తారు.

ఏమీ తోచడంలేదు. ఇంకెక్కడినుంచి తీశాడో నాగభూషణం – మరో సీసా – గడగడ సగం దాకా తాగేశాడు. గుద్దు పగిలి చచ్చిపోతాడు. ఓ భగవంతుడా ఏం చేయడం?

అతని చేతులోనున్న సీసాను బలవంతంగా లాక్కొని మిగిలిన బ్రాందీని సింకులో పోశాను. గదంతా బ్రాందీ వాసన గుప్పుమని వ్యాపించింది.

మత్తు తలకెక్కింది. నాగభూషణం లేచి నిలబడ్డాడు. నిలబడలేక సోఫా మీద పడిపోయాడు.

పడిపోతూ నాటకంలో డైలాగొకటి అందుకున్నాడు. లేచి కూర్చున్నాడు. నేను ఏ తాగుడునయితే అసహ్యించుకొంటానో. ఏ అసందర్భప్రలాపాలను వినదలుచుకోనో అవన్నీ తప్పడంలేదు.

నేను దేనికీ విచారించలేదు. ఈ నటులందరికీ తాగే దుర్గుణం స్టేజి ఎక్కిన దగ్గర నుంచీ ఉంటుంది. స్టేజి ఫియర్ లేకుండా ఉండాలని మొదలు పెట్టి, వాళ్ళు క్రమంగా సారా బట్టీలను ఆపోశనం పడతారు. కాని నాటకమాడ వలసినప్పుడు కొంతలో కొంతేనా అదుపులో ఉంటారు. ఈ నాగభూషణం అన్ని హద్దులను అతిక్రమించాడు.

ఏం చేయడం?

అన్నిటికన్నా ముఖ్యం రసాభాస కాకుండా చూడడం. ముందుగా సంస్థ వారికి తెలిపి, నాగభూషణం తీవ్రంగా అస్వస్థుడయాడని. పోటీ నుండి ఉపసంహరించుకుంటున్నాడని చెప్పడం సబబైన పని.

లేచి నిలుచున్నాను. ఈ మనిషికి మత్తు వదలిస్తే దారికొస్తాడు. కొళాయికింద కూచోబెట్టి ఒక అరగంట స్నానం చేయిస్తే అన్ని తగ్గుళ్ళూ కుదురుతాయి.

కాని, ఈ నాగభూషణం అటువంటి అవకాశమే యివ్వడంలేదు.

మనిషి పూర్తిగా వేషంలో ఉన్నాడు. కోటా పూర్తిగా కొట్టుకున్నాడు – చివరకు కిరీటమయినా విడిచిపెట్టలేదు. అది కూడా విగ్గుకి తగిలించుకున్నాడు.

ఏం చేయడం? ఏం చేయడం?? ఏం చేయడం???

గది నలుమూలల చూశాను. ఏదైనా సులుష్ దొరుకుతుందా? ఇంతలో సోఫా మీంచి నాగభూషణం పడిపోయాడు. పెద్ద శబ్దమయింది. ఆ మనిషిని లేవనెత్తడానికి ప్రయత్నం చేశాను. చేతులు పట్టుకు లేవనెత్తబోయాను. మనిషి బరువుగా ఉన్నాడు. ఏ విధంగా కూడా నాకు సహాయం చేయడంలేదు. పైపెచ్చు నా పైట లాగిపారేశాడు.

"డార్లింగ్! నువ్వెంత అందంగా ఉన్నావ్! రోజూ నిన్ను చూస్తూ గుటకలు మింగుతున్నాను. ఇవాళ నిన్ను విడిచిపెట్టను."

అరుస్తున్నాడు. నాకు భరించరాని దుఃఖం వచ్చింది. పెనుగులాటలో నా చీర చింపేశాడు.

ఇది నాగభూషణం తప్పుకాదు. ఏమాత్రం తెలివున్నా ఇటువంటి తప్పుడు పనులు చేయడు.

అతనినలా విడిచి గదిలో ఒక మూలకు పోయి చేతుల్లో ముఖం దాచుకొని ఏడుస్తున్నాను.

"రాగలతా!"

సూర్యరశ్మికి ఉడికిపోతున్న మనిషి మీద మలయానిలం వీచినట్లు ఆ పిలుపు వచ్చింది. తలెత్తి చూశాను.

గది గుమ్మం దగ్గిర రాజశేఖరం నిలబడ్డాడు.

అతని ముఖం చాల నిర్మలంగా ఉంది. ఏ విధమైన ఉద్వేగం కనిపించలేదు.

"మీరు ముందు మరో చీర కట్టుకొని రండి. అప్పుడు మనిద్దరం ఈ మనిషిని సోఫామీద పడుకోబెడదాం!"

నేనేం జవాబు చెప్పలేదు. ఆ ఆజ్ఞను పాలించడమే ధర్మమనుకున్నాను. లేచి మరో చీర బాత్ రూములో మార్చుకొని వచ్చాను. (ఇంకా ఉంది)

# స్ట్రైక్

## "అమృతపాణి"

చలపతికి కాఫీ గ్లాసందిస్తూ పేరిందేవి అంది సుబ్బులు స్ట్రైక్ నోటీసిచ్చింది

ఎవరూ? మన పనిమనిషా?! అన్నాడు ఆశ్చర్యంగా

అవును చాలాకాలం నుంచి బెదిరిస్తోంది ఈనెలన్నా జీతం పెంచకపోతే పనిమానేస్తుందిట

ఇప్పుడెంతిస్తున్నావ్?

పదిహేను రూపాయలు

ఎంతకి పెంచ మంటోంది?

నెలకిరవై రూపాయలివ్వాలిట – లేకపోతే మరో ఇల్లు చూసుకొంటుందిట

ఐదు రూపాయలే కదా – పెంచితే పోలా–

సుబ్బులు నీటుగా పొంకంగా వుంటుంది అలాంటిది పని మానుకొంటుందంటే చలపతికి బాధగానే వుంది కానీ పేరిందేవి మనస్తత్వం వేరు ఆమెగారు ఒక పనిమనిషిని కుదుర్చుకున్నా పాలమనిషిని కుదుర్చుకున్నా చాకలిని కుదుర్చుకున్నా – మొదట్లో ఎంతకి మాట్లాడుకుంటే – ఆ వూరు వొదిలిపెట్టేంత వరకూ అదే పద్ధతి కొనసాగాలి చిన్న పిసరు మార్పు చెయ్యటానికి కూడా ఆమె వొప్పుకోదు

మీకేం – మీరలానే చెబుతారు? అందరికీ జీతాలు పెంచుకొంటూ పోతే– వచ్చిన జీతంతో ఎడ్జస్టవటం ఎట్లా?!

మరి మేమూ జీతాలు పెంచమని గవర్నమెంటుని గడీ గడీకి అడగటంలా?

మీ దారివేరు– దాని దారివేరు

అయితే – సుబ్బులు జీతం పెంచనంటావ్ –

ఎట్టి పరిస్థితుల్లోనూ పెంచను

మరి అది మానేస్తే

మానెయ్య మనండి అంట్లు తోముకోవటం పాచిచేసుకోవటం – గుడ్డలుతుక్కోవటం – అంతేగా?

సరే – నీయిష్టం

★ ★ ★ ★ ★

సుబ్బులు పనిలోకి రావటం మానేసిందండీ–

మానేసిందా? అయితే – నీకష్టమే–

కష్టమేముంది?– మీరు కొంచెం హెల్ప్ చేస్తే చాలు–

నేనా?!

అవును – పొద్దుటే నాలుగు బాల్చీలు నీళ్లు తోడిపెట్టండి– చాలు – ఆ మిల్క్ బూత్ నుంచి పాలు మీరే పట్టుకురావాలి–

అమ్మో? అవన్నీ నాకు చేతకావే –

చేతయ్యేదేముంది? – అలవాటు చేసుకొంటే సరి–

సరి సరి

★ ★ ★ ★ ★

చూడండి – చేతులెలా పొక్కిపోయాయో

ఎందుకనీ?

అంట్లు తోమి

అయ్యో – పాపం!

పాదాలు బీట్లిసి పోయాయి పాచి చేసీ బట్టలుతికీతికీ

సుబ్బులుకి జీతం పెంచితే ఈ గొడవుండేదికాదు కదా–

చస్తే – దానికి జీతం పెంచేది లేదు – ఇప్పటి కయిదు రోజులయింది – పనిమానేసి – కనీసం



ఒక్కసారన్నా కనపడలేదు'

చర్చలకి ఆహ్వానిస్తానని చూస్తోందేమో–

అవును – పక్కింటి పని మనిషి దీనికి రాయభారి అదొచ్చి మొన్న అడిగింది–' సుబ్బులుతో మాటాడతా రేంటండమ్మా దాన్నో పాలి తీసుకొస్తాను అని

నువ్వేమన్నావ్?

మాటాడేదేంలేదు – పూర్వం వొప్పుకొన్న జీతానికి నయాపైసా కూడా పెంచేది లేదు– అలా ఇష్టం అవుతేనే రమ్మనమను – అని చెప్పాను

చెప్పావూ?

అవును చెప్పాను – అదే చచ్చినట్టు దిగొస్తుంది మన ప్రస్తుతపు ఆర్థిక పరిస్థితిలో చిల్లి గవ్వకూడా దానికి పెంచటానికి వీల్లేదు

అహా – సరే – నీఇష్టం

★ ★ ★ ★ ★

ఈ పనంతా చెయ్యటం నా వల్లకాదు

మరేం చేస్తావ్? చేజేతులా మాన్పించుకున్నావ్ పనిమనిషిని –

ఆ విషయంలో వెనక్కి తిరిగేది లేదు

మరిప్పుడు అవస్థ పడుతున్నావ్ కదా?

అవస్థ పడుతున్నామనీ దానికి లొంగిపోతామా

పోనీ – దాని కోమారు కబురు పెట్టలేక పోయావా?

కబురు పెట్టే సమస్యే లేదు అదంతట అదే రావాలి చర్చలకి నేనెప్పుడూ సిద్ధమే–

అయితే – అదివొచ్చినట్టే – నీ కష్టాలు తీరినట్టే–

ఎందుకురాదు?– అదొస్తుందా? – దాని తలలో జేజమ్మొస్తుందా?–

కొంపదీసి అదిగానీ – వొచ్చిందేవిటీ?–

ఆ – వొచ్చింది – పొద్దున్న పది గంటలవేళ వచ్చింది పక్కింటి పనిమనిషి మధ్యవర్తిగా వ్యవహరించింది

# స్ట్రైక్

అలాగా! అయితే – ఎదన్నా అంగీకారం ఎదన్నా కుదిరిందా? చర్చలు ఫలప్రధం అయ్యాయా??

మీకెందుకంత కంగారు?!– అది జీతం పెంచమని అడిగింది – కుదర్దు ఆర్థిక పరిస్థితులు అనుకూలించటం లేదన్నాను పక్కింటి పనిమనిషి మధ్యవర్తిగా కనీసం మరో మూడు రూపాయలన్నా సుబ్బులు జీతాన్ని పెంచమంది ఇప్పుడున్న జీతం ఇవ్వటానికే కష్టంగావుంది పెంచేమాట కల్ల– అన్నాను చాలాసేపు కూచున్నారు నేనేం మాటాడలేదు– నన్ను తిట్టుకుంటూ వెళ్ళిపోయారు

నిన్ను తిట్టుకొనే దాకా వచ్చిందన్నమాట!

అయినా – నేనేం అనుకోను – నేను వాళ్ళకి అక్కలాంటిదాన్ని వాళ్ళు నా సోదరీమణులు

సరిపోయింది!! ఇక ఈ విషయం పరిష్కారం అయినట్టే ఇప్పటికే– పది రోజులయిందను కొంటాను – అది మానేసి–

అవును –దానిష్ట మొచ్చినంత కాలం తీసుకోమనంది – అదంటే నాకు పూర్తి సానుభూతి వుంది కానీ జీతం మాత్రం పెంచను

నువ్వు మాత్రం తక్కువ దానివా?!

★ ★ ★ ★ ★

ఇంకా – ఏన్నాళ్ళు నీకీకష్టం?– అంట్లు తోమి తోమి చేతులు పుళ్ళయి పోయాయి– ఇప్పటికయినా – దానికి కబురుపెట్టు

దానికి కబురు పెట్టే సమస్యేలేదు వస్తే అదంతట అదేరావాలి దానికోసం నా వాకిటి తలుపు లెప్పుడూ తెరుచుకొనే వుంటాయి

మళ్ళీ వచ్చిందా?–

ఆ వొచ్చింది – నిన్న సాయంత్రం

ఏవంది?!

ఏవంటుంది? – పదిహేను రూపాయలకే పని చేసుకొంటుందిట కానీ మానేసిన రోజులకి జీతం కొయ్యొద్దంది

అది చెప్పింది బాగానే వుందికదా– వొప్పుకొన్నావా?–

వొప్పుకోలేదు – సమ్మె కాలానికి జీతం ఇచ్చేది లేదన్నాను

మరీ – అంత పట్టు విడుపులు లేకపోతే ఎలా?–

ఎందుకు లేవు? – సమ్మె కాలానికి జీతం ఇస్తానన్నాను–

అయితే – మరింకేం?

అయితే – అడ్వాన్సుగా మాత్రమే ఇస్తానన్నాను – వచ్చే నెలా ఆ వచ్చే నెలా జీతాలలో అడ్వాన్సు సమాన వాయిదాలలో కట్ చేస్తానన్నాను–

"బాప్రే !! – మరి సుబ్బు లందు కొప్పుకుందా?

లేదు – కూచుని కూచుని – నేనేం మాటాడక పోయే సరికి వెళ్ళిపోయింది–

మరీ – దాన్నంతలా వేధించుకు తినటం బాగుండ లేదేమో

దాన్ని గురించే బాధపడు తున్నారుగానీ – నా గురించే పట్టించుకొన్నట్టు లేదే!!

అయ్యయ్యో !! నీ గురించే కదా నా బాధంతా– చూడు నీపాదాలు ఎలా బీటలేసి పోయాయో – చేతులు చూడు – ఎలా పుళ్ళయి పోయాయో – మొహం నల్లబడి పోయింది– సుబ్బులు స్ట్రైక్ ఇలాగే కొనసాగితే – నువ్వేమయి పోతావేమో నని – భయంగా వుంది

పోన్లెండి – ఆ మాత్రపు సానుభూతి వుంది – అదే చాలు – మరో పని మనిషిని కుదుర్చుకో ట్టానికి ప్రయత్నాలు చేస్తున్నాను పక్కింటి లావుపాటి పిన్నిగారు తనకి తెలిసిన పనిమనిషికి కబురు పెట్టారు

అహ!! – మీరూ తక్కువ వాళ్ళేం కారు"

★ ★ ★ ★ ★

సక్సెస్ !! గ్రాండ్ సక్సెస్!!

ఎవరికి?!

మనకే! సుబ్బులు ఇవాళ పనిలో కొచ్చింది

ఏవిటీ?! స్ట్రైక్ కాలాఫ్ చేసేసిందా?!

అహా అగ్గగ్గలాడుతూ పని చేసి వెళ్ళింది

మరి జీతం

జీతం ఏం పెంచలేదు సమ్మె కాలానికి జీతం ఇచ్చేది లేదు దానికి బదులుగా ఎడ్వాన్స్ ఇస్తాను ఇచ్చిన ఎడ్వాన్స్‌ని రెండు ఈక్వల్ ఇన్‌స్టాల్ మెంట్స్‌లో కట్ చేసుకోవటం జరుగుతుంది మళ్ళీ ఇప్పట్లో జీతం పెంచమని అడిగేది లేదని చెప్పింది

మొత్తానికి లొంగదీశావ్–

నేనేం లొంగదీయలేదు నాకు సుబ్బులు పట్ల పూర్తి సానుభూతివుంది అది నా చెల్లెలు లాంటిది కాకపోతే– దానికి జీతం పెంచక పోవటానికి కారణం – మన ప్రస్తుత ఆర్థిక పరిస్థితే!– దాని కెప్పట్లా పొద్దుటే కాఫీ టిఫినూ మధ్యాహ్నం ఇంటికి పట్టుకెళ్ళ టానికి అన్నం ఇవ్వడం జరుగుతుంది దాని మీద ఎటువంటి కక్ష సాధింపు చర్యలూ తీసుకోవటం జరగదు □

వామ్మో!!!








సీరియల్

# ప్రతిస్పందన

అన్నపూర్ణ




(గతసంచిక తరువాయి)

సాకేత వెళ్ళేవుంటే బయట తలుపులు బిగించివున్నాయ్ అంతా అలవాటే అనుకుంటూ బయటే వున్నాడు వాచ్‌మెన్

హనుమంతూ హనుమంతూ తలుపులు తడుతూ అరిచింది

అలా కొద్దిసేపు జరిగాక తలుపులు తెరుచుకున్నాయ్ ఒక్కసారిగా

ఎదురుగా వాచ్‌మెన్ హనుమంతు కాకుండా ఆధునిక అలంకారాలతో అత్యంత శోభాయమానంగా కనిపిస్తున్న ఓ అందమైన యువతి దర్శనమిచ్చింది!

పసిమిఛాయలో వున్న ఆమె అందం చూస్తుంటే-ఈమె ముందు తాను ఎంత? అన్న భావన వెంటనే కలిగింది సాకేతకు

తానేదో అందగత్తెనని ఇంతకాలం అహంకార పడినందుకు కించిత్ పశ్చాత్తాపపడింది

ఏమిటి బెదిరిపోతున్నావ్? వేటగాణ్ణి నీటుగాడని నమ్మి వెంటపడి వచ్చిన లేడిపిల్లవా? అడిగిందామె పరిహాసంగా

అవునండీ దారితప్పి వచ్చాను అంది సాకేత

మోజుపడిన ప్రతి ఆడపిల్లనూ దారి తప్పిస్తూనే వుంటాడు సాగర్

అతడి నిజతత్వం నాకు తెలియదు

మరి? ఎర్రగా బుర్రగా వున్నాడు పైగా కోటీశ్వరుడు గాలం వేద్దామని ప్రయత్నించి వుంటావ్?

చదువుకున్నదానిలా వున్నావ్ లోకాన్ని అర్థంచేసుకోలేకపోతే ఎలా?

అదేనండీ నా బుద్ధి తక్కువ మరెప్పుడూ ఇలా జరగదు

నీపేరు?

సాకేత

నాపేరు కల్పవల్లి అందరూ కల్పా అని పిలుస్తారు

సాగర్ మీకు బంధువా?

కాదు అయినా నేను అతణ్ణి వెతుక్కొని వస్తూనేవుంటాను ఆ అవసరం నాకుంది కానీ నా అవసరం తనకు లేదంటున్నాడు సాగర్

?

మా యిద్దరి మధ్య అంత అనుబంధమేమిటా అని ఆలోచిస్తున్నావుకదూ? నీలా నేనూ సాగర్ ఆకర్షణలో పడ్డాను భ్రమ కల్పించాడు పెళ్ళిచేసుకుంటాడు కదా అని-అతడు రమ్మన్న చోటుకల్లా వెళ్ళాను చేయమన్నట్లు చేశాను పెళ్ళివిషయం అడిగితే వెర్రిపట్టినట్లు నవ్వాడు నావంటిదానికి అతణ్ణి పెళ్ళిచేసుకొనే అర్హత లేదన్నాడు మా నాన్నగారికి చెప్పి అయిదు లక్షలు కట్నం యిప్పిస్తాను నన్ను అర్థాంగి చేసుకోమని అర్థించాను యాభై లక్షలు యిస్తామంటూ ఓ సంబంధం వచ్చిందట నా తండ్రి అంత కట్నం యివ్వగలిగితే- నన్నే చేసుకుంటాడట దారుణం జరిగిపోయిందనుకున్నాను ఏనాటికైనా నేను సాగర్ భార్యను అవుతాను అలా జరగదని రూఢిగా తెలిసిననాడు సాగర్‌ను కూడా నాతో తీసికెళ్ళిపోతాను ఎక్కడికో తెలుసా? పైలోకానికి! పొరబాటున నువ్వు ఆ పులి నోట చిక్కి ఎంగిలిపడలేదుకదా? తను చెప్పవలసింది చెప్పి అడగవలసింది అడిగింది కల్పవల్లి

భగవంతుండి దయవల్ల అలాంటిది జరగలేదు ఈలోగా మీరు వచ్చారు నన్ను కాపాడండి బయటికి వెళ్ళనివ్వండి అంటూ కల్ప చేతులు పట్టుకుంది సాకేత

నేను ఎలాగో చెడ్డాను కానీ నాలా మరెవరూ అన్యాయానికి బలికాకూడదు అదే నేను ఎవరికైనా చేయగలిగే మేలు అందుకే అప్పుడప్పుడూ ఇక్కడికి వస్తుంటాను సాగర్ బాగోతాలన్నీ సాయంత్రంవుటే ఇంతకాలానికి ఓ అమాయకురాల్ని కాపాడగలిగానన్న తృప్తి కలుగుతోంది నువ్వు వెళ్ళిపో నీ లోటు నేను భర్తీచేస్తాను అక్కడ అని హనుమంతూ! పిచ్చిపిచ్చివేషాలు వేయక ఈ అమ్మాయిని బయటికి వెళ్ళనీయ్ లేకపోతే పోలీస్‌రిపోర్ట్ యిచ్చి కటకటాలు లెక్కబెట్టిస్తాను నీచేత అని బెదిరించింది కల్పవల్లి

హనుమంతుకూడా బెదిరిపోయినట్లే కనిపించాడు సాకేతను బయటికి పంపేశాడు

అందంగా అపరంజి బొమ్మలా వున్న కల్పవల్లిని కూడా కట్నం కారణంగా తృణీకరించేశాడు సాగర్ అతడు వట్టి డబ్బుమనిషి అంతేకాదు మేకతోలు

జరిగిన కథ – 11 రవికిరణ్ నవలల ప్రచురణ వ్యాపారం మొదలు పెడతాడు సాకేత సవనిశ్రుల ట్రేడింగ్ కంపెనీలో ఉద్యోగం మానేసి సాగర్ ప్రమోటర్స్‌లో స్టెనోగా చేరుతుంది సౌందర్య ప్రేమ మీద అనంత్ మీద తన అభిప్రాయం తెలియజేశాక శేషాద్రిగారు అనంత్‌తో సౌందర్యకు పెళ్ళి ప్రయత్నాలు మొదలు పెడతారు సాగర్ సాకేతను తన గెస్ట్ హౌస్‌కు తీసుకుపోయి మానభంగం చేయడానికి ప్రయత్నించడంతో అతని నిజస్వరూపం బైటికి వస్తుంది

కప్పుకొని వున్న పులి

అంత అందగత్తె అయిదులక్షలు కట్నంతో వచ్చి అర్ధాంగి అవుతానంటె ససేమిరా వీలులేదన్నాడు అలాంటిది ఓ మోస్తరు అందంవుండి నయాపైసా కట్నంకూడా ముట్టచెప్పలేని తనను అసలు దరిచేరనిచ్చేవాడా? వాసనచూసిన పువ్వులా అవతలకు గిరాటువేసేవాడు ఆ ధనమదాంధుడు

ఎంత గండం గడిచిపోయింది? అంతా సినిమా రీలులా జరిగిపోయింది కల్పవల్లి నిజంగా తనపాలిట దేవత అన్ని అర్హతలూవున్న ఆమెను తనదాన్నిగా చేసుకోలేకపోతున్న సాగర్ పచ్చిమూర్ఖుడు అతణ్ని భగవంతుడు ఏనాటికీ క్షమించడు

రిక్షా ఎక్కి యింటికి చేరేలోగా చాలాచాలా ఆలోచించింది సాకేత

రిక్షావాణ్ణి పంపి లోపలికి వచ్చిన ఆమెకు నవ్వు ముఖంతో ఎదురు వచ్చింది తల్లి రేణుకమ్మ అప్పటికి కొంచెం చీకటి పడింది వీధుల్లోను ఇళ్ళల్లోను లైట్లు వెలిగాయి

విన్నావుటే అమ్మాయ్ మన చంద్రిక నెల తప్పిందట! నా చిన్న కూతురు నన్ను అమ్మమ్మను చేయబోతోందే అంటూ సగర్వంగా చెప్పింది

అలాగా! నాకు కొంచెం తల నెప్పిగావుంది అంది సాకేత ఓ కుర్చీలో నిస్త్రాణగా కూర్చుంటూ

ఉండు కాఫీ తెచ్చియిస్తాను అని లోనికి వెళ్ళి క్షణాలమీద కాఫీ తెచ్చియిచ్చింది రేణుకమ్మ అప్పటికీ తాను తన దోరణి మార్చుకోలేదు

ముచ్చటైన దాంపత్యం అంటే—అనిరుద్ధ్ చంద్రికలనే చెప్పుకోవాలే భార్యాభర్తలే అయినా ఒకరిని గురించి ఒకరు పరితపించిపోతూంటారే నా కడుపున



# ప్రతిస్పందన

పుట్టిన చంద్రిక ఇంతటి అదృష్టానికి నోచుకుంటుదని నేను ఏనాడూ అనుకోలేదు కానీ అంతా విధివిచిత్రం అని సాకేత అందించిన ఖాళీ కప్పు తీసుకొని తిరిగి లోపలికి వెళ్ళిపోయింది రేణుకమ్మ

ప్రస్తుతం సాకేత ఏ విషయం గురించీ లోతుగా ఆలోచించే పరిస్థితిలో లేదు వళ్ళంతా సలసలలాడుతున్నట్టుంది జ్వరం తగులుతుందేమో అనుకొని మంచంమీద ముసుగుపెట్టుకొని పడుకుంది

* * * *

రాత్రి భోజనం చేయకుండా పడుకుండి పోవడంతో మర్నాడు ఉదయానికి కొంత రిలీఫ్ అనిపించింది సాకేతకు

ప్రొద్దున నిద్రలేచింది మొదలు ఆఫీసుకు టైమ్ అయిపోతోందని ఒకటే హడావిడిపడిపోయేది రోజూ

కానీ ఈవేళ ఆ అవసరంలేదు ఇకముందు కూడా రాదు

తమ్ముళ్ళిద్దరూ హోమ్ వర్కులు చూసుకుంటూ కూర్చున్నారు కాసేపు వాళ్ళవైపు చూస్తూ మంచంమీదే కూర్చుండిపోయింది సాకేత

స్నానంచేసి లోపలికి వచ్చిన నిరంజనరావు, ఒంట్లో ఎలావుంది అమ్మాయ్? అనడిగారు రాత్రి ఆయన భోజనం చేయమని అడిగితే ఒంట్లో బావుండలేదు నాన్నా అన్నది సాకేత అందుగురించి ఆరాతీశారు

బాగానేవుంది నాన్నా చెప్పింది

ఈరోజు ఆఫీసుకు వెళ్ళవా?

వెళ్ళాలని అనిపించటంలేదు అయినా నాన్నా

చెప్పమ్మా నా ముందు సందేహం ఎందుకు?

ఆలోచించి చూస్తే మీ సలహాయే బావుందనిపిస్తోంది నాన్నా మన టైపు ఇనిస్టిట్యూట్‌లో వుండి మీకు సహాయపడాలనుకుంటున్నాను ఎంతైనా ప్రైవేట్ వుద్యోగాలు శాశ్వతం కావుకదా?

మంచిదమ్మా ఈమధ్య స్టూడెంట్సు కూడా ఎక్కువయ్యారు మన ఇనిస్టిట్యూట్‌లో నాకేమో షార్ట్‌హాండ్‌తో టచ్‌లేదు నువ్వు యిప్పుడు సరైన నిర్ణయం తీసుకున్నావ్ సాకేతా

ఒకవిధంగా పొంగిపోయాడు నిరంజనరావు అతడి పరిస్థితి ఇప్పుడు బాగానేవుంది గవర్నమెంట్ నుంచీ కొంత డబ్బు కూడా వచ్చింది ఈమధ్య తను ఈనాడు ఇంత ప్రశాంతంగా బ్రతుకుతున్నాడంటే అంతా శేషాద్రిగారి చలవే అని తెలిసినవాళ్ళందరికీ చెప్పుకుంటున్నాడు నిరంజనరావు

కాలకృత్యాలు తీర్చుకోవటానికి వెళ్ళింది సాకేత

నిన్న జరిగింది ఏమాత్రం తెలిసినా తన తల్లిదండ్రులు గుండెపగిలి ఏడుస్తారు అయినా గతంగతః జరిగినదాన్నిగురించి ఒకళ్ళకు చెప్పుకొని ప్రయోజనంలేదు అని అనుకొంది దృఢంగా అందుకే ఏమీ జరగనట్లే ప్రవర్తించింది




తల్లి యిచ్చిన కాఫీ త్రాగుతుంటే చంద్రిక గుర్తువచ్చింది

తల్లికాబోతోందన్న మాట తన చెల్లెలు!

చంద్రిక, అనిరుద్ధ్‌ల దాంపత్యం గురించి ఘనంగా మాట్లాడుతుంది తల్లి అదీ తనముందే

చూశావా, మూర్ఖత్వానికిపోయి నువ్వు ఎలాంటి సువర్ణావకాశాన్ని పోగొట్టుకున్నావో? అన్న భావన ద్యోతకమవుతూంటుంది ఆ మాటల్లో

కావచ్చు ఆణిముత్యం లాంటి అనిరుద్ధ్‌ను తృణీకరించింది అప్పుడు తనలోని అహంకారం అలాచేయించింది పోనీలే తన చెల్లెలైనా హాయిగా బ్రతుకుతోంది జీవితాంతం కూడా అది అలాగే బ్రతకాలి చిన్నప్పట్నుంచీ తను చూస్తూనేవుంది ఏ విషయంలో అయినా సర్దుకుపోయే మనస్తత్వం చంద్రికది అనిరుద్ధ్ కూడా దురుసువాడుకాదు పైగా ఓ అభ్యుదయ రచయిత ఈమధ్య అతడి చాలారచనలు అచ్చవుతున్నాయట నేనేదైనా ప్రగతి సాధించాను అంటే చంద్రిక అందించిన సహకారమే అని సగర్వంగా చెప్పుకుంటున్నాడట అతడు సౌందర్య చెప్పింది

రవికిరణ్ పూనుకొని అనిరుద్ధ్ నవలలన్నీ పుస్తకాలుగా వేస్తున్నాడట అతడు ఏర్పాటుచేసిన పబ్లిషింగ్‌హవుస్ బాగా సాగుతోందట

త్వరలో తన పెళ్ళి జరగబోతున్నట్టు చెప్పింది ఆమధ్య ఓ రోజు సౌందర్య

అనంత్‌తో ఏర్పడిన పరిచయం ఈనాటి సగటు యువతులలా పిరికితనానికి పోకుండా–కొత్తవరవడి దిద్దుతూ తనకు ఫలాన అబ్బాయి నచ్చాడు కాబట్టి అతడి పుట్టుపూర్వోత్తరాలు తెలుసుకొని ఫరవాలేదంటే పెళ్ళి జరిపించమని తల్లిదండ్రులకు చెప్పటం జరిగిందట

కూతురు తల్లిదండ్రులుగా తమపట్ల వుంచిన విశ్వాసానికి పొంగిపోయిన శేషాద్రిగారు యమునాదేవి అనంత్ వాళ్ళ వూరువెళ్ళి ఎంతో సంతృప్తితో తిరిగిరావటం సౌందర్య పెళ్ళికి లైన్ క్లియర్ చేయటం జరిగిందట

చాలా తెలివికలది సౌందర్య ఏ విషయంలోనైనా ఆత్మనిగ్రహంతో వ్యవహరిస్తుంది మంచితనంతోటే అనుకున్నది సాధిస్తుంది

పాపం రవికిరణ్ విధివశాన కాలు పోగొట్టుకున్నాడు అతడికి పెళ్ళికాకుండానే సౌందర్య ఒక యింటిది అయిపోతోంది తనని వదిలి చంద్రిక చేసుకోలేదూ?

ఒకదానివెంట ఒకటి ఆలోచనలు వస్తున్నాయి సాకేతకు అందులో చేయవలసిన పనిలేదు ఖాళీగా కూర్చుంది

ఎప్పుడో ఆదివారాలు తప్పితే తను, సౌందర్య కలుసుకున్న ఇతర సందర్భాలు తక్కువ ఈమధ్య

అయినా సౌందర్య మనసులో ఏమీ దాచుకోకుండా అన్నీ చెప్పేస్తుంది కలిసినప్పుడు తను మాత్రం చాలా విషయాలు ఆమెకు చెప్పకుండా దాటవేసింది

సాగర్‌ను గురించి మాటవరసకైనా చెప్పలేదు సౌందర్యకు అతడివిషయమే దానికి చెప్పివుంటే ఈరోజు తల ఎత్తుకోగలిగేదే కాదు అంతా మంచికే అన్నట్టు జరిగిపోయింది

మంచిమనిషి అయిన కల్పవల్లిని సాగర్ పెళ్ళిచేసుకుంటే బావుంటుంది కల్పవల్లి మాత్రం చూస్తూచూస్తూ అతణ్ణి మరొకళ్ళకు ధారాదత్తం చేయలేదు సాగర్ మూర్ఖత్వానికిపోతే మరేం జరుగుతుందో?

* * * * *

ఈరోజు సౌందర్యతో ఎక్కువసేపుగడపాలి అనుకొంటూ యింటినుంచి బయలుదేరింది సాకేత ఆ సాయంత్రం

సౌందర్య యింట్లోనేవుంది శేషాద్రిగారు ఎటో బజారుకు వెళ్ళారు రవికిరణ్ పబ్లిషింగ్‌హవుస్ దగ్గిరవున్నాడు యమునాదేవి లోపలవుందో పూల తోటలోవుందో? లావు తగ్గటానికి డాక్టర్ సలహాప్రకారం ఎప్పుడూ ఏదో పనిచేస్తూనేవుంటుంది ఆమె

సాకేతా! రా రా ఏమిటిలా హఠాత్తుగా వూడిపడ్డావ్? ఈవేళ ఆదివారం కాదుగదా? అంది సౌందర్య

ముఖంమీద చిరునవ్వు తప్పితే–మాట్లాడలేదు సాకేత

వెళ్ళి సౌందర్య ప్రక్కనే సోఫాలో కూర్చుంది

ఎమిటి విశేషాలు? అంటూ సాకేతవైపు తిరిగి చేతిలో వున్న పుస్తకాన్ని టీపాయ్‌మీద పెట్టింది సౌందర్య

నాదగ్గర విశేషాలు ఏంలేవు నీదగ్గర ఎవైనా విశేషాలువుంటే తెలుపు అంది సాకేత వుల్లాసాన్ని నటిస్తూ

అలా అంటూండగానే ఆమె దృష్టి టీపాయ్‌మీద వున్న పుస్తకంమీదకి మళ్ళింది అది రంజితాదేవి కొత్తగా రాసిన పుస్తకం!

ఏమిటి అబిరుచులు మారినయ్యా? కొత్తకొత్త పుస్తకాలు చదువుతున్నావు? అని వెంటనే అడిగేసింది

అబిరుచులు మారకపోయినా చదువుతున్నాను ఈ నవలను విమర్శించటానికైనా విశేషాలు తెలుసుకోవాలి మరి ఎంతైనా నీ అబిమాన రచయిత్రికద రంజితాదేవి? అంది సౌందర్య

లేదు సౌందర్యా ప్రస్తుతం నాకు అబిమాన రచయిత రచయిత్రి ఎవరూ లేరు నేనూ నీదారిలోకి వచ్చేశాను అనుబవంమీద మనిషిని వూహాలోకాల్లో విహరింపజేయటం ప్రమాదకరమైనవిషయం అమాయకంగా ఆలోచించేవాళ్ళపట్ల విషపలితాలు చూపుతయ్ అవాస్తవిక రచనలు

అవాస్తవ రచనలు విషపలితాలు అంటూ పెద్దపెద్దమాటలు వాడేస్తోంది సాకేత పొరపాటున అన్నయ్య విషయం దీనికి తెలియదుకదా?

ఎం అలా మాట్లాడుతున్నావ్? ఏమైనా అనుబవాలు ఎదురయ్యాయా? అడిగింది సౌందర్య పైకి

తడబడింది సాకేత

నాకంటే–నాకే ఎదురవ్వాలా? అనవసరమైన ఆలోచనలు పెట్టుకొని కొందరైనా దెబ్బతినిపోవచ్చుకదా? అంది

ఎవర్నిగురించి నువ్వు మాట్లాడేది? మా అన్నయ్యను గురించా?

మీ అన్నయ్యా!?

తెలిసీ తెలియనట్లు మాట్లాడకు సాకేతా మా అన్నయ్య అమాయకత్వానికి పోయి ఎలా బలి అయిపోయిందీ నీకు ఎవరో చెప్పేవుంటారు

నాకు ఎవరూ చెప్పలేదు మీ అన్నయ్యను గురించి నువ్వే ఇప్పుడు చెబుతున్నావ్ రవికిరణ్ అమాయకత్వానికి బలిఅయిపోయారా? ఎలా?

విషయం సాకేతకు తెలియదన్నమాట అనవసరంగా తను తొందరపడింది అనుకొంది సౌందర్య

అన్నయ్యను గురించి నీకు తెలియందేముంది సాకేతా?

రవికిరణ్‌గార్ని గురించి కొంత తెలిసినా–నాకు తెలియకుండా నువ్ మరేదో దాస్తున్నావ్ సౌందర్యా ఇంతేనన్నమాట నామీద విశ్వాసం?

సాకేత నిష్టూరాలకు తట్టుకోలేకపోతోంది సౌందర్య జరిగింది తెలిస్తే సాకేత ఎలా పీలవుతుందో ఏం జరుగుతుందో? ఒకటేయిద్దైపోయింది సౌందర్య కొద్దిసేపు

తర్వాత ఎదో నిర్ణయానికి వచ్చినట్లు లేచివెళ్ళి రవికిరణ్‌కు రచయిత బవంత ప్రసాద్ వ్రాసిన ఉత్తరాన్ని తెచ్చి ఇది చదువు అంతా నీకే తెలుస్తుంది అంటూ సాకేతకు యిచ్చింది

ఆ ఉత్తరం చదివిన తర్వాత కొద్దిసేపు చలనంలేకుండా వుండిపోయింది సాకేత

విపలమైన ప్రేమ ప్రతీకారానికి పురికొల్పుతుంది కొన్ని కొన్ని సందర్భాలలో నీ తిరస్కారాన్ని తట్టుకోలేకపోయాడు అన్నయ్య ఏదో విదంగా నిన్ను పొందాలన్న తపన నవలలో పేర్కొన్న బ్రబక్ వశీకరణ విద్య నిజమేననుకొని అమాయకంగా ప్రయోగాలు చేశాడు నీ తల వెంట్రుకలు సంపాదించటానికి ఎన్ని తిప్పలు పడ్డాడో తర్వాత ఏం చేశాడో – చదివావు కద? తాను చేసిన తెలివితక్కువ పనికి బాగానే మూల్యం చెల్లించుకున్నాడు ఆ అమాయకుడు తనకున్న రెండు కాళ్లలో ఒకదాన్ని కోల్పోయాడు అయినా ఇంకా అతడిలో ఆశ చచ్చినట్లు లేదు వచ్చిన సంబందాలను ఏవో కారణాలు చెప్ప తిరస్కరిస్తున్నాడు బహుశా నీ పెళ్ళి అయ్యేంతవరకు అన్నయ్య తన పెళ్ళికి సుముఖత చూపకపోవచ్చు అన్నీ చెప్పి కళ్లనీళ్లు పెట్టుకొంది సౌందర్య

నన్ను ప్రేమించే వ్యక్తి ఆరాదించే వ్యక్తి – నాకోసం వెనుకముందు చూడకుండా ఏ సాహసానికైనా పూనుకొనే వ్యక్తి నా కోసం పడిన తపనలో ఓ కాలును పోగొట్టుకున్న వ్యక్తి – ఒకరు వున్నందుకు నేను గర్వపడుతున్నాను సౌందర్యా – అన్నప్పుడు సాకేత కనుల వెంట బాష్ప జలం జలజల జాలువారింది

తర్వాత –

అనుబవం మీద నేను చాలా చాలా విషయాలు తెలుసుకొన్నాను సౌందర్యా–తనను అమితంగా ప్రేమించగలిగే వ్యక్తిని బర్తగా పొందగలిగితే ఆ ఆడది ఎంతో సుఖపడుతుందట రవికిరణ్‌గారు నా కారణంగా జీవితంలో ఎంతో నష్టపోయారు మీరంతా అంగీకరిస్తే ఆ నష్టాన్ని నేను బర్తీ చేస్తాను మనస్పూర్తిగా చెబుతున్న మాటలు ఇవి అంది

సాకేతా!

అవును సౌందర్యా! ఇంతకాలం వూహాలోకాల్లో విహరిస్తున్న నేను ఇప్పుడే వాస్తవంలోకి వచ్చాను

అదే సమయంలో వీది గుమ్మంలో బూట్ల టకటక శబ్దం వినిపించింది

చూస్తే రవికిరణ్!

సాకేత టక్కున లేచి నిలబడింది

సౌందర్య ఎంతో వుల్లాసంగా తన అన్నయ్యకు ఎదురు వెళ్ళింది

అన్నయ్యా నీకో మంచి వార్త చెబుతాను ఎమిస్తావ్? అడిగింది

నేను అంతా విన్నాను కానీ అందమయిన సాకేత నావంటి అవిటివాణ్ని




చేసుకోవటం – మనసున్న మనిషిగా నేనిందుకు ఒప్పుకోలేను చెల్లాయ్ అన్నాడు రవికిరణ్ వైరాగ్యంగా

సౌందర్య బిత్తరపోయింది అతడి మాటలకు

నేను ఎవరి బలవంతం మీదనో లేక మీ మీది సానుబూతి వల్లనో ఈ నిర్ణయానికి రాలేదండీ నన్ను అమితంగా ప్రేమిస్తున్నారు మీరు ఈ విషయం తెలుసుకున్నాక మీపట్ల నాకు చెప్పలేని అబిమానం ఎర్పడింది మిమ్మల్ని వివాహమాడే విషయంలో నాది స్వచ్ఛందమైన నిర్ణయం – తన మాట చెప్పింది సాకేత

తను ఇంతకాలం మనసులో ఓ అదిదేవతగా కొలుస్తున్న సాకేత తనకు తానై అలా మాట్లాడుతుంటే ఇంకేమంటాడు రవికిరణ్?

గతంలో నేనేమైనా పొరబాటుగా వ్యవహరించాననుకొంటే నన్ను క్షమించండి మనం గతాన్ని మర్చిపోదాం కాలు లేదని బాదపడకండి జీవితాంతం మీకు తోడు నేనుంటాను అంది సాకేత మరి కొంత చొరవ తీసుకొని వెళ్లి రవికిరణ్ చేతులు పట్టుకొంటూ

ఆ దృశ్యం లోపల్నుంచి వచ్చిన యమునాదేవి కంటబడింది

రవికిరణ్ సాకేత – ఇద్దరూ సిగ్గుపడ్డారు

సౌందర్య జరిగిందంతా తల్లిదండ్రులకు చెప్పింది – ఆ రాత్రికి

తమ కొడుకు అమాయకత్వానికి కించిత్ బాదపడినా యోగ్యురాలైన సాకేత తమ యింటికి కోడలు కాబోతున్నందుకు ఎంతో మురిసిపోయారు




**జి డి ఆకివీడు**

నేడు చాలామందికి బ్లడ్ ప్రషర్ వుంటోంది ఇది రావటానికి కారణం ఏమిటి? బి పి వున్నవారికి వేరే ఇతర జబ్బులు ఏమైనా వచ్చే అవకాశం వున్నదా?

బ్లడ్ ప్రెషర్ రావటానికి హృద్రోగాలు మూత్రపిండాలలోని రోగాలు, కొన్ని రకాల ఊపిరి తిత్తుల రోగాలు మినహా కారణం అంటూ తెలియకుండా ఇలా రావటమే బ్లడ్‌ప్రెషర్‌లోని ప్రత్యేకత వంశ పారంపర్యంగానూ, వ్యక్తుల మానసిక పరిస్థితిని అనుసరించి రక్తపుపోటు వచ్చే అవకాశం వుంది

రక్తపుపోటు వలన హృద్రోగాలు, నేత్ర రోగాలు మూత్రపిండాలలో రోగాలు, రక్తస్రావం మొదలైనవి వచ్చే అవకాశం వుంటుంది

**కె వి యస్, తుళ్ళూరు**

నాకు 5 సంవత్సరముల క్రితం బోదకాలు వచ్చినది ప్రస్తుతం చాలా లావయింది పాదాలమీద గుత్తిలోను వాపు ఎక్కువ వత్తితే గుంటలు పడుతుంది రెండు సంవత్సరములుగా హెట్రజాన్ మాత్రలు వాడుతున్నాను దీనిని ఆపరేషన్ ద్వారా తీసివేయవచ్చునా వివాహం చేసుకుంటే ఈ రోగం నా భార్య పిల్లలకి సంక్రమిస్తుందా? వివాహానికి ఇది ఆటంకమా?

ఫైలేరియా వల్ల వచ్చిన వాపు వత్తితే పెద్దగా గుంటలు పడదు హృద్రోగం, అనీమియా, లివర్ వ్యాధులు, మూత్రపిండాల వ్యాధులు ఇలా వాపు రావడానికి కారణాలవుతాయి దీనికి ఆపరేషన్ లేదు ఇక హెట్రజాన్ మాత్రలు అనవసరం వివాహానికి ఆటంకం అంటూ లేదు గాని రోగ నిర్ధారణతర్వాత చేసుకుంటే మంచిది ఈ రోగం భార్యాపిల్లలకు సంక్రమించదు

**ఆర్ ఆర్ ఎల్, భీమవరం**

మా అమ్మాయికి 5 సంవత్సరములు అప్పుడప్పుడు ముక్కు నుండి రక్తం వస్తుంటుంది దీనివల్ల ఏమైనా ప్రమాదమా?

ముక్కు నుండిరక్తం కారటానికి చాలా కారణాలు వున్నాయి చిన్న పిల్లలలో దీనివల్ల ప్రమాదమేమీ లేదు ఇ ఎన్ టి వైద్యులకి చూపించి ఏవైనా లోపాలున్నాయేమో చూపించుకొంటే మంచిది

కొకైన్ సొల్యూషన్‌తో తడిసిన దూదిని ముక్కులో దూర్చటం ద్వారా రక్తస్రావాన్ని ఆపవచ్చును

**ఆర్ హెచ్ ఎల్ ఆర్ అవనిగడ్డ**

నాకు ఆరు మాసముల నుండి కన్ను రెప్పలమీద కురుపులు అవుతున్నాయి మందులు వాడినా ప్రయోజనం కనిపించలేదు దీనికి మీ సలహా ఏమిటి?

కళ్లను పరిశుభ్రంగా ఉంచుకోక పోవటం, సూక్ష్మక్రిముల ప్రవేశం, విటమిన్ 'ఏ' లోపించటం, మొదలైన వ్యక్తిగత అపరిశుభ్రతతో ఇలా కురుపులు రావటానికి కారణాలవుతాయి

ఆ కురుపులలో చీము వుంటే చీముని పరీక్షింప చేసి తగిన మందులు వాడాలి

హోర్డియోలం, ఇంటర్నమ్ అనే కురుపులకి చిన్న శస్త్రచికిత్స అవసరం అవుతుంది □

## ప్రతిస్పందన

యమునాదేవి శేషాద్రిగారలు

సాకేత మనస్ఫూర్తిగా అంగీకరించినప్పుడు నిరంజనరావు కుటుంబ సభ్యులు అడ్డు చెప్పే సమస్య ఏముంటుంది?

కూతురు కొడుకు – ఇద్దరి పెళ్ళిళ్ళు ఒకే కళ్యాణమంటపంలో జరిపిస్తే – అప్పుడు ఆ దృశ్యం ఎంత కనులపంటగా వుంటుందో!

– తీయని వూహల్లో తేలిపోతున్నాడు శేషాద్రిగారు

బిడ్డల పెళ్ళిళ్ళు చేసి వాళ్లను ఓ దారిలో పెట్టి – తన మకాం పూర్తిగా పల్లెకు మార్చాలనుకుంటున్నాడు ఆయన సిటీలో చేసే వుద్యోగం ఎలాగూలేదు కాబట్టి పల్లెలో వ్యవసాయం స్వీయ పర్యవేక్షణలో జరిపించాలన్నది శేషాద్రిగారి ధ్యేయం

* * * * *

ఇప్పుడు రవికిరణ్ సాకేత – అనంత్ సౌందర్యలు భార్యాభర్తలు

శేషాద్రిగారి మకాం పల్లెకు మారింది ప్రస్తుతానికి ఆయన ఒక్కడే వెళ్లాడు అయినా తమ్ముడు వెంకటాద్రి వున్నాడు కాబట్టి భోజన వసతి సదుపాయాలకు కొదువలేదు

అనిరుద్ధ్ ఇంకా రచనలు చేస్తూనే ఉన్నాడు రవికిరణ్ వాటిని ప్రచురిస్తూనే ఉన్నాడు

చంద్రికకు మగపిల్లాడు

★ ★ ★ ★ ★ ★ ★

సాకేతా! వంట అయిందా?? అంటూ లోపలికి వెళ్ళి ఓ అలవాటు ప్రకారం పేరు పెట్టి పిలిచాను ఏమీ అనుకోకు వదినా వంట పూర్తయిందా? అడిగింది సౌందర్య

చిత్తం! ఎలాగైనా ఆడబిడ్డ అర్ధ మొగుడటగా? నువ్వు ఎలా పిలిచినా పలుకుతాను తప్పుతుందా మరదలుగారూ? – అంది సాకేత హాస్యంగా

సౌందర్య వెళ్ళి ఆప్యాయంగా కౌగలించుకొంది సాకేతను

ఇలాటి అనుభవం మన మధ్య వెల్లివిరుస్తుందని నేను అనుకోలేదు అంది

అనుకొంటే ఏదీ జరగదు అనుకోకుండానే జరిగిపోతూంటాయ్ చాలా చాలా ఈ ఇంట్లో మీ అన్నచెల్లెళ్ల మధ్య వుండి నేను పొందగలుగుతున్న ఆనందము తృప్తి – వర్ణించి చెప్పలేను సౌందర్యా అంది సాకేత తృప్తిగా

సౌందర్య అనవసరం అనుకొని చదువు మానేసింది అనంత్ చదువు అయిపోయాక ఆమెను కాపురానికి తీసుకువెళ్లే ఏర్పాటు మీదే పెళ్ళి జరిగింది ప్రస్తుతం అదివరకటి రూమ్‌లోనే వుంటున్నాడతడు అప్పుడప్పుడు సౌందర్య కోసం అనంత్ రావటం అతడి కోసం సౌందర్య వెళ్లటం – ఇద్దరూ సినిమాలు షికార్లు కొనసాగించటం జరుగుతోంది

రోజులు గడుస్తుండగానే ఓ రోజు పేపర్లో ప్రముఖంగా ప్రచురించిన వార్త చదివింది సాకేత నగరంలో ప్రముఖ వ్యాపారవేత్త అయిన శ్రీ సాగర్ దారుణ హత్య అన్నది హెడ్డింగ్ మాటర్ పూర్తిగా చదవకుండానే అర్ధమైపోయింది ఆమెకు ఆనాడు కల్పవల్లి అన్న మాటను చెల్లించుకున్నదన్న మాట ఆడదాని పగ చల్లారని అగ్ని నయవంచకుడైన సాగర్‌కు తగిన శాస్తి జరిగింది ఒక విధమయిన తృప్తి అనిపించింది సాకేతకు

సాగర్ అంటే ఎవరో అతడు ఎందుకు మరణించాడో సౌందర్యకు గాని రవికిరణ్‌కు గాని చెప్పలేదు సాకేత అనవసరం అనుకొని

సౌందర్య సాకేత వదినా మరదళ్ళుగా పదిమందికి ఆదర్శం అనిపించేలా ఎంతో అన్యోన్యంగా మసులుకుంటున్నారు (అయిపోయింది)

# నిర్ణయం

గిరిజా నారాయణ్

"రండి కూర్చోండి అంటూ అప్పుడే లోపలికి వచ్చిన వియ్యంకుడికి కుర్చీ చూపించాడు సత్యనారాయణగారు

దశరదరామయ్య ఏనాడో పక్షవాతం వచ్చి ఎడంకాలు పడిపోవటంతో వాకింగ్ ఎయిడ్స్ సహాయంతో నాల్గడుగులు ముందుకువేసి సత్యనారాయణ చూపించిన కుర్చీలో చేరగిలబడ్డాడు

ఎంతలో వచ్చినట్లున్నారు కాని మంచినీళ్లు త్రాగండి అంటూ కూతురు సుగుణకి వినపడేలా సుగుణా మీ మామగారు వచ్చారు ఓ గ్లాసెడు చల్లటి మంచినీళ్లు తేమ్మా అని కేకవేశాడు సత్యనారాయణ లోపల ఓ మూల కూర్చున్న సుగుణకు తండ్రి ఎలుపులో మీ మామగారు అన్న వాక్యం చెవిలో డ్రిల్లింగ్ యంత్రంతో చిల్లి వేసినంత ఘోరంగా వినిపించింది అందుకు కారణం నాల్గు రోజుల క్రితం ఆమె జీవితాన్నే మార్చేసే సంఘటన జరగడమే ఆమెకిప్పుడు జీవితంపైనే ఏదో తెలీని కసి అందులో ముప్పయి రోజుల క్రితం ఏర్పడ్డ బంధాలు అంతలోనే తెగిపోతున్న బంధాలు అయోమయం యిదంతా ఎవరో తనతో ఆడుకుంటున్నారనే బావం కూడాకావచ్చు తప్పదు కనుక మానవత్వంరీత్యా పాటించాల్సిన మర్యాద కనుక లేచివెళ్ళి నీళ్ళు తెచ్చి పరదా చాటునుండి మంచి నీళ్ళ గ్లాసు బయటకు కన్పించేలా చెయ్యిపెట్టింది

అది చూసి మంచి నీళ్లు తెచ్చింది తీసుకోండి అని సత్యనారాయణగారు అనటంతో దశరద రామయ్య తలుపు వైపు తిరిగి మంచినీళ్ల గ్లాసు అందుకున్నాడు మంచినీళ్లు త్రాగి గ్లాసు ప్రక్కనే ఉన్న బల్లపైపెట్టి వెనక్కి ఒరిగాడు

సత్యనారాయణ కూడ మౌనంగా ఉండి పోయాడు- అవతల వచ్చిన దశరదరామయ్య నుంచి సంబాషణ మొదట ప్రారంభం కావటం కోసమన్నట్లుగా

ఆయన ఊహించినట్లుగానే దశరదరామయ్య అమ్మాయి ఎలాఉంది' అంటూ సంబాషణ ప్రారంబించాడు

ఎలా ఉంటుంది? జరిగినదానికి పెద్దవాళ్లం మేమే షాక్‌నుంచి తేరుకోలేక పోతున్నాం పసిదాని మానసిక స్థితి గురించి వేరే చెప్పాలా? ఓ రకంగా బదులు ప్రశ్న వేసినట్లే సమాదానం చెప్పాడు సత్యనారాయణగారు

అవుననుకోండి యిలా జరుగుతుందని కన్నవాళ్లం మేమైనా ఊహించామా? ఏది బలీయం అనిపెద్దవాళ్ళు ఊరికే అనలేదుగదా ఆ మాటకొస్తే పట్నంత కొడుక్కి అలాంటి దుర్బుద్ధి పుడుతుందని ఎవరు కలగన్నాం నవమాసాలు మోసికన్నందుకు యింతవాడ్ని చేసినందుకు వాడి తల్లి ఎంత దుఃఖం అనుబవిస్తుందో మాటల్లో ఎలా చెప్పగలను ఆ పరమాత్మకే తెల్సు అయినా మీరూ పిల్లలు కలవాళ్లే మీకు తెలీందేముంది? చివరి మాటలంటున్నప్పుడు దశరథరామయ్య గొంతు సన్నగా మారి బొంగురుపోయింది

దశరదరామయ్య హృదయా వేదనను అరం చేసుకోలేనంతటి కఠినుడుకాదు సత్యనారాయణ కాని కొడుకును కన్నవాళ్ళు ఆలోచించిన దానికన్నా రెండు రెట్లు ఎక్కువగా ఆలోచించాల్సిన వాడు తను ఈ రోజు సమాజంలో ఆడపిల్ల ఆడపిల్లను కన్నవాళ్ల పరిస్థితి అలాఉంది కాబట్టి

నిజమే ప్ప యింత పెద్ద వాళ్ళయి మీరి దుర్ఘటన చూడాల్సి రావటం ఎల్లా నిచ్చుకొన్న మాకు అమ్మాయినిలా చూడాల్సి రావటం ఎంతో దుర్భరంగా ఉంది ఏ జన్మలో చేసిన పాపమో ఆ కొడుకును కన్నందుకు మీకు కూతుర్ని కన్నందుకు మాకు బగవంతుడీశిక్ష వేశాడు సత్యనారాయణ కూడ గాద్గదిక కంఠంతోనే దశరథరామయ్యను ఊరడించేందుకు ప్రయత్నించాడు

వాళ్లిద్దరి సంబాషణ తలుపు చాటునుంచి వింటూనే ఉంది సుగుణ ఆమె మనస్సులో అంతకు నాల్గురోజుల క్రితం ప్రేలిన అగ్నిపర్వతం లావానింకా ఎరజిమ్ముతూనే ఉంది మొదటసారి ఆ వార్త విన్నప్పుడు అమాంతం తడగోడలా విరుచుకు పడిపోయింది ఆ తర్వాత మాట మాటకి స్పృహ తప్పటం తెలివి రావటం అందర్ని కలవరపర్చింది

ఆమె చాలా బలహీనంగా ఉందని చెప్పారు పరీక్షించిన డాక్టర్లు

మేం విశాఖపట్నం వెళ్ళిపోతున్నాం ఈ సాయంత్రం గోదావరి ఎక్స్‌ప్రెస్‌కు కర్మకాండ అంతా అక్కడే జరిపిస్తాం ఏదో రోజుకు అక్కడికి అమ్మాయిని తీసుకురండి మిగతా అన్ని విషయాలు అక్కడే జరిపిద్దాం అంటూ లేచాడు దశరద రామయ్య తను వచ్చిన పని పూర్తయినట్లు

చూడండి ఈ విషయం అమ్మాయితో కూడ ఓసారి చెప్పి వెళ్ళండి యిలా అంటున్నందుకు మరోలా బావించవద్దు నా పరిస్థితికూడా కక్కలేక మింగలేకన్నట్లుంది అన్నాడు సత్యనారాయణ గారు

అమ్మాయి సుగుణా- ఓ సారి యిటురామ్మా పిల్చాడు దశరదరామయ్య

తలుపు దగ్గరే నిల్చున్న సుగుణకు ఆయనేం చెపుతారో తెల్సినా మర్యాదకోసం యిక్కడే ఉన్నాను చెప్పండి అని ఊరుకొంది

ఏమీలేదు అబ్బాయి దశదినకర్మ మా స్వంత యింట్లోనే పెట్టాలని సంకల్పించాం నువ్వుకూడ పదోరోజుకి అక్కడికి రావాలి లేకపోతే అబ్బాయి ఆత్మకు శాంతి ఉండదు సుమా

క్షమించండి ఏ ముఖం పెట్టుకురావాలి నేను ఆ ఊరు మా ముప్పయి రోజుల సంసారం గురించి నల్గురు నన్ను నాల్గు విదాలగా అనుకొంటుంటే అవి వింటూ అక్కడ నేను ఎలా ఉండగలను మీ అబ్బాయి ఆత్మశాంతి కోసం నేను యిక్కడనే భగవంతుడ్ని ప్రార్థిస్తాను దయచేసి నన్ను బలవంతం చేయకండి నిష్కర్షగా ముందు చెప్పాలనుకొన్నట్లే చెప్పేసింది సుగుణ

అలా అంటే ఎలాగమ్మా' చదువుకొన్న పిల్లవి ఎవరో ఏదో అంటారని మనం ఆచారాలు సంప్రదాయాలు వైదిక సంస్కారాలు వదులు కొంటామా' నచ్చ చెప్పబోయాడు దశరద రామయ్య

పెద్దవారు మీతో వాదించటం నా కిష్టంలేదు పైగా అనవసరంకూడా అలాంటి వాటిపట్ల గౌరవం మీ అబ్బాయికే ఉంటే యిలాంటి నీచమైన అకృత్యానికి పాల్పడి నా నూరేళ్ళ జీవితం ఆదిలోనే అందకార బంధురం చేసేవాడుకాదు మీ అబ్బాయికి ఉగ్గు పాలతో నేర్పలేకపోయారా వైదిక సంస్కారం ఆద్యాత్మిక చింతన' మీ అబ్బాయికి నచ్చ చెప్పుకోలేని మీరు ఆయన పోయాక కోడలికి నచ్చ చెప్పాలని ప్రయత్నించటం ఏమంత మంచి ప్రయత్నంకాదు దయచేసి వెళ్ళిరండి ఖరాఖండీగా చెప్పింది సుగుణ

దశరథరామయ్య నోట మాట పెకల్లేదు సత్యన్నారాయణవైపు నిస్సహాయంగా చూశాడు ఆయన తలవంచుకుని నిలబడ్డాడు చేసేదిలేక వెనుదిరుగుతూ మరి నేవెళ్తాను మీకు విషయం చెప్పటం నా బాద్యత ఆపై మీ ఇష్టం అంటూ వాకింగ్ స్టిక్స్ సహాయంతో బయటికి అడుగు వేశాడు

★ ★ ★ ★ ★

సత్యన్నారాయణగారి ఏకైక కూతురుగా నల్గురన్నదమ్ముల మధ్య ఒకే ఒక చెల్లెలిగా మమతానురాగాలను పంచుకుంటూ ఐశ్వర్యం

తెచ్చిన ఆనందంతో ఓలలూగుతూ యుగమో క్షణంగా యిరవైయ్యేళ్ళ జీవితాన్ని హాయిగా నెట్టేసింది సుగుణ ఏనాడు తనకంటూ ఓ సమస్య లేకుండా పెంచి పెద్ద చేశాడు సత్యన్నారాయణ గారు అలా పెరిగిన సుగుణకు గత నెలలో వినయ్ చేతుల మీదుగా మూడు ముళ్ళు పడ్డాయి

వినయ్ తండ్రి దశరధరామయ్య ఒకప్పుడు విశాఖపట్నంలో పేరుమోసిన లాయరు పక్షవాతం రావడంతో ఆయన కోర్టుకు పోలేని పరిస్థితివల్ల ప్రాక్టీసు అంతా అడుగంటి పోయింది దశరధ రామయ్య పెద్ద అల్లుడు హైదరాబాదులో ప్రముఖ కంపెనీకి సెక్రటరీ ఎన్నో కంపెనీలపై ఆజమాయిషి పలుకుబడి ఉన్నవాడు ఆ పలుకుబడితోనే దశరధరామయ్య కొడుకు వినయ్ డిగ్రీ కాగానే హైద్రాబాదుకు పంపించి మంచి కంపెనీలో ఎకౌంట్స్ ఆఫీసరు ట్రెయినీగా వేయించి తర్వాత సంవత్సరానికే ఎకౌంట్స్ ఆఫీసరు అయ్యేలా చేశాడు అల్లుడు

వినయ్ ఉద్యోగం చేస్తూ ఒంటరిగా ఉండాల్సిన కర్మ యేమిటని దశరధ రామయ్య అతనికి సంబంధాలు వెతకటం ప్రారంభించాడు ఎన్నో సంబంధాలు చూశాడు కొంతమంది అమ్మాయిలు వినయ్‌కు నచ్చకపోతే మరి కొందరు ప్రైవేటు ఉద్యోగం ఎప్పుడుంటుందో ఎప్పుడు ఊడుతుందో నన్న భయంతో పిల్లనివ్వడానికి ముందుకు రాలేదు యిలా కొన్ని సంవత్సరాలు వినయ్ పెళ్లి ప్రయత్నం ఒడ్డుకు రాలేదు

ఈ లోపల వినయ్ తన బావగారు కుదిర్చిన కంపెనీ యాజమాన్యంతో గొడవపడి వేరే కంపెనీలో చేరాడు ఈ కారణంగా వినయ్‌కు అతని బావగారికి మధ్య బేదాభిప్రాయాలు తలెత్తాయి యిప్పుడు వినయ్ బావగారింటనుంచి మకాం బంజారాహిల్స్‌కు మార్చేశాడు అయినా అప్పుడప్పుడు బావగారి దగ్గరికి అదికూడా తన అక్కయ్యను చూడటానికంటూ వెళ్ళేవాడు

వినయ్ అవస్థలు చూడలేక వాళ్ళక్కయ్య కూడా సంబందాలు చూసి ప్రయత్నంలోని అడుగు



పెట్టింది. ఫలితంగా ఎవరి ద్వారానో సత్యన్నారాయణగారి అమ్మాయి సుగుణ గురించి తెల్సింది. సుగుణ గురించి విచారించారు. హైదరాబాదులో కోటీ స్త్రీల కళాశాలలో డిగ్రీ చదివి, ట్రిపు లోయరు, హైయ్యరు, షార్టుహేండు, తెలుగు, ఇంగ్లీషు కూడ ప్యాసయిందని, ప్రస్తుతం వాళ్ళ బాబాయి దగ్గర ఉంటుందని తెల్సింది.

మధ్యవర్తి ద్వారా వినయ్ సుగుణని చూడటం, యిద్దరూ ఒకరికొకరు నచ్చటం వెను వెంటనే వాళ్ళ వివాహం జరగటం కూడ అయిపోయాయి. దంపతులిద్దరూ బంజారాహిల్స్‌లో కాపురం పెట్టారు.

క్రొత్త కాపురం మృదుమధుర లయలతో ప్రారంభమయింది. యింటికొచ్చిన స్నేహితులు బంధువులు కొత్త జంటను చూసి మురిసి పోయారు కాని వినయ్ మానసికంగా చాలా బలహీనుడని పిరికివాడని హఠాత్తుగా ఊహించనిది జరిగితే తట్టుకోలేని వాడనిగాని అటు సుగుణగాని యిటు అతని మిత్రులుగాని ఎవ్వరూ ఊహించలేదు ఫలితంగా సంసారం పెట్టి ముప్పయి రోజులు కూడ కాకముందే తను చేరిన క్రొత్త కంపెనీ యాజమాన్యంతో గొడవపడి ఉద్యోగానికి రాజీనామా చేసివచ్చి సుగుణను వాళ్ళింటికి పంపి ఆత్మహత్య చేసుకొన్నాడు వినయ్ నూరేళ్ళ వైవాహిక జీవితం ముప్పయి రోజుల్లోనే ముచ్చట తీర్చుకొని నిష్క్రమించింది సుగుణ జీవితంలోంచి సరిగా ఈ ముప్పయి రోజుల బంధాన్నే ఎలా జీర్ణించుకోవాలో తెలీక సతమత మవుతున్నది సుగుణ

* * * * *

రోజులు గడుస్తున్నకొద్దీ యింట్లో అందరూ విశాఖపట్నం వెళ్లే ప్రయత్నంలో సుగుణను ఒప్పించడానికే ప్రయత్నించసాగారు ఆఖరికి ఎంతో చదువుకొన్న అన్నలు తమ్ముళ్లు కూడ సుగుణ సంప్రదాయం నిర్దేశించినట్లుగానే చేయాలని వాదించసాగారు ఈలోగా విశాఖపట్నం నుంచి సుగుణకు ఆమె తండ్రికి రెండు ఉత్తరాలు వచ్చాయి విశాఖపట్నం రమ్మని

సుగుణ తన అన్నదమ్ములతో సంప్రదాయం పుట్టుపూర్వోత్తరాల నురించి వాటి వెనుకనున్న స్వార్థపు విలువలు, పురుష సమాజం ఉత్పత్తి చేసిన సూత్రాలు- ఎంతో చర్చించింది కాని వాళ్లు ఆమె వాదనలోని వాస్తవాన్ని గ్రహించటానికి ససేమిరా అన్నారు ఈ గొడవల్లో మౌనం పాటించింది ఆమె తండ్రి మాత్రమే

తొమ్మిదవరోజు దగ్గర పడుతున్నది ఆఖర్కి స్త్రీ అయిఉండి కూడ తనతల్లి తనని వైధవ్యం అంగీకరించమనటం ఆమె మనస్సును కకావికలం చేసింది అంతకు ముందు రాత్రి సుగుణకు నిద్రపట్టలేదు

ముప్పయి రోజుల వైవాహిక జీవితం తనపై ఎన్ని క్రొత్త నియమాలు నిబంధనలు రుద్దబోతున్నది తల్చుకొంటే తన ఒళ్లు గగుర్పొడుస్తున్నది ఈ



**రైల్వే నుండి ఇటీవల రిటైరయిన ప్రసిద్ధ రచయిత శ్రీ ముద్దంశెట్టి హనుమంతరావుకు ప్రభవ ఉగాది సందర్భంగా ఖరగ్‌పూర్ సాహితీ స్రవంతి వీడ్కోలు జరిపింది ఆయనకి అభినందన పత్రం అందజేస్తున్న సంస్థ అధ్యక్షులు శ్రీ బి సుందరరావు కార్యదర్శి శ్రీ ప్రహ్లాదు కూడా చిత్రంలో ఉన్నారు**

# నిర్ణయం

కొన్ని రోజుల అనుబంధం తెగినందుకు తను జీవితాంతం ఎందుకు వైధవ్యం అనుభవించాలో బోధపడటం లేదు 'ఆయన తన బాధ్యత విస్మరించి నిష్కారణంగా పిరికివాడై ఆత్మహత్య చేసుకొంటే దానికి తనెందుకు బలికావాలి? ఎవరు సంప్రదించి ఆయనీపని చేశారు?

యిప్పుడు విశాఖపట్నం వెళ్తే అక్కడ తన గాజులు పగలగొడ్తాం అంటారు బొట్టు చెరిపేస్తాం అంటారు అన్నింటికీ మించి ముత్తయిదువులంతా పదవ రోజు తన్ను పసుపు కుంకుమతో చూడాలని తండోపతండాలుగా వస్తారు తనకా రోజుతో సంఘంలో పుని స్త్రీగా విలువ పోయినట్లు దేనికి 'తనేమి పాపం చేసిందని తనకీ శిక్ష' ఈ అవమానం తనెందుకు భరించాలి ఆయన చేసిన అకృత్యానికి తను ఎందుకు శిక్ష అనుభవించాలి?

ఆయన సహజంగా మరణించి ఉన్నా లేక తన మానప్రాణాల కోసం జీవితం త్యాగంచేసి ఉన్నా ఆయన కోసం తను గాజులు బొట్టూ అన్నీ వదులుకొని జీవితాంతం తెల్లచీరలో ఉండి పోవచ్చు కాని యిది అలాంటిదికాదే ఆయన కష్టమేమిటో చెప్పుకోనేందుకున్న ఏకైకతోడు తాను తనక్కూడా చెప్పుకోకుండా అలా ఏకపక్షంగా నిర్ణయం తీసుకొన్నాడంటే తనని భార్యగా పరిగణించలేదనేగదా అర్థం

నాతి చరామి అని ప్రమాణం చేసి నా జీవితానికి రక్షణలేకుండా చేసి వెళ్ళిపోయిన ఆయన కోసం ఈ విషాద పరిస్థితిని తను జీవితాంతం ఎందుకు ఎదుర్కోవాలి ఒకసారి బొట్టు గాజులు అందరి ముందూ తీసేసాక అవి యిక తాను మళ్లీ పెట్టుకొన్నా ఏమి విలువ, సంతృప్తి తనకుంటాయి. అది తన ఆత్మాభిమానాన్ని ఎలా వెక్కిరిస్తుందో, ఆ వెక్కిరింపును తను సహించగలదా?

తనవాళ్ళని ఎదిరించి తను విశాఖపట్నం రానంటే తనకీ యింట్లో ఉన్న స్థానమేమిటి? సంప్రదాయానికి, మూఢనమ్మకాలకు విలువనిచ్చే కుటుంబ సభ్యులు తాను అందుకు అంగీకరించనందుకు తనపట్ల చూపే అభిమానం ఎటువంటిది? తనపై వేలు ఖర్చుపెట్టి తండ్రి పెళ్లి చేసిననాడే తనకీ కుటుంబంతో బంధం తెగిపోయింది. యిక తాను ఈ యింట్లో ఉన్నా వీళ్ళకి భారంగానే ఉంటుంది. తన కాళ్ళపై తాను నిలబడలేని అశక్తురాలికి ఎవరి అండదండలో అవసరం కాక తప్పదు. కాని తన పరిస్థితివేరు తాను విద్యాధికురాలు తనుకూడ వీళ్ళకు లొంగి గాజులు పగులగొట్టించుకోవటం బొట్టు తీసేయించుకోవటం తెల్ల చీర కట్టుకు తిరగటంలో అర్థంలేదు

ఈ ఆలోచనలతోనే రాత్రి పొద్దు పోయేవరకూ గడిపింది సుగుణ

చివరికి సుగుణ మనస్సును దిటవు చేసుకొంది ఓ నిర్ణయానికి వచ్చింది వితంతు వివాహమైతే జరిపించాడు కాని వీరేశలింగం- స్త్రీని వితంతువును చేసే తీరును సమాధి చేయలేకపోయాడు ఈ దరిద్ర సంప్రదాయం యిలా ఎంత కాలం కొనసాగుతుందో తనలాంటివాళ్ళు ఎంతమంది దీన్ని ఎదుర్కోవాల్సి వస్తుందో ఎవ్వరూ ఆలోచించటంలేదు తన నిర్ణయాన్ని వెంటనే అమలు జరపాలనుకొంది ఒక్కసారి నిట్టూర్చి లేచి బాత్‌రూమ్‌కెళ్లి స్నానం చేసి వచ్చింది అద్దం ముందు కూర్చుని జుట్టుదువ్వుకొంది చక్కగా బొట్టుపెట్టుకొని మనసారా తనని తాను అద్దంలో చూసుకొంది ఓసారి క్రిందికి వెళ్లి అందరూ పడుకొని ఉన్నారో లేదో చూసివచ్చింది తన సర్టిఫికేట్లు బట్టలు చిన్న అద్దం కుంకుమభరిణె దువ్వెన పెట్టిలో పెట్టుకొంది చప్పుడు కాకుండా బయటకొచ్చి తలుపు దగ్గరకేసింది

అప్పుడే అందఘన ఓ పావురం రెక్కలు టపటపలాడిస్తూ గాలిలోకి ఎగిరింది హాయిగా ఈ విశాల ప్రపంచంలో తాను ఎక్కడైనా జీవించ గలనన్న ఆత్మవిశ్వాసంతో ముందుకు సాగిపోయింది

అర్థంలేని సాంప్రదాయాలకు స్త్రీ బానిసగా నిల్చిపోగూడదనే తనవాదన ఆత్మ హత్య చేసుకొన్నా ఏ పిరికివాడి భార్య ఈ సంప్రదాయాలకు లొంగనక్కర్లేదు అన్న హృదయం తీర్పును అనుసరించి బయటకొచ్చిన తను తనవారికి చనిపోయిన దరిద్రపువాళ్ళకి ఓ బరితెగించిన దానిలా క్రూయిరాలుగా అమానుషమైన స్త్రీగా కన్పించవచ్చు కాని తనకు మాత్రం తన నిర్ణయం నేరమనిపించటంలేదు

అదే ఆలోచనతో ముందుకు సాగిపోయింది సుగుణ ఆమె తీసుకున్న నిర్ణయం అక్రమమూ సక్రమమూ తేల్చాల్సింది ఈ జడ సమాజం □

## సైనిక కేంద్రంలో కృష్ణ దేవాలయం

సైన్యంలో ఉన్నంత మత సామరస్యం మరెక్కడా ఉన్నట్టు లేదు సైనికుల ఏకైక లక్ష్యం దేశ రక్షణ గనుక వారు ఎంతో ఐకమత్యంతో మెలగుతారు హిందువుల పండుగలప్పుడు ఇతర మతస్థులు ఇతర మతస్థుల వారి పండుగలకు హిందువులు పరస్పరం అబినందించుకోవడం విందులు చేసుకోడం పటాలంలో పరిపాటి ఈ దృష్టితో గోలకొండ ఆర్టిలెరీ సెంటర్‌లో ఏప్రిల్ 23న కృష్ణ దేవాలయం ప్రతిష్ఠ శాస్త్రోక్తంగా జరుగడం ప్రశంసనీయమైన సంగతి ఈ మందిరం రెండు యకరాల భూమిలో సుందరంగా నిర్మితమైంది 15 లక్షలు వ్యయమైంది సైనికులు బ్రిగేడియర్ శ్రీ ఎస్ సంకేకర్ నాయకత్వంలో కరసేవ చేశారు ఈ దేవాలయంలో అదిష్ఠాన దేవత రాధాకృష్ణులైనా దుర్గా సీతారామ గణేశ హనుమద్విగ్రహాలు ప్రతిష్ఠించబడ్డాయి ఈ విగ్రహాలన్నీ జయపూర్ చలువరాతితో నిర్మించబడ్డాయి శివలింగం కాశీ నుంచి శ్రీ వేంకటేశ్వరుని నల్ల రాతి విగ్రహం తిరుపతి నుంచి తెప్పించి ప్రతిష్ఠించారు సైనికులు తమ అబిరుచులకు సంప్రదాయాలకు అనుగుణంగా ఏ మూర్తినైనా ఆరాదించవచ్చు దేవాలయ కుడ్యాలు గోపురాల నిర్మాణంలో అందంగా దోల్‌పూర్ ఎర్ర ఇసుకరాయి మక్రానా పచ్చ చలువరాయి వాడడం నిర్మాతల కళా దృష్టికి తార్కాణం కృష్ణ దేవాలయం సరసనే గురుద్వారా మసీదు చర్చి ఉన్నాయి సైన్యంలోని ఇతర మతస్థులు తమ విశ్వాసాలకు అనుగుణంగా పూజాదికం నిర్వర్తించవచ్చు ఈ దేవాలయం రూపు రేఖలను నగరంలోని చావ్లా డిజైన్ గ్రూప్ అనే వాస్తు సంస్థ తీర్చి దిద్దింది ఈ దేవాలయం వల్ల ఆ ప్రాంతం శోబ అతిశయించింది

## శ్రీ బాపురెడ్డికి సన్మానం

శ్రీకృష్ణదేవరాయాంధ్ర బాషా నిలయంలో ఏప్రిల్ 22 సాయంకాలం జరిగిన మాడపాటి సుకుమార్ స్మారక సాహిత్యోపన్యాస కార్యక్రమంలో ప్రముఖ కవి శ్రీ జి. బాపురెడ్డి (ఐ. ఏ. ఎస్.) స్వీయ కవితపై ప్రసంగిస్తూ "ప్రణయమైనా, ప్రణవమైనా, ఆర్థిక ప్రగతి అయినా ఆనందమయ జీవితానికే తోడ్పడాలి. నవరసభరితమైన జీవితం నిర్వచించే నిర్దేశించే ఆదర్శం, ఆశయం ఒకటే" అని అన్నారు. సమతా సత్యదర్శనం కలిగించే ఏ సాహిత్యమైనా అభ్యుదయగామియే అని, సమాదరణీయమేనని అన్నారు. శ్రీ బాపురెడ్డి తను రచించిన "శ్రీకార శిఖరం", "మన చేతుల్లోనే ఉంది" అనే కవితా సంపుటాల నుంచి కొన్ని కవితలు చదివి వినిపించారు. సభకు అధ్యక్షత వహించిన డాక్టర్ దాశరథి మాట్లాడుతూ, ఆధునిక తెలుగు సాహిత్యంలో శ్రీ బాపురెడ్డికి గల ప్రత్యేక స్థానాన్ని వివరించారు. శ్రీ బాపురెడ్డి జీవిత సత్యాలను, జీవిత తత్త్వాలను కవితా దృష్టితో అన్వేషించి తన లేఖిని ద్వారా అనేక కావ్యాలను తెలుగు సాహిత్యానికి

# హైదరాబాదు నోట్‌బుక్

అందజేసిన బావుకుడు ప్రతిబావంతుడు సత్యాన్వేషి అని ప్రస్తుతించారు బాషా నిలయం అధ్యక్షులు శ్రీ అవ్వా సత్యనారాయణరావు శ్రీ బాపురెడ్డిని నూటపదార్లతోను నూతన వస్త్రాలతోను సత్కరించారు సబా ప్రారంబంలో బాషా నిలయం కార్యదర్శి శ్రీ ఎం ఎల్ నరసింహారావు సబికులకు స్వాగతం చెబుతూ సుకుమార్ స్మారక సాహిత్యం కార్యక్రమం క్రింద ప్రతి సంవత్సరం నలుగురు కవులను లేక పండితులను సన్మానించడం జరుగుతున్నదని అన్నారు శ్రీ అక్కిరాజు వెంకటజనార్దనరావు వందన సమర్పణతో సమావేశం సమాప్తమైంది

## రామాయణ మకరందం ఆవిష్కరణ

రామాయణం కట్టు కథ దానిలోని ఏ సంఘటనా హేతువులకు నిలవదు దానిలోని ఏ స్థలమూ చరిత్రకు నిలవదు దానిలోని ఏ వ్యక్తి నిజమైనవాడు కాదు అది కేవలం ఆహారం సేకరించే తెగకూ ఆహారోత్పాదకమైన బృందానికీ జరిగిన సాదారణ సంఘర్షణ కొందరు పనిగట్టుకొని రామాయణ పాత్రలను ఆకాశానికి ఎక్కించారు అయోధ్య ఏ పురాతత్త్వ పరిశోధనకూ అందని కృత్రిమ స్థలం ఇలా ఎన్ని విమర్శలు బయలు దేరినా ప్రజలకు రామాయణంపై వ్యామోహం తగ్గడంలేదు నిజానికి రామాయణం జరిగిందో లేదో ప్రజలకు అనవసరం వారికి ప్రమాణం వాల్మీకి వాక్కు వాల్మీకి చెప్పితేగదా మనకు రామాయణ పాత్రలు తెలిశాయి హనుమంతుడు అనగానే మూర్తీబవించిన విశ్వాసం మన కళ్ళెదుట నిలబడుతుంది సీత అనగానే నిత్యానపాయిని బర్త వెంట నడిచేది అరణ్యాలనే సుఖ సౌదాలుగాబావించేది అవసరమయినప్పుడు మంత్రంగ చెప్పేది అయిన వీర వనిత ప్రత్యక్షమవుతుంది ఇలాఅన్ని పాత్రలూ వీటిని మనకు అందించినవాడు వాల్మీకి అతని మాటలలో మధువు వుంది దానినిమనం వదలలేకవున్నాం ఆ పాత్రల లాగ అవుదామనుకుంటున్నాం మనమేకాదు ఎవరైనాఅనుకుంటారు ఇట్టి ఆకర్షణ వుంది కనుకనే వాల్మీకి తన రామాయణం యావత్ స్థాస్యంతి గిరయః కొండలు సాగరాలు వున్నంతవరకు వుంటుందని నమ్మకంగా చెప్పాడు అతడు చెప్పినట్లే మనదేశంలో ప్రతి ఏటా దాని పుత్రికలు పుట్టాయి పుడుతున్నాయి అలాటి నవ శిశువు శ్రీమద్రామాయణ మకరందం దీనిని శ్రీ సూరంపూడిరాదాకృష్ణమూర్తి రచించారు ఈయన వృత్తి రీత్యా అడ్వకేటు ఇది గేయ రూపంలో ఉంది తాము దీనిని తొమ్మిది సంవత్సరాల నిరంతర కృషితో పూర్తి చేశామని తన బాద్యత సక్రమంగా నిర్వచించానని అన్నారు ఈ శ్రీమద్రామాయణ మకరందావిష్కరణ శ్రీ రామనవమినాడు ఏప్రిల్ 8న వేంకటాద్రి థియేటరులో వైబవోపేతంగా జరిగింది రామాయణ మకరంద షట్కాండ గేయ సంపుటాలను వేదోక్తంగా ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు శ్రీ చండిక సాంబశివరాజులు ఆవిష్కరించారు సబకు ప్రముఖ న్యాయవాది శ్రీ ఎం ఫస్ కె శాస్త్రి అద్యక్షత వహించారు శ్రీ మండపాక పార్వతీశ్వరశాస్త్రి శ్రీమద్రామాయణ మకరందం ప్రత్యేకతను గురించి

ఏప్రిల్ 22న శ్రీకృష్ణ దేవరాయాంధ్ర బాషా నిలయంలో మాడపాటి సుకుమార్ స్మారక ప్రసంగా వళిలో ప్రసంగించిన శ్రీ బాపురెడ్డి (ఐ ఎ ఎస్) గారిని సన్మానించినప్పటి ఫొటో ఎడమ నుంచి బాషా నిలయం కార్యదర్శి శ్రీ ఎం ఎల్ నరసింహారావు అద్యక్షులు శ్రీ అవ్వా సత్యనారాయణరావు శ్రీ బాపురెడ్డి డాక్టర్ దాశరథి నిలయం సహాయ కార్యదర్శి శ్రీ అక్కిరాజు వెంకట జనార్ధనరావు



# అవీ-ఇవీ-అన్నీ

## నెఫ్హా సంగీత, నృత్య కళా పరిషత్

నెఫ్హా ఫిలిం జర్నలిస్టు అసోసియేషన్ వారు జూలై రెండవ వారంలో అఖిల భారత స్థాయిలో పాటలలోను డాన్సులలోను పోటీలు నిర్వహిస్తారు ఈ సందర్భంగా కూచిపూడి భరతనాట్యం, జానపద నృత్యం రికార్డు డాన్సులలోను లలిత సంగీతం సినిమా పాటలు హిందీ సినిమా పాటలు, జానపద గేయాలలోను పోటీలు నిర్వహిస్తారు పై పోటీలకు సినీ సంగీత దర్శకులు, సినీ నృత్య దర్శకులు న్యాయ నిర్ణేతలుగా వ్యవహరిస్తారు వివరాలకు – నెఫ్హా నాటక కళా పరిషత్, నియర్ అనితా హాలు నెల్లూరు-524003కి వ్రాయండి

## ఢిల్లీలో ఉగాది వేడుకలు

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వపు స్పెషల్ కమీషనర్ ఢిల్లీలోని ఆంధ్రప్రదేశ్ భవన్‌లో తొమ్మిది రోజుల పాటు ఉగాది వేడుకల్ని నిర్వహించారు

తెలుగు సంవత్సరాది నాడు ప్రారంభమైన ఈ సంగీత నృత్య నాటకోత్సవాలు శ్రీరామనవమితో ముగిసాయి

మొదటి రోజు కె సి సుబ్బయ్యగారి పంచాంగ శ్రవణం తరువాత రామసుబ్బారెడ్డిగారి బృందం వారు ప్రదర్శించిన సత్యహరిశ్చంద్ర నాటకంతో ప్రారంభమయి ఆ తరువాతి రోజులు పీసపాటి వారి బృందం శ్రీకృష్ణ రాయబారం' ఆచంట వెంకటరత్నంనాయుడు గారి బృందం తులసీ జలంధర శ్రీ వేమూరి రామయ్య బృందం మహారథి కర్ణ శ్రీ ఎ వి సుబ్బారావు బృందం గయోపాఖ్యానం శ్రీ వెంకటేశ్వరరావు బృందం 'శ్రీకృష్ణ తులాభారం వంటి పౌరాణిక నాటకాలని అత్యద్భుతంగా ప్రదర్శించి ఆ తరువాత శ్రీ కోదాడ నరసింహారావు కూచిపూడి నృత్య నాటికని, శ్రీ ఆర్ శ్రీనివాసమూర్తి కర్నాటక గాత్ర సంగీతం సాయి బృందం వారి బొబ్బిలి యుద్ధం బుర్ర కథతో పాటు చివరి రోజు శ్రీమతి సువర్ణలత బృందం సమర్పించిన గిరిజా కల్యాణంతో ముగిసాయి

ముఖ్యంగా ఆంధ్రుల సంస్కృతిని ప్రతిబింబింప జేసే ఆరు పౌరాణిక నాటకాలని ఏకబిగిని ప్రదర్శించి ప్రవాసాంధ్రులకు కనుల పండుగ వీనుల విందు కలుగజేసి, ప్రభవనామ సంవత్సరాదిని ప్రజ్వలింపజేసారు ☐

## హైదరాబాద్ నోట్‌బుక్

ప్రసంగించారు ప్రారంభంలో వెంకటాద్రి థియేటర్ యజమాని శ్రీ మల్లారెడ్డి స్వాగత వచనాలు పలికారు శ్రీ కనుమూరి పెద్దిరాజు గ్రంథానికి పూజ చేశారు గ్రంథ రచయిత శ్రీ సూరంపూడి రాధాకృష్ణమూర్తి గ్రంథం ఈ అమృత గడియలలో ఆవిష్కరణ కావడం తనకు మహానందకరంగా వుందని కృతజ్ఞతలు తెలుపడానికి నోట మాట రావడం లేదని అన్నారు వాల్మీకి తన రామాయణం పాఠ్యే గేయే చ మధురం అన్నాడు గనుక తాను కూడ గేయానుకూలంగా గేయాలలోనే వ్రాశానని అన్నారు శ్రీ పతానేని రామచంద్రరావు మకరందంలోని కొన్ని గేయాలను గానం చేశారు ఈ గ్రంథావిష్కరణ సందర్భంగా దిల్‌సుఖ్‌నగర్‌లోని మారుతి మందిరంలో అన్నదానం జరుగడం విశేషం సభ శ్రీమతి మండపాక ఉమాదేవి ప్రార్థనతో ప్రారంభమైంది

### శ్రీమతి వేదవతి శ్రావ్య కంఠం :

ఆస్తికులు సంగీతాన్ని భక్తికి సాధనంగా భక్తిని భవబంధ విచ్ఛేదానికి సాధనంగా గ్రహించారు నాదమే బ్రహ్మ కనుక నాదోపాసన బ్రహ్మ జిజ్ఞాసకు బ్రహ్మప్రాప్తికి మార్గమని విశ్వసించారు అందువల్లనే మన దేశమంతటా భక్తి సంగీతం వ్యాపించింది భక్తి సంగీతంతో ముంచెత్తిన వారిలో ప్రప్రథములు అన్నమాచార్యులు సోమనాథుడు తన బసవ పురాణం వేదంతో సమానమని చెప్పుకొనగా అన్నమాచార్యులు తన కీర్తనలు దివ్య ప్రబంధానికి దీటయిన వన్నారు ఆయన రోజు కొక కీర్తన రచించి పాడి పాడించి గొప్ప సంప్రదాయం నెలకొల్పి సంకీర్తన లక్షణాచార్యులయ్యారు ఆయన పెద్ద భార్య 'తిమ్మక్క మంజరీ ద్విపదలో పెక్కు రచనలు చేశారు వాటిలో మనకు ఇప్పుడు మిగిలినవి సుభద్రా కల్యాణం, మేలుకొలుపు మాత్రం ఆమె తన రచనల చివర తాళ్ళపాకాన్నమయగారి తరుణి తిమ్మక్క చెప్పె అని చెప్పుకొన్నారు ఈ తిమ్మక్క తిమ్మప్ప అని పాఠాంతరం పొంది జ్యేష్ఠ సోదరీ వాచకమైన ఫారసీ శబ్ద ఆపా తెనుగులో అప్పగా కలిసిపోయింది దానినిబట్టి కొందరు తిమ్మప్ప అని మరొక పురుష పుంగవుని సృష్టించి తిమ్మక్క అస్తిత్వాన్నే శంకిస్తున్నారు తాళ్ళపాకన్నమయగారి అన్నమయవారి అన్నమయవారు అని వివిధాలుగా వున్న ఈ వాక్యాలను గ్రంథ ప్రచురణ సంస్కరణ సంప్రదాయం ఏమాత్రం తెలిసిన వాడయినా అన్నమయగారి తరుణి అని సవరించుకుంటాడు ఏమైనా తాళ్ళపాక వారి కీర్తనలు ఏ దృష్టితో చూచినా గొప్పవి గనుక ప్రచారం పొందుతున్నాయి రాష్ట్రప్రభుత్వమూ, తిరుపతి దేవస్థానంవారూ శ్రద్ధగా ప్రచారం సాగిస్తున్నారు ఈ ప్రచారంలో భాగంగా ఏప్రిల్‌రెండవ వారంలో రాష్ట్ర సాంస్కృతిక శాఖ రవీంద్ర భారతిలో ఏర్పాటు చేసిన భక్తి సంగీత కార్యక్రమంలో శ్రీమతి వేదవతీ ప్రభాకర్‌గారు అన్నమాచార్యుల రామదాస కీర్తనలు, సురదాసు, మీరాబాయి భజనలు పాడి శ్రోతలను భక్తి ప్రవాహంలో ముంచెత్తారు శ్రీమతి వేదవతిగారి శ్రావ్యమైన కంఠం భక్తి సంగీతానికే రూపొందిందా అన్నంత మధురంగా వుంది గానం ఆమె పలుకు తేనెల తల్లి ఆకటివేళల మున్నగు అన్నమాచార్య కీర్తనలను తుమ్ బిన్ మోరే కౌన్ ఖబర్‌లే మున్నగు మీరా భజనలను తక్కిన వారి కీర్తనలను పాడారు శ్రీమతి అమ్ముల సత్యవతి వాయులీనం, శ్రీ దత్తాత్రేయ వేణువు శ్రీ నారాయణ్ తబలా అనుగుణంగా ఉన్నాయి శ్రీమతి ఆశాలతా రాము వ్యాఖ్యాత్రిగా వ్యవహరించారు

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాంస్కృతిక వ్యవహారాల శాఖ ఆధ్వర్యాన ఏప్రిల్ 15వ తేదీన హైదరాబాద్‌లోని రవీంద్ర భారతిలో జరిగిన సాంస్కృతిక కార్యక్రమంలో భాగంగా భారత కళాప్రపూర్ణ డాక్టర్ నటరాజ రామకృష్ణగారి శిష్యురాండ్రు కుమారి జి అలకనంద కుమారి వై పద్మజలు ఆంధ్ర నాట్యం ప్రదర్శించారు



### ఉపశ్రుతి :

ఉపాధ్యాయుడు పార్కు అంటే ఏమిటి?

విద్యార్థి చెత్తపోసే స్థలం

ఉపా ఏమిటి? మతిపోయిందా?

విద్యార్థి పోలేదు సార్ మా యింటిపక్కన పార్కు వుంది చుట్టుపక్కలవాళ్ళు నాలుగు వైపుల నుంచి దానిలోకి చెత్తపోస్తారు

-తిరుమల రామచంద్ర

Printed and Published for Nageswara Rao Estates Private Ltd, by S Nageswara Rao, at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada - 520 003 Acting Editor M Madhava Rao, Chief Editor S Radhakrishna. Phones Business 61247, 61248, 75569 Editorial 75667

# ఇమామి
## కేర్ టాల్క్

# మూడు క్రొత్త ఫ్రెంచ్ సువాసనలలో

అవేవవగా—'కూల్ ఏజ్ స్ప్రింగ్', 'వైల్డ్ ఏజ్ ఫారెస్ట్', 'ఫ్రెష్ ఏజ్ ఫ్లవర్స్' సరిపోల్చేందుకు సాటిలేని మూడు క్రొత్త ఫ్రెంచ్ సువాసనలు. అదొక నూతన భావం. అదొక క్రొత్త లాలన. సున్నితం, పట్టుమృదుత్వం, చక్కదనం. ఎంతో ప్రేమ పూరితం. మిగుల జాగ్రత్త తీసుకొనేది. క్రొత్త ఇమామి కేర్ టాల్క్. కేవలం రు 8.40*కే, ప్రేమతో అర్పించిన కానుక.



*స్థానిక పన్నులు అదనం

6340

# మన క్రీడా చరిత్ర సమాధుల్లో...






మన దేశానికి స్వాతంత్ర్యము రాక పూర్వము షుమారు నాలుగు దశాబ్దముల క్రితం నేతాజీ సుబాస్ చంద్రబోస్ అజాద్ హింద్ ఫౌజ్ ఏర్పరచి 'ఢిల్లీ చలో' అనే పిలుపు యిచ్చారు దేశానికి స్వాతంత్ర్యము సిద్ధించిన అనంతరము సంస్థానములు విలీనసమయమున 'ఉక్కు మనిషి' సర్దార్ వల్లభాయ్ పటేల్ రజాకారులను ఎదుర్కొనుటకు 'ఛలో హైదరాబాద్' అన్నారు తిరిగి యిప్పుడు 'చలో ఢిల్లీ– ఛలో హైదరాబాద్' అనేది వినిపిస్తూంది పరిస్థితులు మాత్రము వేరు క్రీడారంగములో యీ పిలుపు వినిపిస్తూంది జాతీయ అంతర్జాతీయ క్రీడాపోటీలకు కీలక స్థానము ఢిల్లీ, రాష్ట్రస్థాయి పోటీలకు హైదరాబాద్ కేంద్రము అయినవి క్రీడాకారులకు కావలసిన అన్ని హంగులు, నిర్వాహకుల సుఖ సౌఖ్యాలకు నగర ప్రాంతములు అనువుగాయున్నవి క్రీడారంగ అధినేతలు, నిర్వాహకులు బుద్ధి జీవులు. క్రీడా ప్రోత్సాహకులు ఢిల్లీ హైదరాబాద్ నగరములకు ప్రాధాన్యత యిచ్చినంతగా యితర ప్రదేశములకు యిష్టపడుటలేదు నగరములలో యుండి అన్ని సుఖ సౌకర్యములు, భోగములు పెద్దల ఆశ్రయము లభించినంతగా పట్టణ, గ్రామ ప్రాంతములలో యుండదు ప్రచారమునకు పత్రికలు, రేడియో టి వి వారు అందుబాటులో యుంటారు నేడు మన క్రీడారంగ పరిస్థితి అవకాశము లభించినప్పుడు సుఖ సౌకర్యాలు భవిష్యత్తు మార్గము ఏర్పరచు కోవాలి ఇది మన దేశములో గల అన్ని నగరములలో క్రీడారంగములో కనిపించు పరిస్థితి క్రికెట్ యోధులు విరామము లేకుండా ధనార్జన కొరకే సంవత్సరమంతా టెస్టు పోటీలలో పాల్గొనుచున్నారు ఫుట్‌బాల్ వీరులు కలకత్తా మార్కెట్టులో వేలంలో కొంటారు టెన్నిసు షటిల్ బాడ్మింటన్ తారలు విదేశ పర్యటనలలో ఆసక్తి కలిగియుంటారు

మన కేంద్ర ప్రభుత్వము, రాష్ట్ర ప్రభుత్వములు క్రీడలకై చేయు కేటాయింపులో ఎక్కువ భాగము అనగా 75 శాతం పైగా ఢిల్లీ, హైదరాబాద్‌లలో ఖర్చు చేయబడగా, యితర ప్రాంతములలో అతి కొద్ది ఖర్చు చేసి ఎక్కువ ఫలితాలు కావాలంటారు




ప్రపంచములో అతి పెద్ద దేశములలో, జనాభాలో ఒకటి అయిన మనదేశం, అంతర్జాతీయ క్రీడారంగములో విజయములు సాధించగల సమర్థత వున్న యువకులను రూపొందించలేక పోయినందుకు ఎంతో సిగ్గుపడాలి మన రాష్ట్ర పరిస్థితి జాతీయ స్థాయిలో కూడా అదే విధముగా యున్నది మన క్రీడారంగ పరిస్థితిపై విచార ప్రకటనలు చేయు పెద్దలు తాము క్రీడాభివృద్ధికి ఏమి చెసాము అని ఆలోచించుకోవాలి సరియైన ప్రణాళికలు లేక క్రీడా రంగంలో అనుభవము అవగాహన లేని అసమర్థులు క్రీడాసమాఖ్య అధినేతలుగా యుండి యీ దుస్థితికి తెచ్చారు క్రీడా ప్రమాణాభివృద్ధి పరచాలనే దీక్షతో సమూహ పద్ధతిని క్రీడలలో ఆసక్తి కలిగిన వారిని గుర్తించి శిక్షణ యిచ్చి మంచి క్రీడాకారులుగా రూపొందించాలనే పట్టుదల గలవారు సారధ్యము వహించాలి తమ బిడ్డలను క్రీడలకు దూరముగా యుంచి, యితరులు క్రీడలలో పాల్గొనాలి అనే ఉపన్యాసములు కాదు మనకు కావలసినది క్రీడల వలన తమ పిల్లల బవిష్యత్తు ఏమి అగునో అనే బయము పెద్దలలోను, ఆటల ఆవశ్యకత గుర్తించక పిల్లలు వాటి జోలికి పోవుటలేదు మరి కొందరు బుద్ధి జీవులు క్రీడలు కాలక్షేపానికి అనే అబిప్రాయముతో యున్నారు

వయసులో యుండవలసిన చురుకుదనము పిల్లలలో లోపించి ఉసూరుమంటూ నీరసపు దృక్కులు ప్రసరిస్తూ ఆరోగ్య లక్షణములు లేక కళావిహీనులుగా కన్పిస్తున్నారు అందుకు కారణం ఆరోగ్యము కొరకు వ్యాయమ క్రీడలు అనే ఉద్దేశము పెద్దలలో లోపించుట

## స్పోర్ట్స్ అధారిటీ ఆఫ్ ఇండియా

నిన్నటివరకు ఆల్ ఇండియా కౌన్సిల్ ఆఫ్ స్పోర్ట్సు మనదేశ క్రీడారంగ వ్యవహారములకు అధినేత నేడు దాని స్థానములో స్పోర్ట్స్ అదారిటీ ఆఫ్ ఇండియా ఏర్పడినది క్రొత్త సీసాలో పాతసారా అనే సామెత దీనికి వర్తిస్తుంది దీనితో సమాన హక్కులు గల మరొక వ్యవస్థ నేతాజీ సుబాస్ నేషనల్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ స్పోర్ట్స్ దీని కేంద్రం పాటియాలా మన బవిష్యత్తు క్రీడాకారులను రూపొందించు కోచ్ లను తయారు చేయు కార్ఖానా యిది జాతీయ ఒలింపిక్ సమాఖ్య స్వార్ధపరుల, పదవి వ్యామోహాల సమాఖ్య దేశంలో క్రీడల అబివృద్ధికై కృషి చేయాలన్న ఆలోచనకన్న అంతర్జాతీయ పోటీలు జరపాలనే ఆశ ఎక్కువ ఈ




సంస్థలు, సమాఖ్యలు అన్ని కలిసి మన దేశంలో క్రీడలకు సమాది కట్టుచున్నవి అనవచ్చు

### ఆంధ్రప్రదేశ్ స్పోర్ట్సు కౌన్సిల్

క్రీడారంగమునకు ఎట్టి సేవ చేయని సభ్యులచే పరిపాలించబడే మండలి ఈ మండలిలో సభ్యత్వము గల సభ్యులు పరిచయము చేసిన వారికి క్రీడారంగములో అనుభవము తక్కువ వారు చేసిన సేవలు అతి తక్కువ అని తెలుసు

అందరు కలిసి మన క్రీడారంగమునకు సమాధి కట్టుటకు తయారు అయినారు అనిపిస్తుంది భవిష్యత్తు తరము వారు మన క్రీడారంగ సమాధుల్లో వీరి వైబవాల పునాదులు గురించి తెలుసుకొని ఎంత బాధపడ్తారో తెలియదు

—ముకరమ్



# దూరదర్శనం

లత

### వార్తలు

పరిశ్రమలకి విద్యుచ్ఛక్తికి కోత విదించారుట దేశానికి దరిద్రం ఇంకోటి లేదు – పాలకూ రేడియో టి వి లకూ మినహాయింపు ఉన్నది. సినిమా హాళ్ళు, పత్రికాఫీసులూ ఏం చేస్తాయి? ఎన్ని జనరేటర్లు వాడినా అరవయి ఎనిమిది శాతం కోత విధిస్తే బ్రతకటం ఎలా?

### స్వరరాగ సుధ

సమర్పణ డాక్టరు బాల మురళీకృష్ణ ఇదివరకు మద్రాసులో శ్రీ మురళీగారు కొత్త ప్రయోగం చేశారు ఒక క్లాసికల్ రాగం ఆయన పాడి వినిపించిన అనంతరం అదే రాగాన్ని సినిమాలో ఎలా వాడారో చూపించటమే స్వరరాగ సుద అదే పద్ధతిన తమిళంలో చేసిన కార్యక్రమం లాటిది తెలుగుకి అర్పించిన శ్రీ బాలమురళీగారికి నమోవాకాలు – ఇలాటి సరస్వతీమూర్తితో ఒకేకాలంలో జీవించి ఒకే సంస్థలో పని చేసి మిత్రులమైనందుకు ఆ బగవంతుడికి కృతజ్ఞతలు శ్రీ వి ఎ కె రంగారావు గారి దగ్గర ఎంత సంగీతపు లైబ్రరీ ఉందో అంతులేదు అందులోంచి ఏరినవే సినిమా సంగీతం షణ్ముఖప్రియ ముత్యాలు మురళీ గారు బాగా పాడారని నేను వ్రాయటం అర్ధరహితం వారు బాగా తప్ప పాడ లేరు టి వి వారికి మరీ మరీ ధన్యవాదాలు

### ఏక్ కహానీ

దామోదర్‌మౌజ వ్రాసిన కొంకణి కథ మనోతి

ఒక వృద్ధుడు తన తప్పిపోయిన కొడుకు కోసం ఆవేదన చెందుతాడు. చర్చి ఫాదరు తప్పకుండా నీ కొడుకు తిరిగొస్తాడు అని ధైర్యం చెపుతాడు ఇంతలో ఒక తల్లి తన కొడుకుని చర్చి సేవలో పెడుతుంది ఆ పిల్లవాడిని తయారు చేసి వృద్ధుడికి కొడుకుని చూపిద్దామని ఫాదర్ అనుకుంటాడు. కాని మరణం దగ్గిరకొచ్చింది వృద్ధుడికి కొడుకుని కలవరిస్తూ ఉంటాడు ఫాదర్ బయటికొచ్చి తన గౌను బైట తగిలించి నేను జాజాని వచ్చాను అంటాడు వృద్ధుడు శాంతిగా మరణిస్తాడు

ఈ రచయితకి సాహిత్య ఎకాడెమీ ఎవార్డు వచ్చిందని గర్వంగా చెప్పింది ఎనౌన్సరు అప్పుడు ఆంధ్రులకి సాహిత్య ఎకాడెమి ఎవార్డు లేకుండా చేసిన రామద్వయం మీద అసహ్యం వేసింది సాహిత్య ఎకాడెమీ ఎలక్టెడ్ వైస్ ప్రెసిడెంటుని నేను ఎన్నిక రద్దు చేసే హక్కు ఏ ప్రభుత్వానికీ లేదు – అయినా తెలుగుదేశంలో ప్రభుత్వం కొన్ని సంప్రదాయాలకూ ఔన్నత్యాలకూ కట్టుబడి లేదు గద

### రామాయణం

సమర్పణ రామానందసాగర్ – మర్యాదరాముడు అంటే మర్ – మరణం కావచ్చును యాద్ అంటే జ్ఞాపకం మృత్యువు తెలిపాడు



"రామాయణం"లో సీతగా దీపిక

రామపట్టాభిషేకం నిర్ణయమయింది ప్రజా పరిషత్తు ఆజ్ఞతో రామపట్టాబిషేకం నిర్ణయించాడు దశరథుడు – అయితే వాల్మీకంలో తండ్రితో అర్యూ చెయ్యడు శ్రీరాముడు కారణం ఆ పట్టాభిషేకం జరగదని అతనికి తెలుసునని ధ్వనిస్తాడు వాల్మీకి మహర్షి ఇందులో పట్టాబిషేకం వద్దన్న రాముడికి దశరధుడి చేత దండం పెట్టించడంలో ఔచిత్యం లేదు అనౌచిత్యాలు అలా ఉంచితే – మామూలు మనిషికి ఈ రామాయణం చాలా బాగుంది అది సుధ అది మదువు □

# అందాలు చిందే ఫ్రెస్కా
# సుగంధాలు చిమ్మే ఫ్రెస్కా

గోద్రెజ్ సమర్పణ
అద్భుతమైన లగ్జరీ సబ్బు
ఫ్రెస్కా విలాసవంతమైన విలువైన
సుగంధ పరిమళభరితమైన సబ్బు
ఎంతో నురుగు—పాల మీగడ తరగలా
త్వరగా తరగనిది అరగనిది ఫ్రెస్కా
లగ్జరీ సబ్బు మీకు నచ్చే మిమ్మల్ని
ఆశ్చర్యపరిచే తక్కువ ధరలో




## *గోద్రెజ్ వారి అందం చిందించే అద్భుతం

* బరువు 75 గ్రాములు స్థానిక పన్నులు అదనం

Enterprise GS/60 11